సాహిత్యం

B.S. Ramulu Batukuporu Navala - Samajikatha M.phil. Thesis

Palla Malathi Chndra




పల్లా మాలతి చంద్ర కు ఎం.ఫిల్ సర్టిఫికేట్‌తోపాటు గోల్డ్‌మెడల్ అందిస్తున్న నాగార్జున యూనివర్సిటీ వి.సి. వి. బాల మోహన్‌దాస్. ఫిబ్రవరి, 2008.



బతుకుపోరు నవల గురించి చర్చిస్తున్న మాలతి చంద్ర, బి.ఎస్. రాములు, కాసుల ప్రతాప రెడ్డి

విశాల సాహితి ప్రచురణ

Cover art by Aelay Laxman

బి.ఎస్.రాములు బతుకుపోరు నవల - సామాజికత పల్లా మాలతి చంద్ర

# బి.ఎస్.రాములు
# బతుకుపోరు నవల
## సామాజికత



## పల్లా మాలతి చంద్ర

ఆచార్య నాగార్జున యూనివర్సిటీ

గోల్డ్‌మెడల్ [illegible] సిద్ధాంత గ్రంథం

తిరిగి చూడలేదు. మడమ తిప్పని వీరుడిలా కలం దించని శూరుడిలా అలుపెరగని అక్షరాలను లక్షల కొద్దీ చికిలీచేసి నగిషీపడుతున్న నిత్యశ్రామికుడు బి.ఎస్.రాములు. అందుకే ఈ నవలను లఘుపరిశోధనకు స్వీకరించాను. పరిశోధక విద్యార్థులు ఎవరు ఏది చేపడితే బాగుంటుందనేది పర్యవేక్షక బాధ్యతల్లో ఒకటి. మాలతీ చంద్ర డిగ్రీలో నా శ్రీమతి డాక్టర్ జ్యోతికి ప్రియమైన విద్యార్థి. అనంతరం పి.జి. విద్యార్థిగా నా వద్ద చేరినప్పటి నుంచీ చలాకీగా ఉండేది. పరిశోధనకూ అవకాశం వచ్చింది. బతుకుపోరు యిచ్చాను. వారం తిరగకుండా నవల చదివి పాత్ర చిత్రణలోనూ, రచనా శిల్ప విన్యాసాన్ని రచయిత దృక్పథాన్ని వివరించింది. బాగుందనుకున్నా. కేవలం పుస్తక జ్ఞానం కాదు ప్రపంచ జ్ఞానం అవసరమనిపించింది. రాములు గారింటికి వెళ్ళి బీడీ కార్మికుల జీవితాన్ని, వారి వృత్తి నైపుణ్యాన్ని చూడమన్నాను. అంతే మరో వారానికి పయనమయ్యింది. వెళ్ళిన వెంటనే ప్రతిరోజూ చేస్తున్న పని, చూస్తున్నపనీ తెలియజేసేది. అన్నింటికన్నా రాములుగారి శ్రీమతి చూపే ప్రేమ ఆదరణకు ముగ్ధురాలై ప్రతిరోజూ ఆ తల్లి విషయాలు చెప్పేది. ఆనందం వేసేది. అంతే నెలరోజుల్లో తన క్షేత్ర పరిశీలన పూర్తి చేసుకుని ఆపై తుదిమెరుగులు దిద్దుకుంది. ఎమ్.ఫిల్‌కి మా విశ్వవిద్యాలయం బంగారు పతకం కూడా లభించింది.

పరిశోధన అంటే కేవలం పుస్తకాలకు పరిమితమై రాస్తే చాలదు. సమాజం స్థితిగతులు పూర్వోత్తరాలు క్షుణ్ణంగా తెలియాలి. అదీ పరిశోధన. బతుకుపోరు కేవలం కల్పిత గాథ కాదు. బడుగు బతుకుల జీవిత వ్యథ. బీడీలు పట్టి, చుట్టి పట్టెడన్నం కోసం శ్రమిస్తున్న మహిళల వ్యథాభరిత బాధాచరిత యిది. అందులోనుంచి పుట్టిన రాములు బీడీ వదిలి కలం పట్టి కొత్త సూర్యుడి కోసం అన్వేషించిన అక్షరాలివి. అనుభవించిన బాధల గాథలను భవితకు అక్షరబద్ధం చేసిన అచ్చు అక్షరాలివి. అందుకే దేశమయినా చూడు, అథవా విద్యాకోశమయినా చూడు అన్నారు. ముందులోకం చూడాలి. అదే నిజమైన చదువు. అక్కడే పరిశోధన ప్రారంభం. సమాజంలోంచి వచ్చేదే నిజమైన పరిశోధన. అందుకే ఈ నాలుగు మాటలు పంచుకుందామని రాశాను.

చర్చ్‌పేట,
తెనాలి

**-గుజ్జర్లమూడి కృపాచారి**
20-11-2008



# విషయసూచిక

## వాఙ్మూలం

**బి.ఎస్.రాములు బతుకు పోరు నవల - సామాజికత అనే** ఈ లఘు సిద్ధాంత వ్యాసం నేను స్వయంగా రచించానని, దీనిని ఏ ఇతర పట్టా కోసం గాని, డిప్లమో కోసం గాని మరియే ఇతర బిరుదు కోసం గాని, ఇంతకు ముందు ఏ విశ్వవిద్యాలయానికి, ఏ ఇతర సంస్థకు సమర్పించలేదని ఇందుమూలంగా తెలియజేస్తున్నాను.

**పరిశోధకురాలు**

## ధ్రువీకరణ

ఈ లఘు సిద్ధాంత వ్యాసం కుమారి పల్లా మాలతిచంద్ర రచించారని, ఈ పరిశోధన ఆమె స్వంత కృషి అని ధ్రువీకరిస్తున్నాను.

**గుజ్జర్లమూడి కృపాచారి**
పర్యవేక్షకులు



# భూమిక

నేను ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయంలో పి.జి. చదివేటప్పుడు మాగురువుగారు ఆచార్య జి. కృపాచారిగారి ఆలోచనలు నన్ను పరిశోధనవైపు ప్రభావితం చేశాయి. నూతన విషయాలను అన్వేషించటంలో ముందుండే కృపాచారిగారు ఎంతో మంది విద్యార్థులకు ఆదర్శనీయులు. మీ పర్యవేక్షణలో పరిశోధన చేయాలనివుంది అని అడిగినవెంటనే సామాజిక పరిస్థితుల వైపు వారి చూపుమళ్లింది. చరిత్రలో మూలసిద్ధాంత విషయాలను పరిశోధనకు ఎంచుకోవాలని సూచించారు. ఆ క్రమంలోనే బీడీ కార్మికుల పాలిట వెలుగు దీపంలా ఉన్న ' బతుకు పోరు ' నవలను పరిశీలించమని సూచించారు. మా గురువుగారి ప్రత్యక్ష పర్యవేక్షణలో ప్రారంభమైంది నా పరిశోధన.

1982సం॥లో వెలువడిన 'బతుకుపోరు' నవల తెలంగాణ స్త్రీల జీవితాలను, సంస్కృతిని చిత్రించింది. చాలీ చాలని జీతాలతో కష్టాలు, సమస్యలు, ఎదుర్కుంటూ, బతుకు పోరును ఈదుకునే పేదలవాస్తవగాథా చిత్రణయిది. బీడీ కార్మికులను ఇప్పుడు కొత్త సమస్య వేధిస్తుంది. బీడీ కట్టలపై పుర్రెగుర్తులను ముద్రించటం వల్ల వేలాది మంది కార్మికులు ఉపాధి కోల్పోయే అవకాశంవుంది. బీడీల తయారీ కుటీర పరిశ్రమగా ప్రారంభమైనప్పటి నుంచి స్త్రీలే దానిపై ఆధారపడి జీవిస్తున్నారు. ఆస్త్రీల సమస్యలకు అద్దంపట్టే " బతుకుపోరు " నవలను సామాజిక దృక్కోణం నుంచి విశ్లేషించడం జరిగింది.

మొదటి అధ్యాయంలో నవల పుట్టుక నేపథ్యం, నవలా ప్రక్రియ విశిష్టత పఠనాశక్తిని పెంచిన నవలా ప్రక్రియ, తెలుగు నవల నేపథ్యం, తెలంగాణ నవల-పరిణామం-చారిత్రక నేపథ్యం, ఆంధ్ర మాండలికం-తెలంగాణ భాష పరిణామాలు, తెలంగాణ నవలా క్రమం, నవలల వర్గీకరణ, 2007లో నవల స్థానం గురించి వివరించడం జరిగింది.

రెండవ అధ్యాయంలో బి.ఎస్.రాములు జీవిత రేఖలు, పరిచయం, పుట్టుక, బాల్యం-విద్యాభ్యాసం, కుటుంబం, రచనా దృక్పథం, రచనలు, పురస్కారాలు, రాములు గారి సంపాదకత్వంలో వెలువడిన పుస్తకాలు-పత్రికలు, విశాల సాహితీ పురస్కారాలు పేర్కొనడం జరిగింది.

మూడవ అధ్యాయంలో బతుకుపోరు నవల - సామాజిక నేపథ్యం - చరిత్ర, బీడీ కార్మికుల సమస్యలు, బీడీ పరిశ్రమ ప్రస్థానం, బీడీ ఆకు సేకరణ, బీడీలోని పొగాకు పంట పరిశ్రమ, స్త్రీల పరిశ్రమగా బీడీ పరిశ్రమ, బీడీ పరిశ్రమ ఒక కన్నతల్లి, ఇతివృత్తం, కథా పరిచయం విపులంగా ప్రస్తావించడం జరిగింది.

నాల్గవ అధ్యాయంలో బతుకుపోరు నవలలో వాస్తవికత, పాత్రల చిత్రణ, లక్ష్మీనారాయణ, సుగుణ, రామక్క, రాజయ్య, రాజేశం, సత్తెక్క, సేటు, దాదా, లచ్చిరాజవ్వ, చాకలిమైసి, శంకరి, లక్ష్మీనారాయణ గురించి వివరించడం జరిగింది.

ఐదవ అధ్యాయంలో బతుకుపోరులో వాస్తవిక జీవిత చిత్రణ, నవల్లో కార్మిక స్త్రీలు, పల్లెపరిణామం, ప్రజల కళారూపాలు ఆటపాటలు, బీడి పరిశ్రమ తీరు, స్త్రీల చైతన్యం, తెలంగాణ సంస్కృతి - సంప్రదాయాలు మొదలయినవి అధ్యయనం చేయడం జరిగింది.

ఆరవ అధ్యాయంలో బతుకుపోరు - రచనా శిల్పం, నవలలో సంభాషణ శైలి, తెలంగాణ మాండలిక భాషా నుడికారాలు, జంటపదాలు, అన్యదేశ్య భాషాపదాలు, సామెతలు - నుడికారాలు, పలుకుబడులు, నిర్దేశక వాక్యాలు, ప్రశ్నార్థక వాక్యాలు, ఆశ్చర్యార్థక వాక్యాలు, మనస్తత్వాన్ని ధ్వనించే వాక్యాలు, క్రియా వాచకాలు, ప్రకృతి సన్నివేశ వర్ణనలు వివరించడం జరిగింది.

ఈ లఘు సిద్ధాంత వ్యాసాన్ని సహృదయులైన పండిత పరిశోధకుల ఆమోదం పొందగలదని ఆశిస్తు - సూచనలు, సలహాలు, సవరణలు, శిరోధార్యంగా స్వీకరిస్తానని సవినయంగ సమర్పిస్తున్నాను.



**మొదటి అధ్యాయం**

# 'బతుకుపోరు' నవల - సామాజికత

## నవల - పుట్టుక నేపథ్యం

### కాగితం - అచ్చుయంత్రం మానవ సమాజంలో ఒక మలుపు

కాగితం, అచ్చుయంత్రం మానవాళి పరిణామంలో ఒక మహోన్నతమైన మలుపు. ఇవి రెండూ మానవ జీవితాన్ని శాసించేవిగా, మలిచేవిగా ప్రముఖ స్థానాన్ని ఆక్రమించాయి. మనిషికి బట్టలు కట్టుకోవడం ఎంత అవసరమో మానవ సమాజానికి కాగితం, లిపి, అచ్చు యంత్రం అంత ప్రధానంగా మారాయి. బట్టలు లేని దశను ఆదిమదశ అంటారు. అలాగే కాగితం, కలం, అచ్చుయంత్రం లేని దశను నిరక్షరాస్య దశ అంటారు. అచ్చుయంత్రం, కాగితం, కలం మానవ సమాజం సాధించిన జ్ఞానాన్ని, అనుభవాలను నిక్షిప్తం చేసి అందరికి, తర్వాతి తరాలకు అందించడం వేగంగా సాగింది.

సాహిత్య చరిత్ర సమాజ చరిత్రలో అంతర్భాగం. అందువల్ల సామాజిక పరిణామాన్న నుసరించి సామాజిక దృక్పథాన్ని సాహిత్య రచనలో ప్రవేశ పెట్టడం జరుగుతుంది. ఆధునిక సాహిత్యం మొదలై 160 ఏళ్లు అయింది. అచ్చు యంత్రానికి, రచనా సాహిత్యానికి సంబంధం వుంది. అచ్చు యంత్రం వల్ల అంతదాకా సాగిన మౌఖిక ఆదేశాల పరిపాలన రాతపూర్వక పరిపాలనగా రూపుదిద్దుకుంది. మాట్లాడే భాష అచ్చుయంత్రం రాకతో ముద్రించడం సులభమైంది. దాంతో వ్యవహారిక భాష అవసరమైంది. అచ్చు యంత్రం వచ్చాక సాహిత్యం కొత్త రూపాలు సంతరించుకున్నది. పారిశ్రామిక విప్లవం తెచ్చిన పరిణామాలు సాహిత్య ప్రక్రియలను, కళలను మౌళిక మార్పులకు గురి చేశాయి. కొత్త ప్రక్రియలు విస్తరించాయి.

లోకంలో వున్న సుఖ దుఃఖాలలో పాలు పంచుకుంటు ఇతరులలో కూడా సుఖదుఃఖాల అనుభూతులను కలుగజేయగలిగిన వాడే నిజమైన సాహిత్య కారుడు అంటాడు మున్షీ ప్రేమ్‌చంద్. ఆయన రాయబడినదంతా సాహిత్యమంటే నేనెప్పుడు

అంగీకరించను అని అంటూ సాహిత్యం గురించి ఇలా అంటారు. "సత్యాన్ని వ్యక్తీకరిస్తూ భాష సరళంగా, సుందరంగా వుండి మనస్సు మీద, మేధస్సు మీద కూడా ప్రభావం చూపేది మాత్రమే సాహిత్యమనాలి. జీవితంలో వున్న నగ్నసత్యాలను, అనుభూతులను యధాతధంగా వర్ణించినప్పుడే ఈ లక్షణాలు ముఖ్యాంశాలుగా నిలబడతాయి. రచయిత రచనలో సత్యము, సహజత వున్నట్లయితే రచన కొన్ని శతాబ్దాల వరకు కొన్ని యుగాల వరకు మానవ హృదయాన్ని కదిలిస్తునే వుంటుంది. పూర్వకాలంలో సమాజ నిర్మాణం మతం చేతిలో వుండేది. ఇప్పుడు సాహిత్యం ఆ బాధ్యతను స్వీకరించింది."(1)

"జీవితంలో ఎప్పుడూ దుఃఖం అంటే ఎరుగని వాళ్ళు కూడా కథ చదివి దుః ఖిస్తారు. దీనికి కారణం ఒకటే కావచ్చు. కథలో వున్న సూక్ష్మ స్పర్శలు వాస్తవిక జీవితంలో లేకపోవచ్చు. మానవుడు సహజంగా దైవంతో సమానమైన లక్షణాలు కలిగి వుంటాడు. కాని కాల ప్రభావానికి చెడు పరిస్థితులకు వశీభూతుడై తన దైవత్వాన్ని పోగొట్టుకుంటాడు. సాహిత్యం ఈ దైవత్వాన్ని యథాస్థానంలో ప్రతిష్ఠింప చేయడానికి కృషి చేస్తుంది. మన సభ్యత సాహిత్యం మీదే ఆధారపడి వుంటుంది. మన జీవితమంతా చివరకు మనం కూడా సాహిత్యం ద్వారానే నిర్మించబడ్డాం. సాహిత్యం ఔన్నత్యం పొందితేనే దేశం ఔన్నత్యం పొందుతుంది" అని ప్రేమ్‌చంద్ సాహిత్యం యొక్క ప్రాధాన్యతని స్పష్టం చేశారు. (2)

సాహిత్యం, కళల ప్రాధాన్యత గురించి సుప్రసిద్ధ సాహితీవేత్త క్రిస్టోఫర్ కాడ్వెల్ ఇలా అంటారు "ఓదార్పు లేని చోట ఓదార్పు కళ. స్వస్థత లేనిచోట స్వస్థత పరిచేది కళ. నిర్జీవానికి జీవం పోసేది కళ. అందుకనే కళ ఒక శక్తి. అది ఘర్షణలో ఉద్భవిస్తుంది. ఎందుకంటే సమాజంలో భ్రమకు, వాస్తవానికి తగాదా వుంది. అది సామాజిక సమస్యల ఘర్షణ. కాబట్టి కళాకారుడు దానికి పరిష్కారం చూపుతాడు."(3) బతుకుపోరు నవల ఈ దృక్పధంతోనే రాయబడినట్లు గమనించవచ్చు.

వల్లంపాటి వెంకటసుబ్బయ్య నవల పుట్టుక, ప్రాధాన్యత గురించి, పరిమితి గురించి ఇలా పేర్కొన్నారు. "నవల అచ్చుయంత్రం మీద చాలా ఎక్కువగా ఆధారపడ్డ సాహిత్య ప్రక్రియ. అచ్చు నుంచి వేరుచేసినప్పుడు నవల అనేక ప్రక్రియా లక్షణాలను పోగొట్టుకుంటుంది. నవలను చదవటం వ్యక్తిగతమైన నిశ్శబ్దానుభవం."(4) అయితే 'బతుకుపోరు' నవల సామూహికంగా విన్న నవల. సామూహికంగా చదివిన నవల. అది నిశ్శబ్దానుభవానికి భిన్నమైన సామూహిక, సామాజిక జీవనానికి సంబంధించిన నవల.



### కాగితం, అచ్చుయంత్రం లేకముందు-వచ్చినతర్వాత సాహిత్యంలో తేడా

16వ శతాబ్దంలో అచ్చుయంత్రం వ్యాప్తిలోకి వచ్చింది. తద్వారా పుస్తకాలు, రచనలు ఎక్కువ మందికి అందుబాటులోకి రావడం మొదలైంది. అచ్చుయంత్రం రాకముందు రచనలను తాటి ఆకుల మీద, రాగి రేకుల మీద, తోళ్ళమీద, రాళ్ళమీద రాసి భద్రపరిచేవారు. ఇవి కష్టంతో, ఎంతో ఖర్చుతో కూడుకున్న పని. అందువల్ల ప్రజలు ధారణ శక్తి మీద ఆధారపడేవారు. నోటికి అప్పగించడం, వల్లెవేయడం, బట్టీ పెట్టడం ప్రాధాన్యత వహించాయి. బట్టీ పెట్టడం, వల్లె వేయడంలో వేదాలు ఇప్పటికీ నిలిచి వున్న తొలినాటి సాహిత్యం. (5)

### లిఖిత సాహిత్యం-జానపద సాహిత్యం

అచ్చుయంత్రం రాకముందు సాహిత్యంలో జ్ఞాపకశక్తికి అనువుగా, బట్టీకి అనువుగా, లయాత్మకంగా రచనలు కొనసాగాయి. దీనిని శిష్ట సాహిత్యం అని, రాజాశ్రిత సాహిత్యం అని, జానపద సాహిత్యం అని, శ్రవ్య సాహిత్యం అని, లిఖిత సాహిత్యం అని వర్గీకరించారు. తాటాకుల మీద, తోళ్ళమీద, రాళ్ళమీద లిపిబద్ధమైన సాహిత్యాన్ని లిఖిత సాహిత్యం అన్నారు. లిపిబద్ధం కాకుండా ప్రజల నోళ్ళల్లో, హృదయాల్లో నానుతూ నోటిద్వారా పరంపరానుగతంగా కొనసాగుతూ వచ్చిన సాహిత్యాన్ని శ్రవ్య సాహిత్యం (ఓరల్ లిటరేచర్) అని, జానపద సాహిత్యం (ఫోక్ లిటరేచర్) అని పిలిచారు.

### ధారణ శక్తి, జ్ఞాపకశక్తి అవసరాన్ని తీర్చిన అచ్చుయంత్రం, కాగితం

పూర్వం పండితులు రాసిన కావ్యానికి, ప్రతులు రాయడానికి "వ్రాయసకాండ్లు" ఉండేవారు. ఇలా రాసిన ప్రతులను 'పుత్రిక'లు అనేవారు. అయినప్పటికి ఇది శ్రమ, సమయహరణంతో కూడిన పనిగా వుండేది కాబట్టి ఎక్కువ పుత్రికలు తయారయ్యేవి కావు. అప్పటికి ఇంకా కాగితం, కలం రాలేదు. తాటాకుపై గంటంతో యీ పత్రికలను తయారు చేసేవారు. ఈ తాళపత్రాల తయారీ కూడా చాలా శ్రమతో కూడి వుండేది. లేతవిగానీ బాగా ముదరని తాటి ఆకులను కోసి తెచ్చి వాటిని నీళ్ళలో నానబెట్టి మరుగుతున్న పుసుపు నీటిలో ముంచి మళ్ళీ నీడలో ఆరబెట్టేవారట. తర్వాత వాటన్నింటిని ఒకే సైజులో కత్తిరించి రెండు చివరల రంధ్రాలు చేసి పైన, క్రింద తక్కువ బరువు వున్న చెక్క ముక్కలను అమర్చేవారు. ఆ రంధ్రాల గుండాజనుముతో పేర్చిన దారాలను దూర్చి దాన్ని దండముగా బంధించి కవరులో కట్టేవారు.

అచ్చు యంత్రం, కాగితం, కలం వచ్చాక సాహిత్య ఉత్పత్తి విరివిగా పెరిగింది. దాంతో పుస్తక ప్రచురణ వేగం పుంజుకున్నది.

ధారణశక్తి మీద ఆధారపడే అవసరం మానవ సమాజానికి తగ్గింది. ఈ రోజు క్యాలిక్యులేటర్లు వచ్చాక నాలుగు పద్దుల కిరాణా బిల్లులు కూడా క్యాలిక్యులేటర్ల ద్వారా లెక్కించి బిల్లు చెప్తున్నారు. ఇలా ఎక్కాలను, లెక్కలను వల్లె వేసే కాలాన్ని క్యాలిక్యులేటర్ తగ్గించేసింది. ధారణశక్తితో జ్ఞాపకం ఉంచుకోవలసిన కాలంలో రచనలు సంక్షిప్తంగా ఉండేవి. వాటి సంఖ్య చాలా తక్కువగా ఉండేది. అచ్చు యంత్రం లేకముందు ఒక గ్రంథం అయిదారు ప్రతులకన్నా ఎక్కువ రాసేవారు కాదు. ఇప్పుడు లక్షల, కోట్ల ప్రతులు ప్రింట్ చేస్తున్నారు. ఇది శాస్త్రవిజ్ఞానం, వైజ్ఞానిక ప్రగతి సాధించిన విజయం.

## వైజ్ఞానిక ఆవిష్కరణలతో మారిన మానవ సమాజం

రాజరికాల కాలంలో వ్యవసాయదారులు, శ్రమజీవులు, రాజోద్యోగులు, రాజులు అనే వర్గాలు వుండేవి. కుటీర పరిశ్రమలు, వేట, వ్యవసాయం, ప్రకృతి అనేవి ఆనాటి సంపదను సృష్టించాయి. 17వ శతాబ్దం నుండి వైజ్ఞానిక శాస్త్రవేత్తలు అనేక నూతన ఆవిష్కరణలు చేశారు. ఆవిరియంత్రం కనుక్కోవడం అందులో ఒకటి. జెన్నీ నూలు వడుకు యంత్రంతో పారిశ్రామిక విప్లవం పూర్తి స్థాయిలో వేగం పుంజుకుంది. కుటీర పరిశ్రమల స్థానంలో భారీ యంత్రాలను ఉత్పత్తి చేసే పారిశ్రామిక ఉత్పత్తి వేగం పుంజుకుంది.

## వైజ్ఞానిక ఆవిష్కరణలు - పారిశ్రామిక విప్లవం

యంత్రాలతో ఉత్పత్తి పెరిగిన దశను "పారిశ్రామిక విప్లవం" అని పిలిచారు. పారిశ్రామిక విప్లవంతో యంత్రం సహాయంతో పూర్వం వందమంది ఉత్పత్తి చేసే సరుకులను పదిమంది ఉత్పత్తి చేశారు. సరుకుల ఉత్పత్తి చవకగా మారింది. కుటీర పరిశ్రమలు దెబ్బతిన్నాయి. వాళ్ళు యంత్రాలను నడిపించే కార్మికులుగా మారారు. పారిశ్రామిక విప్లవం వ్యవసాయం మీద ఆధారపడి నడిచే భూస్వాముల ఆధిపత్యానికి సవాలుగా ఎదిగింది. పారిశ్రామిక విప్లవం రాచరిక వ్యవస్థకు బదులుగా ప్రజాస్వామ్యాన్ని ముందుకు తెచ్చింది. అలా ప్రపంచ దేశాల్లో ప్రజాస్వామ్య వ్యవస్థలు ఏర్పడ్డాయి. అందుకోసం ఎన్నో యుద్ధాలు, సంఘర్షణలు, ఉద్యమాలు సాగాయి.

"ఈనాడు మధ్య తరగతిని స్తబ్ధమైన వర్గంగా చాలా మంది భావిస్తారు. కానీ ఒకనాడు మధ్యతరగతి చాలా ప్రగతిశీలమైన వర్గం. సమాజంలో విప్లవాత్మకమైన మార్పులకు కారణభూతమైన వర్గం. తమను అన్ని రకాలుగా తొక్కిపట్టి, స్వాతంత్ర్యం లేకుండా చేస్తున్న ఫ్యూడల్ భూస్వామ్యవర్గం మీద తిరుగుబాటు చేసింది వీరే.



ప్రజాస్వామ్యం కోసం పోరాడింది వీరే. ప్రజాస్వామ్యం కోసం ప్రపంచ చరిత్రలోనే మొదటిసారిగా బ్రిటిష్ రాజు మొదటి ఛార్లెస్ తల నరికింది వీరే. సాహిత్య చరిత్రలో అత్యంత విప్లవాత్మక పరిణామమైన నవల ప్రాదుర్భావానికి కారణభూతులు వీరే!"(6)

## పారిశ్రామిక విప్లవం - ప్రజాస్వామ్యం కవలలు

పారిశ్రామిక విప్లవం, ప్రజాస్వామిక వ్యవస్థ రెండూ ఒకే కుదురు నుండి పుట్టి పెరిగాయి. ఆధునిక ప్రక్రియలు కూడా యీ కుదురు నుండే పుట్టి పెరిగాయి. పారిశ్రామిక ఉత్పత్తి విధానంలో భాగంగా ఒకవైపు కార్మికులు, ఒకవైపు మధ్యతరగతి మరొకవైపు పారిశ్రామిక యజమానులు, రాజకీయ నాయకులు, పాలకవర్గాలు అనే కొత్త వర్గాలు విస్తరించాయి. ఈ తరంలో పత్రికలు, పుస్తక ప్రచురణ వేగం పెంచుకుంది. అక్షరాస్యతకు మునుపు ఎన్నడూ లేని ప్రాధాన్యత పెరిగింది. కథ, నవల, వ్యాసరచన, వార్తా రచన, సంపాదకీయం, కరపత్రం, ఆధునిక నాటకం, మొదలైన లేఖలు, శీర్షికలు మొదలైన ప్రక్రియలు పెరిగాయి.

సాహితీ చరిత్రను కొత్త చూపుతో తిరగరాయాలి అనే గ్రంథంలో బి.ఎస్.రాములు ఇలా అంటారు. "18వ శతాబ్దం నుండి యూరప్ దేశాల్లో నూతన ఆవిష్కరణలు జరిగాయి. అచ్చు యంత్రం జ్ఞానం అందరికి అందడంలో విప్లవాత్మక పాత్ర నిర్వహించింది. సైన్సు అభివృద్ధి సాహిత్య, కళలు, ప్రదర్శనా కళారూపాలు, పత్రికలు, ప్రజాస్వామ్యం అభివృద్ధికి అంతిమంగా మొత్తం ప్రజల అభివృద్ధికి పరిణామం చెందింది."(7)

## నవలా ప్రక్రియ విశిష్టత - మధ్య తరగతి

'నవల' అనే సాహిత్య ప్రక్రియ జీవితంలోని, సమాజంలోని సమస్త పార్శ్వాలను చిత్రించడానికి అవకాశం వున్న ప్రక్రియగా విస్తరించింది. పూర్వం మహాకావ్యాలు అని పిలిచిన రచనల స్థాయిలో, వాటికన్నా విస్తృతంగా జీవిత కోణాలను విశ్లేషించింది నవల. నవలను ప్రజాస్వామ్య వ్యవస్థలో పారిశ్రామిక ఉద్యమంలో ఎదిగిన మధ్య తరగతి బాగా ఆదరించారు. ఆ తర్వాత సమాజంలోని అన్ని వర్గాలు నవలను ఆదరించారు. ఆధునిక జీవితాన్ని, సమాజాన్ని అర్థం చేసుకోడానికి నవల ఒక ముఖ్య సాధనమైనది. సామాజిక చరిత్రను పరిణామాన్ని, మానవ స్వభావ చిత్రణను, నవలలు చేసినంతగా మరో ప్రక్రియ చేయలేదు. మిగతా ప్రక్రియలకు యీ విస్తృతి లేదు. అందువల్లనే నవలా ప్రక్రియ కాగితం, కలం, అచ్చుయంత్రం, మధ్యతరగతి ఆలంబనతో విశ్వవ్యాప్తంగా విస్తరించింది. మానవ జీవిత పరిణామాలు విశ్వవ్యాప్తంగా నవలల్లో రికార్డు అయ్యాయి.

### పఠనాసక్తిని పెంచిన నవలా ప్రక్రియ

నవల ప్రజల్లో పఠనాసక్తిని పెంపొందించింది. అక్షరాస్యతకు నవలా పఠనానికి మధ్య సంబంధం వుంది. అక్షరాస్యత పెరిగే క్రమంలో నవలా పాఠకుల శ్రేణి విస్తృతంగా పెరిగింది. అలా ప్రజల జీవితాల్లోకి నవల చొచ్చుకుపోయింది.

"నవలలోని ప్రధానాంగాలు 1. కథ, 2. కథావస్తువు, 3. పాత్రలు, 4. నేపథ్యం. వీటి తులనాత్మక ప్రాధాన్యతను గురించి ఒక మాట చెప్పాలి. ఏదో ఒక వరుసలో వీటిని చెప్పక తప్పదు. కాబట్టి పైన పేర్కొన్న వరుసలో ఇవి ప్రస్తావించబడ్డాయి. ఈ వరుసలో వీటిని చర్చించటం కూడా సులువు. అంతేకానీ రచయిత మనస్సులో నవల రూపొందే క్రమంలో పైన పేర్కొన్న అంగాలు ఇదే వరుసలో ఉద్భవిస్తాయని భావించటం తప్పు. పైన పేర్కొన్న అంగాలు నాలుగూ పరస్పరాశ్రయాలు." [8]

"భారతీయ నవల జన్మ కేవలం సాహిత్య ప్రక్రియగానే కాకుండా దేశవ్యాప్తంగా భాషా విప్లవానికి కూడా ఆలంబనగా మారింది. పాశ్చాత్య భాషా అధ్యయనం సాహిత్యం, నాగరికత ప్రేరణతో భారతదేశంలో వెలువడిన తొలి నవల బెంగాలీ నవల. టేక్‌చంద్ ఠాకూర్ అనే కలం పేరుతో చంద్రమిత్ర (1814-1888) అలారేర్, గరేర్ దులాల్ (పెద్దింటి గారాల బిడ్డ) అనే నవల 1856లో వెలువడింది. రెండవ నవలగా మరాఠీలో బాబా పద్మన్‌జీ రాసిన యమునా పర్యటన్ (1857) మలయాళంలో అప్పులడంగడి రాసిన కుందలత నవల అని చెప్పుకోవచ్చు." [9]

### అక్షరాస్యత పరిమితి కారణంగా కుదించుకుపోయిన నవల

భారతదేశం విషయానికి వస్తే అక్షరాస్యత కొన్ని కులాలకే పరిమితమైంది. ఎనిమిది నుండి పదిశాతం మేరకైనా అక్షరాస్యత ఎదగని సమాజంలో భారతీయ నవల పుట్టింది. రాసేవాళ్ళు చదివేవాళ్ళు కూడా బ్రాహ్మణ తదితర కొన్ని కులాల నుండే పుట్టి పెరిగారు. వాళ్ళ జీవితాలనే నవలల్లో రాశారు. వారి అగ్రవర్ణ దృక్పథమే మొత్తం సమాజం దృక్పథంగా ప్రాచుర్యంలోకి తెచ్చారు. ఇలా కాగితం, అచ్చుయంత్రం, కలం ఆసరాతో అగ్రవర్ణ జీవితం, సంస్కృతి మునుపెన్నడూ లేనంతగా ప్రజల మీద రుద్దబడింది. [2]

"ఇంగ్లీషు, రష్యన్, ఫ్రెంచి మొ॥ కథల్లో అక్కడ మధ్య తరగతిగా ఎదిగిన వర్గంలో శ్రమను గౌరవించే సంస్కృతి ఉంటుంది. భారతీయ మధ్య తరగతి వర్గం, వర్గ కుల, ఆధిక్యత నుండి, శ్రామిక వర్గ వ్యతిరేక సంస్కృతి నుండి ఉత్పత్తిలో సంబంధం లేని కులాల నుండి ఎదిగిన సంకుచిత, స్వార్థపూరిత దృక్పథం గల వర్గం. దీనికి ప్రజల్ని తమతో సమానంగా గౌరవించే సంస్కృతి దృక్పథం లేదు. అంబేద్కర్ ఒక మాటంటాడు. కాంగ్రెస్ వాదులు రాజకీయంగా అతివాదులు, సామాజికంగా సంస్కరణల వ్యతిరేకులు అని. స్వాతంత్ర్యం వచ్చాక సాహిత్య కళా రంగాల్లో అది వేళ్ళూనుకోవడం బాధాకరం. సార్వత్రిక ఓటుహక్కు అన్ని పార్టీలను ప్రజల్ని పట్టించుకునేదిగా మార్చింది. ప్రజల ద్వారా ఎన్నికయ్యే పద్ధతి లేకపోవడం వల్ల సాహిత్య కళారంగాల నిర్దేశకులు ప్రజల్ని పట్టించుకోవడం లేదు."[10] అని అంటారు బిఎస్.రాములు.

### ఆత్మన్యూనతకు గురి చేసిన ఆధునిక సాహిత్యం

మునుపు కుల వ్యవస్థలో ఎవరి కులవృత్తి వాళ్ళు చేసుకుంటూ బతికినప్పటికీ అగ్రవర్ణ, అగ్రకుల వ్యవస్థ తాలూకు జీవితాన్నే ఆదర్శంగా స్వీకరించలేదు. ఎవరివృత్తి వారిదే, ఎవరి జీవితం వారిదే అనే ఆత్మగౌరవంతో జీవించారు. కానీ ఆధునిక సాహిత్య ప్రక్రియల ద్వారా కొందరి జీవితాలే సాహిత్య గౌరవం పొందే అర్హత కలవిగా చిత్రించబడ్డాయి. దానివల్ల బిసీ, యస్సీ, యస్టీ కులాలు మునుపెన్నడూ లేని విధంగా ఆత్మన్యూనతా భావానికి (Inferiority complex) గురిచేయబడ్డాయి. తద్వారా మానసికంగా అణచి వేసే ప్రక్రియ కొనసాగింది. ఆ రకంగా బీసీ, ఎస్సీ, ఎస్టీ ఎదుగుదలకు ఆటంకం ఏర్పడింది. బీసీ, ఎస్సీ, ఎస్టీల జీవితాలను, సంస్కృతిని సాహిత్య గౌరవంతో చిత్రించడానికి చాలా మంది రచయితలు నిరాకరించారు. హేళన చేశారు.[11] ఈ క్రమంలో బీసీ, ఎస్సీ, ఎస్టీ జీవితాలను, గ్రామీణ ప్రజల జీవితాలను చిత్రించే రచయితలు ఎదిగారు. ఆ రచనలకు ఎనలేని ప్రాధాన్యత ఏర్పడింది. మున్షీ ప్రేమ్‌చంద్, కిషన్ చందర్ లాంటి రచయితలు ఇలాంటి వారిలో సుప్రసిద్ధులు.

"అయితే ఒక కఠిన సత్యాన్ని కూడా గుర్తించాలి. 1950-60ల మధ్య ఎదగడం మొదలైన తెలంగాణ కథకులు 1960-70ల మధ్య అణిచివేయబడ్డారు. గోలకొండ, మీజాన్ తదితర పత్రికల్లో సగర్వంగా తలెత్తుకున్న తెలంగాణ భాషకు, కథకులకు కోస్తా ఆధిక్యత వల్ల తీరని నష్టం జరిగింది. కాళోజీ, దాశరథి, సి.నారాయణరెడ్డి కవులు కావడం వల్ల మిగిలారేమోగానీ, తెలంగాణ కథకులు-నవలాకారులు ఎదగకుండా కోస్తా భాష, సంస్కృతి, పాఠ్యపుస్తక నిర్మాణం, రేడియో, సినిమా, కోస్తా రాజకీయ పెత్తనం కల్సి అణిచివేశాయి. లేదా ఎదగనీయకుండా అడ్డుపడ్డాయి. ప్రత్యేక తెలంగాణ ఉద్యమం వచ్చినా తెలంగాణ భాషకు, కథకులకు స్థానం లభించలేదు. ఎమర్జెన్సీ ఎత్తివేత తర్వాత మొదలైన జగిత్యాల జైత్రయాత్ర, కరీంనగర్‌లో

రైతాంగ పోరాటాలతో తెలంగాణ భాషకు, కథకు అట్టడుగు జీవితాలకు సాహిత్య గౌరవం మొదలైంది. పీడిత వర్గం తమ జీవితంతో పాటు, తమదైన సంస్కృతిని, భాషను, శిల్పాన్ని వ్యక్తీకరణను, సమస్యలను కథల్లోకి తెచ్చింది." [12] అల్లం రాజయ్య, బి.ఎస్.రాములు మొదలైన వారి కథలు, నవలలు ఇలా వెలువడివడినవే.

## తెలుగు నవల - నేపథ్యం

"ప్రపంచమంతటా నేడు నవలయే సమాజానికి, సాహిత్యానికీ సంకేతకేతనం అయింది. నవల ఒక మహోత్తమ సాహిత్య ప్రక్రియ. మనకు మహామహా నవలలు ఉన్నాయి. తెలుగు జాతి గోదావరి అంత పొంగిపోయి చెప్పుకోదగిన నవలలున్నాయి. భారత నవలా సాహిత్యంలో గిరి శిఖరాలాంటి తెలుగు నవలలు ఉన్నాయి."[13]

తెలుగు నవల విషయానికి వస్తే దాని ప్రారంభమే ఎంతో గొప్పగా జరిగింది. గోపాల కృష్ణమ శెట్టి రాసిన "శ్రీరంగరాజ చరిత్ర" కులాంతర వివాహాలను సమర్థిస్తూ, బ్రాహ్మణవాద సంస్కృతిని నిరసిస్తూ ప్రగతిశీల భావాలతో వెలువడింది. కలకత్తా నుండి మద్రాసుకు రైలు మార్గం, రోడ్డు మార్గం బ్రిటీష్ పాలకులు వేయించిన క్రమంలో రాకపోకలు పెరిగాయి. భావాల సంపర్కం పెరిగిన క్రమంలో ఈ నవల వెలువడింది.

## గోపాలకృష్ణమ శెట్టి రాసిన శ్రీరంగరాజచరిత్ర తొలి తెలుగు నవల

గోపాల కృష్ణమ శెట్టి (1833-1888) రాసిన శ్రీరంగరాజ చరిత్ర నవల చూసి కందుకూరి వీరేశలింగం పంతులు ఆనవల వెలువడిన ఆరేళ్ళకు "శ్రీరాజశేఖర చరిత్ర" అనే నవలను రాశారు. గోపాల కృష్ణమ శెట్టి రాసిన శ్రీరంగరాజ చరిత్ర అనే పేరును అనుకరించి పెట్టిన పేరే రాజశేఖర చరిత్ర.[14]

## తెలంగాణ నవల-పరిణామం-చారిత్రక నేపథ్యం గోల్కొండ రాజ్యపతనం

"సుమారు 1934 ప్రాంతంలో రామానుజాచార్యులు (అంబాల) గారి నవలలు వెలువడ్డాయి. కాదంబిని, ప్రేమ చాంచల్యము అనేవి వీరి నవలలు. వేణుగోపాలరావు గారి నవల జుహరాబాయి. 1935లో వెంకట రాజన్న అవధాని మంథని అడ్వకేటుగారు పతిపత్ని అనే నవలను వెలువరించారు. దవ్వూరి సత్యనారాయణ అంబరీషోపాఖ్యానం అనే కథను "కర్మయోగి" అనే నవలగా రచించారు. తిరునగిరి శివరామశాస్త్రిగారు "సాదేగ్యారా" అనే పేరుతో డిటెక్టివ్ నవల రాశారు. 1952లో జి.రాములు గారి చిన్న నవలల "పెరటి చెట్టు" నవలగా ముద్రించారు.[15]



"ఔరంగజేబు దండయాత్ర చేసి గోల్కొండ రాజైన తానీషాను 1687 సం॥లో ఓడించారు. తన సుబేదార్లుగా అసఫ్‌జాహిని నియమించాడు. క్రీస్తుశకం 1707సం॥లో ఔరంగజేబు మరణం తర్వాత మొగలు సామ్రాజ్యం క్రమక్రమంగా విచ్ఛిన్నమైంది."[16] మొగలు సుబేదారుగా అసఫ్‌జాహి, నిజాంలు నియమించబడ్డారు. 1724 సం॥లో మొగలు సామ్రాజ్యం నుండి స్వాతంత్ర్యం ప్రకటించుకున్నారు. నిజాం అనే బిరుదు నామంతో వీరు తమ వంశాన్ని పేర్కొన్నారు.

టిప్పు సుల్తాను, మరాఠా, నైజాం రాజ్యాల మధ్య నిరంతరం యుద్ధాలు జరిగాయి. ఈ ముగ్గురి అంతర్గత యుద్ధాల కారణంగా బ్రిటీష్ వారు భారతదేశాన్ని మరో వందేళ్ళు పరిపాలించడానికి కారకులు అయ్యారు. 1766 సం॥లో జరిగిన యుద్ధంలో టిప్పు సుల్తాన్‌కు వ్యతిరేకంగా ఈస్టిండియా కంపెనీ సైన్యం సహకరించినందుకు గానూ సర్కారు జిల్లాలను కప్పం వసూలు చేసుకోమని అన్ని అధికారాలతో నిజాం అప్పగించారు. 1798 సం॥లో మళ్ళీ జరిగిన టిప్పు సుల్తాన్ నాల్గవ మైసూరు యుద్ధం తర్వాత యుద్ధంలో సహకరించినందుకుగానూ ప్రస్తుతం రాయలసీమ అని పిలవబడుతున్న ప్రాంతాన్ని ఈస్టిండియా కంపెనీని అతనికి దారాధత్తం చేశాడు.[17] అందుకే రాయలసీమ ప్రాంతానికి "దత్త మండలం" అని పేరు వచ్చింది.

## ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు

ఆధునిక సమాజంగా ఎదగడంలో బ్రిటీష్ ప్రాంతం కలకత్తా మద్రాసు రూటు సంబంధంతో కలకత్తా రాజధానిగా ఈస్టిండియా కంపెనీ పరిపాలనలో మద్రాసు ప్రావిన్స్‌లో భాగంగా కొనసాగింది. మద్రాసు ప్రావిన్స్‌లో ఆంధ్రులు రెండవ శ్రేణి పౌరులుగా చూడబడ్డారు. ఆంధ్రుల అనేక విజ్ఞప్తులను అనుసరించి 1921 సం॥లో కాంగ్రెస్ పార్టీ మద్రాసుతో కలిసి ఆంధ్రప్రాంతంతో ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు చేయాలనే తీర్మానాన్ని ఆమోదించింది. 1953 సం॥ డిసెంబర్ 1వ తేదీన కర్నూలు రాజధానిగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది.[18]

## నైజాం రాష్ట్రం ఏర్పాటు

బ్రిటీష్ వాళ్ళు భారతదేశానికి ఆగష్టు 15, 1947లో స్వాతంత్ర్యం ఇచ్చారు. బ్రిటీష్ వారి ఏలుబడిలో 560 స్వదేశ సంస్థానాలు కొనసాగాయి. నిజాం సంస్థానం భారతదేశం లోనే పెద్దది. అది ప్రపంచంలోనే మూడవ సంపన్న రాజ్యం. పాకిస్తాన్‌వలె స్వతంత్ర దేశంగా యధాతథంగా కొనసాగాలని నిజాం కోరుకున్నాడు. దీన్ని

వ్యతిరేకిస్తూ అప్పటి కేంద్ర హోంమంత్రి సర్దార్ వల్లభాయ్ పటేల్, జనరల్ చౌదరి నాయకత్వంలో సైన్యాన్ని నైజాంపైకి పంపించారు. సెప్టెంబరు 13-9-1948న భారత సైన్యాలు నైజాం రాజ్యంలోకి ప్రవేశించాయి. 17-9-1948న నిజాం రాజు భారత ప్రభుత్వానికి లొంగిపోయాడు. అందువల్ల ఆ రోజుని నిజాం రాష్ట్రం విమోచన దినంగా పేర్కొన్నారు. 1948 నుంచి 1956 అక్టోబర్ 31 దాకా నైజాం రాష్ట్రం స్వతంత్ర రాష్ట్రంగా కొనసాగింది. 1-11-1956న ఆంధ్ర, రాయలసీమ, నైజాం రాష్ట్రం కలిసి ఆంధ్రప్రదేశ్‌గా ఏర్పడింది. ఇలా 1956 వరకు సుమారు 200 సంవత్సరాల పాటు వేరువేరు పరిపాలనల కింద ఆంధ్ర, నైజాం ప్రాంతాలు కొనసాగాయి. వీరి సంస్కృతి ఏ ప్రాంతానికి ఆ ప్రాంతం ప్రత్యేకంగా స్వతంత్రంగా కొనసాగింది.[19]

### తెలంగాణలో ఉర్దూ అధికార భాష - తెలంగాణ భాషపై చిన్న చూపు

"ఢిల్లీలో ఆఖరి మొఘల్ చక్రవర్తి బహదూర్‌షా జాఫర్, అవధ్‌లో నవాబు వాజీద్ అలీషా అక్తర్‌లు రాజ్యాధికారాన్ని కోల్పోవటంతో ఉత్తర భారతంలో ఉర్దూ భాషకు రాజుల ఆదరణ కరువైంది. దీంతో లక్నో, ఢిల్లీ, మొదలైన ప్రదేశాల నుంచి చాలామంది ఉర్దూ పండితులు, కవులు, తమ జీవనోపాధిని వెతుక్కుంటూ హైదరాబాద్‌కు వచ్చారు. ఈ దశలోనే హైదరాబాద్‌లో కూడా అనేక మార్పులు వచ్చాయి. అమీర్-ఎ-పాయెగా షమ్సుల్ ఉమ్రా, నవాబ్ ఫక్రుద్దీన్‌లు 'మదరసా-ఎ-ఫకీరా' పేరుతో ఒక పాఠశాల స్థాపించాడు. ఇందులో ఎందరో పండితులను నియమించి వారిచేత ఆంగ్లంలో ఉన్న పాశ్చాత్య తత్వశాస్త్రం, గణితం, సైన్స్‌కు సంబంధించిన అనేక పుస్తకాలను ఉర్దూలోకి అనువాదం చేయించి ప్రచురించేవాడు. ఈ పుస్తకాలను విద్యార్థులకు, పండితులకు పంపిణీ చేసేవారు."[20]

ఈ క్రమంలో తెలంగాణ ప్రాంతంలో ఉర్దూ అధికార భాషగా మొదలైంది. 1918లో ఏర్పడిన ఉస్మానియా యూనివర్సిటీలో అరబ్బీ, ఉర్దూ భాషలను మాధ్యమంగా కొనసాగించారు. అందువల్ల తెలుగు భాషలో చదవడం, రాయడం చాలా తక్కువ.

ఈ నేపథ్యంలో తెలంగాణ ఆధునిక సాహిత్య ప్రక్రియలను, సామాజిక వికాసాన్ని పరిశీలించవలసి వుంది. 1956 నవంబరు 1వ తేదీన తెలంగాణ, ఆంధ్ర ప్రాంతాలు కలిసి ఆంధ్రప్రదేశ్ అనే రాష్ట్రం ఏర్పడింది. ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిన తర్వాత తెలంగాణ భాషా, సంస్కృతి జీవన విధానం చిన్నచూపు చూడబడింది.[21] ఆంధ్ర, రాయలసీమ ప్రాంతాల ప్రజలు అన్ని రంగాలలో ఆధిపత్యంలోకి వచ్చారు.



పాఠ్యపుస్తకాలు, రేడియో, సినిమాలలో కృష్ణా, గుంటూరు, ఉభయ గోదావరి జిల్లాల ఆంధ్ర మాండలికాన్ని వ్యవహారిక భాషగా రాష్ట్రంపై రుద్దారు. తెలంగాణ ప్రజలు ఉర్దూ మీడియంలో చదువుకున్నారు.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడి తెలుగు మీడియంలో రాయడం, చదవడం, నేర్చుకునే సరికి తెలంగాణ భాష కాకుండా కోస్తా, ఆంధ్ర మాండలికం వ్యవహారిక భాషగా వారిపై రుద్దబడింది. దాంతో తెలంగాణ వాళ్ళు తమ మాతృభాషలో రాసే, చదివే అవకాశం కోల్పోయారు.

### ఆంధ్ర మాండలికం - తెలంగాణ భాష పరిణామాలు

జయధీర్ తిరుమలరావు గారు అన్నట్లు "ఎవరి తల్లి వారికి ప్రాణం. ఏ ప్రాంతీయునికైనా తన భాషే మమకారం. ప్రజాదృక్పథం గల వారు ప్రజల భాషపై ప్రత్యేక శ్రద్ధ పెట్టాలి. ఆధిపత్య భాషను నిలదీయాలి. స్థానిక భాష గుబాళింపు, ప్రాంతీయ నుడికారం, మాండలికం లేని రచన జీవత్ రచన కాలేదు. సంస్కృత, ఆంధ్ర, హిందీ, భాషలను ఆధిపత్య భాషలను ప్రశ్నించడమే రచయితల ప్రాథమిక కర్తవ్యం."[22]

మూడు ప్రాంతాల ఏకీకరణ కొన్ని ప్రాంతాలపై అణచివేతగా, సామాజిక పరిణామాలు కొనసాగాయి. తెలంగాణ ప్రాంతంలో ఉర్దూమీడియం నుండి తెలుగు మీడియంలోకి మారిన తర్వాత అందుకు తగిన పాఠకులు కూడా ఏర్పడాలి. ఆంధ్ర ప్రాంతం పత్రికలు తెలంగాణ భాషలో రాస్తే అర్థం కాలేదంటూ తిప్పి పంపడం ప్రారంభించాయి. కోస్తా మాండలికం, పత్రికల ద్వారా తెలంగాణ ప్రాంతంలోకి చొచ్చుకుపోయింది. ఇలా తెలంగాణ ప్రాంతంలో తెలంగాణ రచయితలు, కథలు, నవలలు ఎక్కువగా రాయలేకపోయారు. డా॥ బన్న అయిలయ్య తన పి.హెచ్‌డి సిద్ధాంత వ్యాసంలో తెలంగాణ ప్రాంత భాష, సంస్కృతి, వికాసం కోసం కృషి చేసిన సంస్థలను, ఉద్యమాలను పేర్కొన్నారు.[23]

### తెలంగాణ జీవితాలకు సాహిత్యంలో నిరాదరణ

"మనిషి కోసం ఆదివారం కానీ ఆదివారం కోసం మనిషి కాదని, కళాకారుడు సమాజం కోసం కానీ సమాజం కళాకారుడు కోసం కాదని, కళ మనిషి చైతన్యాభివృద్ధికి తోడ్పడాలని, సామాజికాభివృద్ధికి తోడ్పడాలని అంటారు." [24]

ఇందుకు భిన్నంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడ్డాక తెలంగాణ కథలు, పత్రికలు తగ్గిపోయాయి. ఆంధ్రప్రాంత పత్రికలు తెలంగాణ అంతటా విస్తరించాయి. తెలంగాణ నుంచి వెలువడిన గోల్కొండ, మీజాన్ వంటి సుప్రసిద్ధ పత్రికలు కూడా క్రమంగా ఆగిపోయాయి.[1] ఆంధ్రప్రాంత పత్రికలు, ఆంధ్రప్రాంత జీవితాలకే ప్రాధాన్యతను ఇచ్చాయి. తెలంగాణ సంస్కృతి, భాష, జీవితం, రచనలు చిన్నచూపునకు గురయ్యాయి. అంతేకాకుండా రచయితలు, నాయకులు, విద్యావంతులు కూడా చిన్నచూపు చూడబడ్డారు. తెలంగాణ ప్రాంత ఉద్యోగులు, ఆంధ్రప్రాంతం వారు ఆక్రమిస్తున్నారని తెలంగాణ విద్యార్థి యువజనులు 1968లో ఆంధ్ర గోబ్యాక్, జైతెలంగాణ అనే నినాదాలతో ఉద్యమించారు. 370 మంది ఈ ఉద్యమంలో చనిపోయారు. కాసు బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు ఈ ఉద్యమం తీవ్రంగా అణచివేయబడింది.

## తెలంగాణ నవలా క్రమం

ఈ సామాజిక పరిణామ క్రమంలో తెలంగాణ సాహిత్యం నీరందని మొక్కవలె పెరిగింది. 1945లో నిజామాబాదుకు చెందిన లోకమలహరి 'జగ్గనివిద్య', ఆ తరువాత 1950లో 'సంగం' అనే నవల రాశానని చెప్పారు.[25]

## ఆధునిక తెలుగు నవల 1946లో ఆవిర్భావం

సుప్రసిద్ధ సాహితీవేత్త కె.రామ్మోహన్‌రాయ్ 'తెలుగు పసిడి' (2006) వ్యాస సంకలనంలో 1945-46లో ఆధునిక తెలుగు నవల ఆవిర్భావం జరిగిందని అభిప్రాయ పడ్డారు. విద్యేశ్వరి భారతీయ భాషల్లో నవలా ప్రక్రియ గురించి రాస్తూ ఇలా అన్నారు.

"స్వాతంత్ర్యానంతరం సాంఘికంగా దేశంలో అనేక మార్పులు వచ్చాయి. ఉద్యోగాల నిమిత్తం నగరాలకు తరలి వెళ్ళే గ్రామీణులు, చదువుల కోసం హాస్టల్ జీవితం గడిపే విద్యార్థులు స్వాతంత్ర్యం వచ్చాక దేశం సుభిక్షం అయిపోతుందన్న కలలు చెదిరిపోవడంతో వచ్చిన మార్పులు చెదిరిపోతున్న ఉమ్మడి కుటుంబాలు నవలలకు వస్తువులైనాయి. ఈ తరంలో అనేక మంది రచయితలు సాంఘిక నేపథ్యంలో నవలలు రాశారు. ఒక రకంగా చూస్తే 1950 నుంచి 70 వరకు కాలం సాంఘిక నవలా యుగం అని చెప్పవచ్చు."

"భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడటం వల్ల హైదరాబాద్ రాజధానిగా ఆంధ్రప్రదేశ్ అవతరించింది. తెలుగు మాట్లాడే ప్రజలు చాలా మంది ఒక్క పరిపాలన కిందకే



వచ్చిన తర్వాత కోస్తా, రాయలసీమ, తెలంగాణ ప్రజలు మరింత సన్నిహితులయ్యారు. రచయితల ఆలోచనలో ఒకానొక మార్పు కన్పించింది."[26] అని అంటారు.

అయితే తెలంగాణ సాహితీవేత్తల అభిప్రాయం ఇందుకు భిన్నంగా వుంది. "తెలుగు భాష ఒకటే అయితే తెలంగాణ భాషలో పాఠ్యపుస్తకాలు, పత్రికలు, సాహిత్యం ఎందుకు రాలేదు. తెలంగాణ భాషను ఇదేం భాష అని, మాకు అర్థం కావడం లేదని అనడంలోనే తెలంగాణ భాష బ్రిటీష్ ఆంధ్ర తెలుగు భాష రెండు వేర్వేరు భాషలని స్పష్టమవుతున్నది. భాషను అణచివేస్తే మనిషిని అణిచివేయడం పూర్తయినట్టే ఎందుకంటే మనిషికి భావాలను, బాధలను వ్యక్తం చేయడానికి భాషే సాధ్యం. ఇంగ్లాండులో ఇంగ్లీష్ రాని తెలుగు వారు ఏం మాట్లాడలేక నోరు మూతబడిపోతుంది. భావాలు వ్యక్తం కావు. ఇలా 60 ఏళ్ళుగా తెలంగాణ ప్రజలు నోరు మూయించబడి, భావాలు అడ్డుకోబడి ఎదుగుదలను సాధించకుండా చేయబడ్డారు."[27] అని బి.ఎస్.రాములు సాహిత్య చరిత్రను కొత్తచూపుతో తిరగరాయాలిలో అభిప్రాయపడ్డారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డం ద్వారా తెలంగాణ భాష, సంస్కృతులకు, సాహిత్యానికి, సామాజిక అభివృద్ధికి ఎంతో నష్టం జరిగిందని వారి అభిప్రాయం.

## వట్టికోట ఆళ్వారుస్వామి నవలలు

ఒద్దిరాజు సోదరులు అనేక చారిత్రక, సామాజిక నవలలు రచించారు. కాని అవి అందుబాటులో లేవు. వట్టికోట ఆళ్వారుస్వామి 1956లో "ప్రజల మనిషి" నవల రాశారు. ఆ తర్వాత 'గంగు' నవల రాశారు. వట్టికోట ఆళ్వారుస్వామి రాసిన కాలంలోనే భాస్కరభట్ల కృష్ణారావు "వెల్లువలో పూచికలు", "యుగసంధి" అనే నవలలు రాశారు. ఈ రెండు నవలల్లో తెలంగాణ జీవిత చరిత్రలు, తెలంగాణ ఉద్యమాలను చిత్రించాయి. నారాయణరావు "పాతరోజులు – కొత్తరోజులు" "కొత్తగడ్డ" అనే నవలలు రాశారు.

## జి.రాములు గారి పెరటి చెట్టు నవల - 1956

వట్టికోట ఆళ్వారుస్వామి కన్నా ముందు కరీంనగర్ జిల్లా సిరిసిల్లకు చెందిన జి.రాములు 1956 సం॥లో 'పెరటిచెట్టు' అనే నవలిక ప్రచురించారు.

1946లో లోకమలహరి రాసిన 'జగ్గనివిద్య' నవల 'చదువు' గురించి రాసింది. పెరటిచెట్టు నవల సంఘసంస్కరణ కోసం, గౌడ జీవితాన్ని తీసుకొని రాసిన నవల. 'ప్రజల మనిషి' నవల ఒక సామాన్యుడు ఉద్యమాలలో పని చేస్తూ ప్రజల మనిషిగా

ఎదిగిన క్రమాన్ని చిత్రించిన నవల. ఇలా తొలి దశలో తెలంగాణలో వెలువడిన నవలలు సాంఘిక నవలలు సంస్కరణలను, ప్రజా ఉద్యమాలను చిత్రించాయి.

### దాశరథి రంగాచార్య నవలలు

1967లో దాశరథి రంగాచార్య 'చిల్లర దేవుళ్ళు' అనే నవల రాశారు. ఆ క్రమంలో తొమ్మిది నవలలు రాశారు. 1972-73 నవలలో మోదుగుపూలు, మాయజలతారు, 1974లో జనపదం, 1972లో రానున్నది ఏది నిజం, 1976లో శరతల్పం, మానవత, 1978లో పావని, 2002లో 'అమృతంగమయ' అనే నవలలను రాసి తెలంగాణ ప్రజా ఉద్యమాల సామాజిక పరిణామాలను అక్షరీకరించారు.

### నవీన్ నవలలు

1969లో నవీన్ రాసిన 'అంపశయ్య' నవల వెలువడింది. చైతన్య స్రవంతి శిల్పానికి ఇది పేరెన్నికగన్నది. రచయిత నవీన్ పేరులో అంపశయ్య చేరి ఇంటిపేరుగా మారిపోయింది. అంపశయ్య నవీన్ మొత్తం 28 నవలలు రాశారు. వాటిలో చీకటి రోజులు, కాలరేఖలు, బాంధవ్యాలు, ఉమెన్స్ కాలేజి, రక్తకాసారం మొదలైనవి వున్నాయి. కాలరేఖలు నవలకు కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు లభించింది.

### తెలంగాణేతరులు తెలంగాణ ప్రజా ఉద్యమాలను గురించి రాసిన నవలలు

తెలంగాణ ఉద్యమం గురించి 1948, 1962 మధ్య తెలంగాణేతరులు రాసిన నవలలు కూడా వెలువడ్డాయి. మహీధర్ రామ్మోహన్‌రావు 'ఓనమాలు' (1956), 'మృత్యునీడల్లో' (1958), లక్ష్మీకాంత్ మోహన్ 'సింహగర్జన' (1948), బొల్లిముంత శివరామకృష్ణ 'మృత్యుంజయులు' (1950) నవలలను రాశారు. ఇవన్నీ తెలంగాణ ఉద్యమాన్ని చిత్రించిన నవలలు.[28]

### తెలంగాణ నవలా వికాస దశలు

తెలంగాణ నవలా వికాసాన్ని మూడు దశలుగా వర్గీకరించవచ్చు. 1) హైదరాబాద్ నైజాం రాజ్యంలో 1956 వరకు వెలువడిన నవలలు. ఇందులో తెలుగు, హిందీ, ఉర్దూ, మరాఠీ, కన్నడ ఈ అయిదు భాషల్లో వెలువడ్డ సాహిత్యాన్ని లెక్కలోకి తీసుకొని పరిశీలించవలసి ఉంటుంది.[1] తెలంగాణ ఉద్యమంపై సుప్రసిద్ధ ఉర్దూ రచయిత కిషన్ చందర్ 'జబ్‌ఖేత్‌జాగే' అనే నవలను రాశారు. అనగా 'పొలాలు మేల్కొన్నప్పుడు' అనే అర్థం. తెలుగులో ఈ నవల 'జైత్రయాత్ర' పేరుతో అనువదించబడింది.[29] ఈ



నవల ఆధారంగానే ప్రసిద్ధిగాంచిన 'మాభూమి' సినిమా 1979 సం॥లో తీయబడింది. తెలంగాణ పద్మశాలీల జీవితాల గురించి చేనేత వృత్తి గురించి పోరంకి దక్షిణామూర్తి 1967లో 'ముత్యాల పందిరి' నవలను వెలువరించారు.

తెలంగాణ జీవితం గురించి మరాఠిలో చాలా నవలలు వచ్చాయి. గాంధారి, ఉచల్యా అనే నవలలు కేంద్ర సాహిత్య అకాడమీ ద్వారా తెలుగులో అనువాదమయ్యాయి. తమిళంలో తెలంగాణ 1946 జీవితం గురించి అశోకమిత్రన్ 1983లో 'రెండు నగరాలు' అనే నవలను రాశారు. ఇది కూడా కేంద్ర సాహిత్య అకాడమీ వారిచే తెలుగులోకి అనువదించబడింది. 1956 నవంబరులో హైదరాబాద్ రాష్ట్రం రద్దయ్యే దాకా రాజకీయ, సామాజిక, సాహిత్య, సాంస్కృతిక రంగాలలో తొలిదశగా చెప్పవచ్చు.

### తెలంగాణ నవలా వికాసం రెండవ దశ

1956 నుండి 1969 దాకా తెలంగాణ నవలల మలిదశ అని చెప్పవచ్చు. 1970 నుండి 1980 వరకు మూడవదశ అని వర్గీకరించవచ్చు. అయితే విప్లవ సాహిత్యం రీత్యా 1977 నుండి మూడవ దశను పేర్కొంటారు. 1977 నుండి 1990 వరకు నాల్గవ దశ, 1991 నుండి 2006 వరకు ఐదవ దశ అని పేర్కొనవచ్చు. కొన్ని ప్రత్యేకతలు ఉండటంచే ఈ కాలవిభజన చేయడం జరిగింది.

### విప్లవరచయితల సంఘం ఆవిర్భావం - చెరబండ రాజు నవలలు

1970లో ఏర్పడిన విప్లవ రచయితల సంఘం 1975 జూన్‌లో విధించిన ఎమర్జెన్సీలో జైళ్ళపాలై కుంటుపడింది. ఎమర్జెన్సీని 1977లో ఎత్తివేసిన తర్వాత విరసం తిరిగి బలం పుంజుకుంది. అనేక సభలు, సమావేశాలు నిర్వహించారు. జననాట్యమండలి రాష్ట్ర వ్యాప్తంగా తమ కళారూపాలలో ప్రజలను ఉత్తేజపరిచింది. చాలా విషయాల్లో అందరికన్నా ముందు చూపుతో ఆలోచించే చెరబండరాజు "గ్రామాలకు తరలండి" అనే కార్యక్రమం సందర్భంగా పల్లె జీవితాలను, వాటి పరిణామాలను తెలుపుతూ "మా పల్లె" అనే నవలను 1978 ఏప్రిల్‌లో ప్రచురించారు. 1981లో 'ప్రస్థానం' అనే నవలను కూడా ప్రచురించారు.[30]

### సిహెచ్.మధు గారి 'తూర్పు ఎరుపులో మహిళ' నవల

ఈ కాలంలో 1977లో "తూర్పు ఎరుపులో మహిళ" అనే పేరుతో సిహెచ్.మధు రాసిన నవల 1978లో స్వాతి మాసపత్రికలో వెలువడింది. విప్లవ ఉద్యమం మొదలైన తీరును ఈ నవల చిత్రించింది. ఈ సమయంలో 'సృజన' మాసపత్రికలో అల్లం రాజయ్య రాసిన "కొలిమంటుకుంది" అనే నవల సీరియల్‌గా ప్రచురించబడింది.

**అల్లం రాజయ్య 'కొలిమంటుకున్నది' నవల– తెలంగాణాభాషపై చర్చ**

తెలంగాణ నుండి 1978లో వెలువడిన 'కొలిమంటుకున్నది' నవల తెలంగాణ భాష పట్ల ప్రత్యేక చర్చను లేవనెత్తింది. ఈ నవల ఆ కాలంలో ఒక మైలురాయి. 'కొలిమంటుకున్నది' నవల కరీంనగర్ జిల్లాలోని మంథని, మహదేవ్‌పూర్ లోతట్టు ప్రాంతాల భాషను రికార్డు చేసింది. నవల మొత్తం అదే భాషలో నడుస్తుంది. వినడంలో కష్టం లేకున్నా అలవాటు లేని ఒత్తులు చదవడంలో కొందరికి కష్టంగా అనిపించింది. దానివల్ల 'కొలిమంటుకున్నది' నవల గురించి చర్చ జరిగింది. తెలంగాణ మాతృభాష పట్ల ఆత్మగౌరవంతో ఈ చర్చకు సంబంధం ఉంది. విరసం, విప్లవోద్యమం మద్దతుతో తెలంగాణ మాతృభాష తిరిగి ఆత్మగౌరవాన్ని పొందడానికి 'కొలిమంటుకుంది' నవల ఒక సంకేతంగా నిలిచిపోయింది.[31]

## బి.ఎస్.రాములు గారి 'బతుకుపోరు' నవల

బి.ఎస్.రాములు 1982 సం॥లో 'బతుకుపోరు' నవల రాశారు. డా॥ దాశరథి రంగాచార్య వంటి సుప్రసిద్ధ సాహితీ వేత్తలు 'బతుకుపోరు' నవలను ఎంతగానో ప్రశంసించారు. అల్లం నారాయణ 'బతుకు పోరు' నవలను తెలుగు సాహిత్యంలో గొప్ప నవలగా పేర్కొన్నారు.[32] ఆంధ్రజ్యోతి వారపత్రికలో 1982లో ఒక పూర్తి పేజి సమీక్షలో బి.ఎస్.రాములు గారిని రష్యా, చైనా దేశాల్లోని సుప్రసిద్ధ రచయితలైన మాగ్జిమ్ గోర్కీ, లూసన్‌లతో బి.ఎస్.రాములు గారిని పోల్చారు. తెలుగులోని గోర్కీ లూసన్ అని ప్రశంసించారు.[33]

'బతుకుపోరు' నవలను డా॥ బి.ఆర్.అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం డిగ్రీ తెలుగు పాఠ్యగ్రంథంలో రిఫరెన్స్ గ్రంథంగా పేర్కొన్నారు. మొదటి ముద్రణ కరీంనగర్ బుక్‌ట్రస్ట్ తరఫున వెలువడింది. విప్లవ రచయిత సంఘం, మాచర్ల మహాసభల్లో 1982 మే, జూన్‌లో బతుకుపోరు నవల ఆవిష్కరించబడింది. ఈ నవల మొదటి ముద్రణ వరంగల్‌లో ముద్రించబడింది. దాన్ని ప్రచురించడంలో కె.రామ్మోహనరాజు విశేష కృషి చేశారు. నవల విశిష్టతను వివరిస్తూ ముందుమాట కూడా రాశారు.[34]

'బతుకుపోరు' నవల రెండవ ముద్రణ హైదరాబాద్ బుక్‌ట్రస్ట్ ప్రచురణగా వెలువడింది. ఇందులో రెండు చిన్న అధ్యాయాలను అదనంగా చేర్చడం జరిగింది. ఆ రెండు అధ్యాయాలు 'బతుకుపోరు' నవల వెలువడ్డ తరువాత పలువురి సూచనమేరకు బతుకు, పోరు అనే పేర్లతో వెంటనే రాయటం జరిగింది. ఇవి



జూన్–జనవరి 83 నూతన మాసపత్రికలో ఎమ్.రత్నమాల సంపాదకత్వంలో ప్రచురించబడ్డాయి. సమ్మె జరుగుతున్న తీరును, సమ్మెపట్ల అనేక కోణాలను యీ రెండు కథల్లో రాయడం జరిగింది. ఈ నవలలో చేర్చాల్సిన అధ్యాయాలుగా అవే పాత్రలతో యీ కథలు రాయడం జరిగింది.[35] రెండవ ముద్రణలో ఆ కథలు యీ నవలలో సహజంగా కలిసిపోయాయి. మూడవ ముద్రణ 2005లో విశాల సాహిత్య అకాడమి తరఫున వెలువడింది. ఇందులో మొదటి, రెండవ ముద్రణలో వున్న కె.రామ్మోహనరాజు ముందుమాట బదులుగా డా॥ దాశరథి రంగాచార్య, అల్లం నారాయణ రాసిన లేఖలు, సమీక్షలు వున్నాయి. వీటికి తోడు బీడీ పరిశ్రమ తీరుతెన్నులు గురించి 1983లో 'చాటింపు పత్రిక'లో బి.ఎస్.రాములు రాసిన వ్యాసాన్ని చేర్చారు.[36] దీనివల్ల నవలా కాలంలో బీడీ పరిశ్రమ గురించిన మరిన్ని వివరాలు అదనంగా తెలుస్తాయి. మూడవ ముద్రణలో బి.ఎస్.రాములుగారి జీవిత పరిచయాన్ని గూడూరి సీతారాం, పత్తిపాక మోహన్‌లు అందించారు.

రెండవ ముద్రణ అట్టవెనుక ఈ నవల గురించి ఇలా పేర్కొన్నారు. "1970ల నుండి సాహిత్యం వ్యాపార సాహిత్యం అనీ, ప్రజా సాహిత్యం అనీ రెండు పాయలుగా వస్తోంది. అయితే నవలల విషయానికొస్తే ఈ రెండు పాయల్ని మొత్తంగా చూసినా విడివిడిగా చూసినా మంచి నవలలు తక్కువ. సామాజిక ఉత్పత్తి సంబంధాల్లో మానవ సంబంధాల చిత్రణ చేసిన "సామాజిక నవల"లు మరీ తక్కువ. మానవ సంబంధాల్ని, ఉత్పత్తి సంబంధాల్ని, సమన్వయిస్తూ తెలంగాణ ప్రజల జీవితాన్ని చిత్రించిన నవల "బతుకుపోరు". నేటి స్త్రీవాద సాహిత్యం వస్తున్న రోజులకు చాలా ముందుగా స్త్రీల జీవితం–సంస్కృతి ఆలోచనా విధానం, స్త్రీల భాష అభివ్యక్తి, ఆశలు–ఆరాటాలు జీవితమంత వాస్తవికంగా చిత్రించిన నవల ఇది." [37]

'బతుకుపోరు' నవలలోని అనేక విశిష్ట అంశాలను పరిశీలించే ముందు నవల లక్షణాలను, వాటి వర్గీకరణను సంక్షిప్తంగా పేర్కొంటాను.

**నవలల వర్గీకరణ**

సమాజంలో, సాహిత్యంలో ప్రత్యేక దశలు ఉన్నాయి. నవలా సాహిత్యాన్ని కథా వస్తువును బట్టి, శిల్పాన్ని బట్టి, ప్రాంతాన్ని బట్టి, నిర్మాణ వైవిధ్యాన్ని బట్టి, రూప భేదాన్ని బట్టి ఇలా పేర్కొంటున్నారు. [38]

1. మాండలిక నవలలు
2. ఆర్థిక, రాజకీయనవలలు

3. సామాజిక నవలలు

4. చారిత్రక నవలలు

5. క్షుద్ర నవలలు

6. విజ్ఞానశాస్త్ర నవలలు

7. అనువాద నవలలు

8. హాస్య, వంగ్య నవలలు

9. సాంఘిక నవలలు

10. జీవిత చారిత్రక నవలలు

11. జానపద నవలలు

12. ఉద్యమ నవలలు

13. చైతన్య స్రవంతి నవలలు

14. పిల్లల నవలలు

15. అపరాధ పరిశోధక నవలలు

16. వ్యాపార నవలలు

1980 నుండి తెలుగు సాహిత్యంలోనూ, ప్రపంచ సాహిత్యంలోనూ వర్గీకరణ తీరుతెన్నులు సమూలంగా మారుతూ వస్తున్నాయి. నవలల్లో చిత్రించిన జీవితాన్ని అనుసరించి, దృక్పథాన్ని అనుసరించి సూచించిన పరిష్కారాలను అనుసరించి, ఉద్దేశించిన పాఠకులను అనుసరించి నవలా సాహిత్యాన్ని వర్గీకరించడం అవసరం. 1980 తర్వాత స్త్రీవాద సాహిత్యం, దళిత వాద సాహిత్యం, ప్రాంతీయ స్పృహ, దేశీయ సంస్కృతి పట్ల శ్రద్ధ బాగా పెరిగింది. ఎవరి జీవితాల గురించి వారే రాయాలని చర్చలు వేగం పుంజుకున్నాయి. మిగతా వారు రాసేది సానుభూతి సాహిత్యమని ఆ జీవితాన్ని జీవించే వారు రాసేదే స్త్రీ వాద సాహిత్యమని, దళిత వాద సాహిత్యమని, తెలంగాణ సాహిత్యమని, రాయలసీమ సాహిత్యమని ఇలా వర్గీకరించారు. అందువల్ల వాటన్నిటినీ కలిపి ఇలా పేర్కొంటున్నాను.

**నేడు నవలలను ఇలా వర్గీకరించవచ్చు**[39]

1. అగ్రకుల, మధ్యతరగతి జీవితాల నవలలు

2. దళిత జీవితాల నవలలు



3. గ్రామీణ జీవితాల నవలలు

4. పట్టణ జీవితాల నవలలు

5. స్త్రీల జీవితాల నవలలు – కుటుంబ సంబంధాల నవలలు

6. పిల్లల నవలలు

7. విద్యార్థి, యువజనులను ఉద్దేశించిన నవలలు

8. మహిళా పాఠకుల కోసం రాసే నవలలు

9. గిరిజన జీవితాల నవలలు

10. బీసీ జీవితాల నవలలు

11. కార్మిక జీవితాల నవలలు

12. ఉద్యోగ, ఉపాధ్యాయ నవలలు

13. గాంధీవాద నవలలు

14. మార్క్సిస్టు నవలలు

15. అంబేద్కరిస్టు, దళితవాద నవలలు

16. మానవ సంబంధాల పరిణామ నవలలు

17. అభ్యుదయ నవలలు

18. విప్లవ నవలలు

19. డిటెక్టివ్ నవలలు

20. పాపులర్ వ్యాపార నవలలు

21. మనోవైజ్ఞానిక నవలలు

22. రామాయణ, భారతాది ఇతిహాస, ప్రబంధ సాహిత్య నవలలు

23. చారిత్రక నవలలు

24. ఉత్పత్తి సంబంధాలను విశ్లేషించే నవలలు

25. ఇన్వెస్టిగేటివ్ నవలలు

26. సినిమా నవలలు

27. దేశభక్తి నవలలు

28. చైతన్య స్రవంతి నవలలు

29. తెలంగాణ ఉద్యమ నవలలు

30. ఉత్తరాంధ్ర నవలలు

31. కోస్తా ఆంధ్ర నవలలు

32. రాయలసీమ నవలలు

33. ప్రవాస ఆంధ్ర నవలలు

34. కులవృత్తి జీవితాల నవలలు

35. ఉత్తమ పురుష నవలలు

36. ఏకపాత్ర కేంద్రక నవలలు

37. బహుళ పాత్రల కేంద్రక నవలలు

38. సెక్షనల్ నవలలు

39. విజ్ఞాన శాస్త్ర నవలలు

40. సామాజిక-ఆర్థిక-చారిత్రక పరిణామాల నవలలు

41. రాజకీయ, సామాజిక, ఉద్యమ నవలలు

బతుకుపోరు నవలను మానవ సంబంధాల, స్త్రీ కార్మికుల సమస్యల , సామాజిక, ఆర్థిక, ఉద్యమ నవలగా పేర్కొనవచ్చు.

### 2007లో నవల - స్థానం

"గడచిన యాభైఏళ్ళలో తెలుగు నవల ప్రజల జీవితానికి దగ్గరగా వచ్చింది. వివిధ వృత్తుల వారి జీవితమూ, వేర్వేరు ప్రాంతాల భాష (నుడికారాలు, సామెతలు) కూడా నవలల్లోకి వచ్చాయి"[40]

నవల ఎంత విస్తృతమైన జీవితాన్నైనా సమగ్రంగా చిత్రించగలిగిన పరిధిగల ప్రక్రియ. నవల ఎలక్ట్రానిక్ మీడియా వల్ల ప్రమాదంలో పడిందని కొందరు, కాలం తీరిపోయిందని కొందరు చర్చలు చేస్తున్నారు.[41] నవలల సంఖ్య తగ్గుతున్నది. అదే సమయంలో నవలల వాసి పెరుగుతున్నది. ప్రపంచ వ్యాప్తంగా హారీపాటర్ వంటి నవలలు సృష్టించిన సంచలనం ఇంతా అంతా కాదు. అవి పిల్లల పఠనాసక్తిని ఎంతగానో పెంచాయి.

### ఆధునిక సాహిత్య విమర్శ రీతులు[42]

ఆధునిక సాహిత్య విమర్శ రీతులు అనేకం. సృజన-విమర్శ, విలువల విమర్శ, వాఖ్యాన సమీక్ష, అలంకారిక విమర్శ, రచన పరమార్థ దృక్పథం, రచన, రచయిత



జీవిత సమన్వయ విమర్శ, చారిత్రక విమర్శ, మార్క్సిస్టు సాహిత్య విమర్శ, రూపవాద విమర్శ, శైలిశాస్త్ర విమర్శ, మనోవైజ్ఞానిక విమర్శ, ప్రాగ్రూప విమర్శ, ప్రతీకాత్మక విమర్శ, తులనాత్మక విమర్శ, ప్రక్రియా వివేచన, స్త్రీవాద విమర్శ, దళితవాద విమర్శ, ప్రాంతీయ వాద విమర్శ మొదలైనవి సాహిత్య విమర్శ రీతుల్లో కొన్ని.[43] నేను నా పరిశోధన వ్యాసంలో భారతీయ చారిత్రక, మానవతావాద, సామాజిక, రాజకీయ తులనాత్మక పరిశీలనా దృక్పథం అనుసరించాను. ఇందులో భాగంగా వస్తు, రూపాలతో పాటు అంతస్సారాన్ని, శైలి శాస్త్రాన్ని, మానవ సంబంధాల పరిణామాల్ని, రచయిత లక్ష్యాన్ని పరిశీలనకు స్వీకరించాను.



## పాదసూచికలు

1 ప్రేమ్‌చంద్ సాహిత్య వ్యాసాలు-కథలబడి; 1998 బి.ఎస్.రాములు పుస్తకం నుండి; పుట: 81

2 ప్రేమ్‌చంద్ సాహితీ వ్యాసాలు-బి.ఎస్.రాములు కథలబడి నుండి; పుట : 81-82

3 ఎల్లమ్మ కథల సంపుటి-కాసుల ప్రతాపరెడ్డి - 2006; పుట : 151

4 నవలా శిల్పం-వల్లంపాటి వెంకట సుబ్బయ్య, 1989; పుట : 122

5 సాహిత్య చరిత్రను కొత్తచూపుతో తిరగరాయాలి-బి.ఎస్.రాములు, 2005; పుట 45

6 నవలా శిల్పం - వల్లంపాటి వెంకట సుబ్బయ్య; పుట : 3, 4

7 సాహిత్య చరిత్రను కొత్తచూపుతో తిరగరాయాలి-బి.ఎస్.రాములు, 2005; పుట : 14

8 నవలా శిల్పం - వల్లంపాటి వెంకట సుబ్బయ్య; పుట : 18

9 భారతీయ భాషల్లో నవలా ప్రక్రియ-డా॥ విద్యేశ్వరి, 1998; పుట : 9

10 సమగ్ర సామాజిక కథ -50 ఏళ్ళ తెలుగు కథ తీరుతెన్నులు, బి.ఎస్.రాములు 2003; పుట : 35

11 సాహిత్య చరిత్రను కొత్తచూపుతో తిరగరాయాలి-బి.ఎస్.రాములు; పుట : 49

12 50 ఏళ్ళ తెలుగు కథ తీరుతెన్నులు-బి.ఎస్.రాములు; పుట : 34, 35

13 దాశరథి రంగాచార్య రచనలు-11వ సంపుటి; పుట : 66, 67

14 తెలుగు నవల-వ్యాపార ధోరణి; కాసుల ప్రతాపరెడ్డి, 1990; పుట : 2

15 శతవసంతాల కరీంనగర్-2006 వ్యాస సంకలనంలో బి.వి.ఎన్.స్వామి; పుట:179

16 17 సెప్టెంబర్ 1948 -కర్రె ఎల్లారెడ్డి; పుట : 10

17 నిజాం బ్రిటీష్ సంబంధాలు - సరోజిని రేగాని

18 సాహిత్య చరిత్రను కొత్త చూపుతో తిరగరాయాలి - బి.ఎస్.రాములు; పుట : 32

19 తెలంగాణ రాష్ట్ర చరిత్ర - బి.ఎస్.రాములు; పుట : 32

20 షబ్నవీస్ -తెలంగాణ పత్రికా రంగ చరిత్ర; సంగిశెట్టి శ్రీనివాస్; పుట : 9

21 సాహిత్య చరిత్రను కొత్త చూపుతో తిరగరాయాలి - బి.ఎస్.రాములు; పుట:37

22 "పొది-సంభాషణలు-అక్షర చిత్రాలు", జయధీర్ తిరుమలరావు 2003; పుట : 68

23 తెలంగాణ సాహిత్య, సాంస్కృతిక చైతన్యం - బన్న అయిలయ్య; పుట : 128

24 "కళలు, సాంఘిక జీవితం" - జి.వి.ప్లెహానోవ్; పుట : 6

25 ఆంధ్రజ్యోతి ఇంటర్వ్యూ, 2004 దినపత్రిక - కందుకూరి రమేశ్

26 కె.రామ్మోహన్‌రాయ్ తెలుగు పసిడి - సంపాదకులు : మండలి బుద్ధ ప్రసాద్, 2006; పుట : 690

27 సాహిత్య చరిత్రను కొత్త చూపుతో తిరగరాయాలి - బి.ఎస్.రాములు; పుట : 9

28 తెలంగాణ విమోచనోద్యమం-తెలంగాణ నవల - వరవరరావు ; పుట : 11

29 సాహిత్య చరిత్రను కొత్త చూపుతో తిరగరాయాలి - బి.ఎస్.రాములు; పుట : 74

30 చరబండరాజు నవలలు-2003; పుటలు : 3, 4

31 సృజనమాస పత్రిక సంచికలు-1978, 79

32 బతుకుపోరు నవల-మూడవ ముద్రణ, బి.ఎస్.రాములు; పుట : 8

33 ఆంధ్రజ్యోతి సచిత్రవార పత్రిక-1982

34 బతుకుపోరు నవల-ద్వితీయ ముద్రణ, బి.ఎస్.రాములు; ముందుమాట

35 బి.ఎస్.రాములు గారితో సంభాషణ

36 బతుకుపోరు నవల-మూడవ ముద్రణ, బి.ఎస్.రాములు; పుట : 110

37 బతుకుపోరు నవల- ద్వితీయ ముద్రణ-1990, బి.ఎస్.రాములు; అట్ట చివరిపేజి

38 జాతర నవల సమగ్రపరిశీలన-ఎం.శ్రీరాములు; పుట : 17

39 కథలబడి:కథాసాహిత్య అలంకార శాస్త్రం - బి.ఎస్.రాములు;పుటలు: 89,90

40 కడియాల రామ్మోహనరావు; "తెలుగుపసిడి" వ్యాస సంకలనం-2006; సంపాదకులు : మండలి బుద్ధ ప్రసాద్; పుట : 706

41 అంపశయ్య నవీన్, బి.ఎస్.రాములు 50వ జన్మదిన సంచిక; పుట : 111

42 ఆధునిక సాహిత్య విమర్శనా రీతులు, సం.సిహెచ్.లక్ష్మణ చక్రవర్తి-2004




## రెండవ అధ్యాయం

# బి.ఎస్.రాములు జీవిత రేఖలు

**పరిచయం**

జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత డా॥ సి.నారాయణ రెడ్డి గారు కర్రె సదాశివ్ గారి 'బి.ఎస్.రాములు కథలు-ఒక పరిశీలన' గ్రంథంలో ఇలా పేర్కొన్నారు. "మౌలిక సృజన శీలం, సామాజిక తత్వదర్శనం, సునిశిత విమర్శల పాటవం ముప్పేటలుగా అల్లుకున్న సమగ్ర సాహితీ వ్యక్తిత్వం బి.ఎస్.రాములు గారిది. ఆయన జీవన పరిణామ దశలు విస్మయావహంగా వున్నాయి. బీడీ కార్మికుడిగా, ఆర్.ఎస్.ఎస్ కార్యకర్తగా, రహస్య విప్లవోద్యమ యోధుడిగా, మానవ జీవితాల విభిన్న కోణాలను విశ్లేషించిన సామాజిక తత్వవేత్తగా రాములుగారి నిరంతర ప్రస్థానం అధ్యయన పరిశోధనలకు కావలసిన విస్తృతిని సంతరించుకుంది."(1)

బి.ఎస్.రాములు గారి జీవితం తెలంగాణ సామాజిక పరిణామాలకు ప్రతీక. తెలంగాణ సామాజిక పరిణామాలు వీరి జీవితం నిండా కనపడతాయి. తెలంగాణ సామాజిక చరిత్ర, పరిణతి అర్థం చేసుకుంటే కానీ బి.ఎస్.రాములు జీవిత పరిణామం అర్థం కాదు. అందువల్ల తెలంగాణ సామాజిక పరిణామం పరిశీలించడం అవసరం.

తెలుగు విశ్వవిద్యాలయం మాజీ వైస్‌ఛాన్సలర్ పేర్వారం జగన్నాథం బి.ఎస్.రాములుగారి జీవితం గురించి ఇలా అంటారు. "బి.ఎస్.రాములు గారి జీవితం నల్లేరు మీది బండి వంటిది కాదు. పూలపాన్పులా సుఖకరమైంది కాదు. సిరిసంపదలతో తులతూగింది అసలే కాదు. అతని జీవనవాహిని ఎన్నో ఒడుదుడుకులకు లోనైంది. ఎత్తు పల్లాల కత్తుల వంతెనల్ని దాటింది. అగాధాల లోతుల్ని కొలిచింది. కొండచరియలతో ఢీకొన్నది. భయంకర కీకారణ్యంలో సంచరించింది. క్రూరమృగాలతో సంభాషించింది. తపోవనాల్లోని పక్షులతో మాట్లాడింది. అక్కడ తన్ను తాను దర్శించుకున్నది. అంతటితో దానికొక నిలకడ వచ్చింది. మహాసాగరమై అవతరించింది.(2)

బన్న అయిలయ్య గారు ఈ పరిణామాలపై ఇలా విశ్లేషించారు.[3]

“బి.ఎస్.రాములుగారు 1982లో “బతుకుపోరు” అనే నవల రాసారు. అపూర్వమైన వస్తువును తీసుకుని ఉత్తర తెలంగాణ సామాజిక చరిత్రను నమోదు చేశారు. నిజానికి ఈ నవల వలన బి.ఎస్.రాములు రచయితగా నిలదొక్కుకున్నారు. 1982లోనే ఈయన్ని లూసన్, గోర్కీలతో పోల్చారంటే రాములు సామాజిక వాస్తవికతను ఎంత బలంగా ఆ నవలలో చిత్రించారో అర్థం అవుతుంది.

‘బతుకుపోరు’ నవల, దాదాపు 150కి పైగా కథలు రాసిన బి.ఎస్.రాములుగారు ఏదో ఒక సిద్ధాంతాన్ని నమ్మి అక్కడ ఆగిపోయిన రచయిత కాదు. స్థిరీకరించుకున్న దృక్పథాన్ని సార్వకాలీనంలో ఇదే నిలుస్తుందని గుడ్డిగా నమ్మిన రచయితా కాదు. భారతదేశానికి ప్రత్యేక గతి తార్కిక భౌతికవాదం ఒకటుండాల్సిన అవసరం ఉందనీ, అనివార్యంగా ఉంటుందని విశ్వసిస్తూ అన్వేషణతో బయలుదేరిన రచయిత ఇతను. మారుతున్న సామాజిక పరిస్థితులు, నిరంతరం విచికిత్సకు లోనవుతున్న సామాజిక సిద్ధాంతాలు, తారుమారవుతున్న విలువలు మొదలైనవాటిని ప్రశ్నిస్తే ఏమవుతుందో, ప్రశ్నించినవాళ్లకు జవాబుచెబితే ఏమవుతుందో అనే సందేహ సందిగ్ధాల టంగుటుయ్యాలలోని రచయిత కాదు. మార్పు ఒక ప్రవాహమని దానిలో అన్నీ కొట్టుకు పోగలవని విశ్వసించిన రచయిత. అందుకే అతను ప్రవాహాన్ని ఒడ్డు నుండి వీక్షించినవాడు కాదు. ప్రవాహంలోకి దిగి ఒకప్పుడు దానికనుకూలంగా, మరొకప్పుడు వ్యతిరేకముఖంగా పయనించిన రచయిత. కనుకనే ఎలాంటి భేషజాలు లేకుండా తన రచనలను రూపొందించాడు.

ఆర్.ఎస్.ఎస్. నుండి ఆర్.వై.ఎల్. కార్యకర్తగా, రాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా, హాస్టల్‌వార్డెన్ నుండి రహస్యజీవితం గడిపేదాకా, ఆ జీవితం నుండి జనజీవనప్రవంతిలో కలిసిన రచయితగా బి.ఎస్.రాములుకు ఒక ప్రత్యేకమైన అమూల్యమైన అనుభవాలు ఉన్నాయి. సమాజాన్ని అనేక కోణాల్లోంచి క్షుణ్ణంగా అధ్యయనం చేసే అవకాశం, పద్ధతి అలవడింది. అట్లాగే భారతీయ రచనల్ని అంతర్జాతీయ సృజనాత్మక రచనల్ని ఉత్తమ చరిత్రల్ని అధ్యయనం చేయడం వల్ల ఆయనలో కమిట్‌మెంట్ అనే చట్రంలోకి ఒదిగిపోయే లక్షణం విస్తరించింది. సామాజిక జీవితంలో అనేక పొరలుంటాయి. ముఖ్యంగా భారతదేశంలాంటి ప్రత్యేక లక్షణాలు కలిగిన సామాజిక జీవితంలో ఇంకా సున్నితమైన పొరలెన్నో ఉంటాయని గమనించాడు గనుకనే రచయితగానే ఆగిపోకుండా తాత్వికుడి స్థాయిలో ఆలోచించి పరిష్కారమార్గాలను చూపించాడు బి.ఎస్.రాములు.”



సుప్రసిద్ధ సాహితీ వేత్త, దళిత దార్శనికులు కత్తి పద్మారావుగారు బి.ఎస్.రాములు గారి గురించి విశ్లేషిస్తూ ఆయన ఒక సామాజిక తాత్విక విశ్వవిద్యాలయం అని అన్నారు. “ఈ ఔన్నత్య వ్యక్తిత్వాల నుండి సమకాలిక సమన్వయాలకు ఉపక్రమిస్తున్న తత్వశాస్త్ర అధ్యయన పరులలో బి.ఎస్.గారు మొదటి శ్రేణిలో నిలబడతారు. ఈయన రచనలు ఆంగ్లీకరించబడి జాతీయ అంతర్జాతీయ స్థాయిలో చర్చలోకి వెళితే ఒక ప్లేటోకి ఒక హెగెల్‌కి తగ్గవు అని మాత్రమే నేను చెప్పగలను. ఇక బి.ఎస్.గారి పని భారతీయ సామాజిక తాత్విక విశ్వవిద్యాలయాన్ని ప్రారంభించడం. ఇక అందులో అందరమూ విద్యార్థులమే.” [4]

“తెలంగాణ తొలితరం కథకులు గూడూరి సీతారాం గారు బి.ఎస్.రాములు గారి గురించి ఇలా పేర్కొన్నారు. “బి.ఎస్.రాములు గారు ప్రఖ్యాత సామాజిక తత్వవేత్త. తెలుగు కథకు తాత్విక స్పర్శ అద్దిన గొప్ప కథకులు. తెలంగాణ భూమికతో భారతీయ అంతరాత్మను సామాజి ఆర్థిక చరిత్రను తమ రచనల్లో ఆవిష్కరిస్తున్నారు. భారత ఉపఖండంలో బహుజన చైతన్యాన్ని తెచ్చిన దార్శనికుల్లో ఒకరు.”[5]

“బిఎస్.రాములు గారు ఒక నిరంతర ఉద్యమ చైతన్యం. ప్రస్తుతం ఆధునిక తెలుగు సామాజిక చరిత్ర, సాహిత్య చరిత్ర పునర్మూల్యాంకనం గురించి విస్తృత పరిశోధన చేస్తున్నారు. పలువురి వ్యాసాలతో పునర్మూల్యాంకనం చేసి సాహిత్య చరిత్ర, సామాజిక చరిత్రలను తెలుగు సమాజానికి అందిస్తున్నారు. వీరు 2003 నుండి సాహిత్యానికి సామాజిక ఉద్యమాలకు పూర్తికాలం కార్యకర్తగా తన జీవితాన్ని పునరంకితం చేశారు. బి.ఎస్.రాములు గారు భారతీయ తాత్విక రంగంలో జీవనదిలా ప్రవహించే తెలుగు తాత్విక చైతన్యం. ఈ తరం రచయితలకు మార్గదర్శకులు. వారొక కథల బడి, జీవన తత్వనిధి.”[6]

బి.ఎస్.రాములు ఆధునిక తాత్వికులని పేర్కొంటూ సుప్రసిద్ధ సాహితీవేత్త చీకోలు సుందరయ్య గారు ఇలా అన్నారు. “వ్యక్తికి, సమాజానికి, సాహిత్యానికి పరస్పర సంబంధం ఉంటుంది. వ్యక్తి సమాజంలో భాగంగా జీవిస్తాడు. సమాజంలో భాగంగా రూపుదిద్దుకుంటాడు. సమాజం పరిణామ శీలమైనది. సమాజ క్రమాన్ని వ్యక్తులు, శక్తులు, ఉత్పత్తి శక్తులు, ఉత్పత్తి సంబంధాలు, ఉత్పత్తి సాధనాలు సామాజిక వైరుధ్యాలు, సామాజిక వైవిధ్యాలు, నిర్దేశిస్తాయి. ఈ దృష్టితో చరిత్రను అధ్యయనం చేయడాన్ని చారిత్రక భౌతికవాదం అంటారని పుస్తకాల్లో చదువుతుంటాం. అయితే ఆ విధమైన అధ్యయనం చేసిన సామాజిక తత్వవేత్త బి.ఎస్.రాములు. ఆధునిక సమాజంలో

సాహిత్యాన్ని, సమాజాన్ని అంతే సీరియస్‌గా అధ్యయనం చేయడం రాములు ప్రత్యేకత."[7]

### బి.ఎస్.రాములు పుట్టుక

"రాములుగారి స్వగ్రామం కరీంనగర్ జిల్లాలోని జగిత్యాల. అదొకప్పుడు చారిత్రక ప్రదేశం. శాతవాహనుల తొలి రాజధాని నగరం – కోటిలింగాలకిది దగ్గరలో ఉంటుంది. దీనికనతి దూరంలోనే ధర్మపురి పుణ్యక్షేత్రం విలసిల్లుతున్నది. దానికానుకొని పవిత్ర గోదావరీ నది ప్రవహిస్తుంటుంది. సప్తగోదావరి ఈ ప్రాంతంలోనిదేనంటారు. వైదికమతంతో పాటు జైన బౌద్ధమతాలూ ఒకప్పుడు ప్రాచుర్యం పొందిన ప్రాంతం ఇది. ఇటీవలి కాలంలో శ్రామిక జనం ఫ్యూడల్ శక్తుల మీద జరిపిన తిరుగుబాటు "జగిత్యాల జైత్రయాత్ర"గా ప్రసిద్ధిగాంచింది."[8] జగిత్యాల జైత్రయాత్ర నేపథ్యంలోనే బి.ఎస్.రాములు సామాజిక, ఉద్యమ, రచన రంగాలు విస్తరించాయి.

కరీంనగర్ జిల్లా జగిత్యాల పట్టణంలో మిట్టపెల్లి నారాయణ, బేతి లక్ష్మీరాజు దంపతులకు బి.ఎస్.రాములు రెండవ సంతానం. వీరి మొదటి పేరు శ్రీరాములు. ఇంటి పేరు మిట్టపెల్లి. తాత బేతి రాజయ్య, అమ్మమ్మగారైన బేతి రాజమ్మ దంపతులకు సంతానం లేకపోవడంతో మేనల్లుడు అయిన బి.ఎస్.రాములు తండ్రిని[9] పెంపకం తెచ్చుకున్నారు. ఆ తర్వాత వారికి ముగ్గురు పిల్లలు. రెండవ సంతానమైన లక్ష్మీ రాజవ్వను మేనల్లుడికిచ్చి పెళ్ళి చేశారు. ఇంట్లోనే పెద్దకొడుకుగా ఉంచుకున్నారు.

1949 ఆగస్టు 23వ తేదీన బి.ఎస్.రాములు పుట్టే నాటికి తెలంగాణ సామాజిక పరిణామాలు ఇలా వున్నాయి.

### పుట్టుక – స్థానిక నేపథ్యం

1949 నాటికి జగిత్యాలలో చేనేత వృత్తి ఒకమాదిరిగా సాగుతుండేది. వీరి ఇంట్లో చేనేత మగ్గాలు ఉండేవి. నూలుకు వీరే రంగులు అద్ది బట్టలు నేసే వారు. క్రమంగా 1949లో జగిత్యాలలో స్థాపించిన "చేనేత సహకార సంఘం" ఏర్పాటుకు కృషి చేసిన వారిలో బి.ఎస్.రాములు నాన్న ఒకరు.[10]

### తల్లిదండ్రుల వృత్తుల పరిణామం – సామాజిక నేపథ్యం

"ప్రపంచ మార్కెట్‌లో భారతదేశపు ఉత్పత్తులకు డిమాండ్ పెరుగుతుందని తలంచి కలకత్తాకు 15 కి.మీ. దూరంలో క్రీ.శ. 1818 సంగలో మొట్టమొదటిసారిగా



బట్టల మిల్లును స్థాపించారు. మిల్లుకు అవసరమైన నూలును తయారు చేసే నూలు మిల్లులు భారతదేశంలో లేనందువల్ల యూరప్, జపాన్‌ల నుండి నూలు దిగుమతి చేసుకోవాలని 1817 సంగ నుండి నూలు దిగుమతి చేసుకోవడం ప్రారంభించారు. అంతేకాకుండా భారతదేశంలో ఉత్పత్తి అయిన పత్తిని బ్రిటన్‌కు ఎగుమతి చేయడం అక్కడి నుండి నూలును, వస్త్రాలను దిగుమతి చేసుకోవడం ప్రారంభమైంది."[11] అంబేద్కర్ భారతదేశంలోని చేతివృత్తి పరిశ్రమలను ఆంగ్లేయులు ఎలా ఒక పథకం ప్రకారం దెబ్బతీశారో వివరంగా రాసి సైమన్ కమిషన్‌కు అందజేశారు. బ్రిటన్ నుండి దిగుమతి చేసుకున్న ఉత్పత్తులకు సబ్సిడీ ఇచ్చి భారతదేశంలో ఉత్పత్తి అయ్యే సరుకులపై 200 శాతం పన్ను వేశారు. ఇలా వృత్తి నిపుణుల నడ్డి విరిచివేశారు. యూరప్ పారిశ్రామిక అభివృద్ధి కోసం భారతదేశాన్ని అన్ని విధాలుగా అణిచివేశారు. రాజకీయ అధికారాన్ని అందుకు విస్తృతంగా ఉపయోగించారు. వృత్తులు కోల్పోయి చేతివృత్తిదారులు వ్యవసాయంలోకి మళ్ళారు. దాంతో 1850 నుండి వ్యవసాయంపై మనుషుల వత్తిడి మునుపెన్నడూ లేనంతగా పెరిగింది. తద్వారా వ్యవసాయ కూలీల కూలీలు కూడా పడిపోయాయి. ఇలా భారతదేశ అభివృద్ధి సర్వనాశనం కావడానికి బ్రిటీష్ వాళ్ళే ప్రధాన కారణమని డాగ బి.ఆర్.అంబేద్కర్ సోదాహరణంగా నిర్ధారించారు.[12]

ఈ సామాజిక పరిణామాల పర్యవసానంగా చేనేత కులవృత్తి గిట్టుబాటు కాకపోవడంతో బి.ఎస్.రాములు నాన్న బొంబాయి బట్టల మిల్లు కార్మికుడిగా పని చేశారు. 1955లో హెర్నియా వ్యాధితో తండ్రి చనిపోయారు. అప్పటికి బి.ఎస్.రాములు వయస్సు ఆరేండ్లు. బి.ఎస్.రాములు తమ్ముడి వయసు మూడేళ్ళు. బి.ఎస్.రాములు తల్లి వయస్సు పాతికేళ్ళు.[13]

బి.ఎస్.రాములు తల్లి తండ్రితో పాటు కొంతకాలం బొంబాయి వెళ్ళింది. అక్కడ బీడీలు చెయ్యడం నేర్చుకుంది. వాతావరణం సరిపడక జగిత్యాలకు వచ్చేసింది. భర్త చనిపోయాక ముగ్గురి పిల్లలకు ఆమె ఒక్కరే దిక్కయ్యారు. కాయకష్టంతో తనతో నలుగురిని పెంచి పోషించే బాధ్యత ఆ తల్లిపై పడింది. అప్పుడు బీడీ పరిశ్రమ నిజామాబాద్, కరీంనగర్ జిల్లాల్లో తొలిదశలో ఉండేది. జగిత్యాలలో బీడీ కంపెనీ లేదు. కోరుట్లలో బీడీ కంపెనీలు ఉండేవి. కొంతకాలం కోరుట్ల వెళ్ళి బీడీలు చేసి ఆ తల్లి పిల్లలను పోషించింది. కోరుట్ల బి.ఎస్.రాములు నాన్నగారి సొంత ఊరు కూడా. బి.ఎస్.రాములు పెద్దనాన్నలు కోరుట్లలోనే ఉండేవారు. అయినా పొరుగూరులో బతుకడం కష్టమైంది.[14]

## బి.ఎస్.రాములు తల్లి జీవితం కూడా ఒక సామాజిక చరిత్రే

బి.ఎస్.రాములు తల్లి కీ.శే. బేతి లక్ష్మిరాజు గురించి ప్రత్యేకంగా చెప్పుకోవాలి. 'బతుకుపోరు' నవలలోని జీవితం ప్రధానంగా రచయిత తల్లిగురించినదే. సాహిత్యంలో ఆమె జీవితం ఎలా సృజనాత్మక రూపం తీసుకుందో 'బతుకుపోరు' నవలలో చూడవచ్చు. బి.ఎస్. రాములు గారి తండ్రి 1955 సం॥ దసరా ముందు చనిపోయాడు. బీజకుట్టు అనే హెర్నియా వ్యాధికి జిగట విరోచనాలు తోడై చనిపోయాడు. కోరుట్లలో బీడీలు చేయడం కోసం వెళ్ళిన లక్ష్మి రాజవ్వ అక్కడ ఎంతోకాలం ఉండలేకపోయింది. బి.ఎస్.రాములు పెదనాన్న మిట్టపల్లి రాజయ్య, సంగమ్మ పెద్దమ్మ అప్పటికే అచలతత్వ గురుబోధ చేస్తూ తిరుగుతున్నారు. నడిపినాన్న మిట్టపెల్లి లక్ష్మిరాజం పెండ్లికి పనికొచ్చే పట్టు రైక బట్ట నేస్తుండేవాడు. కోరుట్లలో బతకడం కష్టమైంది. మరికొందరు బీడీ కార్మికులు కలిసి బీడీల కంపెనీ జగిత్యాల్లో పెట్టాలని పోరాటం చేసి 1956-57లో సాధించుకున్నారు.[15]

చనిపోయే నాటికి రాములు గారి తండ్రి బొంబాయి బట్టల మిల్లు కార్మికుడు. ఏడాదికి ఒకటి రెండుసార్లు యింటికి వచ్చేవారు. కొద్దిరోజులు నాన్నతో పాటు అమ్మ బొంబాయి వెళ్ళి కాపురం పెట్టింది. పొట్టగడవక వచ్చేసింది. రాములు గారి తండ్రి కూడుపెట్టని కులవృత్తులు వదిలి పారిశ్రామిక వృత్తులు చేపడ్తూ "రెక్కల కష్టం"పై ఆధారపడే కార్మికవర్గంగా రూపుదిద్దుకుంటున్న తరానికి ప్రతీక. బట్టల మిల్లు కార్మికుడుగా మారక ముందు ఇంటి వద్దే బట్టలు నేస్తుండేవాడు. నూలుకు రంగులు అద్దే పని కూడా చేసేవాడు. రచయిత ఇంట్లో యిప్పటికి ఆనాటి "యిసిరెలు" (పనిముట్లు) కొన్ని గత చరిత్రకు సాక్ష్యాలుగా మిగిలిపోయాయి.[16]

రాములు గారి తల్లి వ్యక్తిత్వ రూపశిల్పి. తండ్రి ఎలా వుండే వాడనేకన్నా నాన్న ఎలా ఉండాలో అలా ఉండేవాడన్నట్లు చిత్రించింది తల్లి. ముగ్గురు పిల్లలను ఒక చేతి కష్టంతో పెంచి పెద్ద చేసింది. తన పిల్లలపై ఎన్నో ఆశలు పెంచుకుంది. ఆ ఆశలను నిరంతరం పిల్లలకు చెప్తూ ఏడుస్తూ వుండేది.

రచయితకు "నీకేం తెల్వది పోయే" అనే మాట ఊతపదం. తల్లి తెలియని విషయం అడిగినపుడు తల్లిని "నీకేం తెల్వది పోయే" అని అంటుండేవాడు. రచయిత ఎదగడానికి యిదొక మూలసూత్రం. రచయిత విప్లవాన్ని అమ్మలా ప్రేమించారు. అందువల్లే అమ్మను, భార్య, నలుగురు పిల్లలను, పదేళ్ళ ప్రభుత్వ ఉద్యోగాన్ని వది విప్లవంలో చేరారు. రచయిత విప్లవాల్లోకి వెళ్ళిన తర్వాత తల్లి కొడుకు గురించిన వేదనతో, ఏమైపోయాడోననే రంధితో కొంతకాలం పిచ్చిదైపోయింది. తల్లిని కొద్ది



రోజులు హైదరాబాద్ ఎర్రగడ్డ పిచ్చాసుపత్రిలో ఉంచారు. తల్లిదగ్గర ప్రాక్టీసు చేసిన "నీకేం తెల్వది పోయే" అనే అలవాటు రచయిత జీవితమంత విస్తరించింది. "ప్రతిదీ ప్రశ్నించు" అన్న బుద్ధుని తత్వానికి ఒక వాదరూపమే - "నీకేం తెల్వది పోయే".[17] తర్క శాస్త్ర, తత్వశాస్త్ర పరిజ్ఞానం ఉన్న వారికి దీని లోతేమిటో స్పష్టం అవుతుంది.

లక్ష్మి రాజవ్వ తన ఇరవై అయిదో ఏటనే భర్తను కోల్పోయింది. జీవితమంతా బీడీలు చేస్తూనే బతికింది. ఎన్నడూ సుఖపడింది లేదు. ఆమె కష్టాలు, కన్నీళ్ళు 'బతుకుపోరు'లో లక్ష్మి రాజవ్వ, రామక్క లక్ష్మి పాత్రల్లో చూస్తాం. లక్ష్మి రాజవ్వ తన భర్తతో కల్సి గడిపింది కొద్ది కాలమే. బట్టల మిల్లు కార్మికుడిగా మిట్టపల్లి నారాయణ బొంబాయి వెళ్ళాక ఏ ఆరు నెలలకో వారం, పది రోజులు యింటికి వచ్చి వెళ్ళేవారు. అలా తొమ్మిదేళ్ళు కాపురం చేసింది. నలభై ఏళ్ళు ఆ జ్ఞాపకాల్తో సహజీవనం చేస్తూ ఒంటరిగా జీవించింది. ఆమె బొంబాయిలో వున్నప్పుడు బీడీలు చెయ్యటం నేర్చుకుంది. ఆ తల్లిని భర్తలేని స్త్రీ అని తేలికగా చూశారు. ఎన్ని అవమానాల పాలైనా అవన్నీ హృదయంలోనే దాచుకుంది. ఇలా రచయిత 'తల్లిసాలు పిల్లడు'గా ఎదిగాడు. స్త్రీల సమాజంలో పెరిగారు. అమ్మ జీవితాన్ని ఎరువుగా తీసుకొని ఎదిగిన మొక్క రచయిత బి.ఎస్.రాములు.[18]

## బి.ఎస్.రాములు బాల్యం - విద్యాభ్యాసం

బి.ఎస్.రాములు బాల్యం జగిత్యాలలోని అంగడి బజారులోని ఇంటివద్ద ప్రారంభమయ్యింది. తెలంగాణ సాంప్రదాయిక ఆటపాటలన్నీ బి.ఎస్.రాములు బాల్యంలో ఆడుకున్నారు. ఈ విధంగా గోళీల ఆట, కోతికొమ్మచ్చి, దస్తి, బొంగరాల ఆట, కోకో మొదలైన ఆటలు ఆడుకున్నారు. రెండో తరగతి వరకు 'సాతాని' అయ్యగారి అరుగు మీద బడిలో చదువుకొని మూడవ తరగతిలో మర్కజీ పాఠశాలలో అనగా సెంట్రల్ ప్రైమరీ స్కూల్లో చేరాడు. స్కూల్లో విద్యాభ్యాసం ఆటపాటల్లాగే హాయిగా సాగింది. పేదరికంతో జీవిస్తున్నప్పటికి అది పేదరికం అని తెలియని వయసు. స్కూల్లో విద్యలో, ఆట పాటల్లో బి.ఎస్.రాములు ముందు ఉండేవాడు. పోటీల్లో అనేక బహుమతులు గెలుచుకొనేవారు.[2] ఐదవ తరగతి పూర్తి చేసి 1960 సం॥లో మల్టీపర్పస్ హైస్కూల్‌లో చేరారు. రెండువేల మంది విద్యార్థులతో తెలంగాణ ప్రాంతానికి తలమానికంగా ఆ స్కూలు అలరారుతూ ఉండేది. ప్రముఖ విద్యావేత్త ముద్దురామకృష్ణయ్య ప్రధానోపాధ్యాయుడిగా స్కూలులో అనేక ప్రయోగాలు ప్రవేశ పెట్టాడు. స్కూలుకు స్విమ్మింగ్‌పూల్ కట్టించాడు. స్కూలులో వడ్రంగం, బట్టలనేత, బొమ్మలు వేయడం మొదలైన అనేక పనులను నేర్పేవారు. హైస్కూలు విద్య కూడా ఒక ఆటలాగా ఆనందంగా సాగింది.

మధ్యాహ్నం పేద విద్యార్థులకు రొట్టె, పాలు ఇచ్చే వారు. బి.ఎస్.రాములు ఎప్పుడు మొదటి బెంచి మొదటి విద్యార్థిగా ఉండేవాడు. క్లాసులో మొదటి, రెండవ స్థానాల్లో ఉండేవాడు. ఎందుకోగానీ ఎన్ని సార్లు దరఖాస్తు చేసినా ఏ ఒక్కసారీ స్కాలర్‌షిప్ రాలేదు. లాబ్ డిపాజిట్ కట్టలేకపోవడంతో బి.ఎస్.రాములు ఎం.పి.సి గ్రూపు నుండి పదవ తరగతిలో కామర్స్ గ్రూపులోకి మారాల్సి వచ్చింది. [19]

## కులవృత్తుల నుండి విడివడుతున్న సమాజం - విద్య ప్రాధాన్యత

పదవ తరగతి నుండి బి.ఎస్.రాములు తాత బేతిరాజయ్య మనవడి కోసం పెళ్ళి సంబంధాలు చూడటం ప్రారంభించాడు. బి.ఎస్.రాములు కన్నా ఎంతో చిన్న వాడైన చిన్నమ్మ కొడుకు ద్యావనపెల్లి దేవరాజంకు పెళ్ళి చేశారు. బి.ఎస్.రాములు చదువుకోసం పెళ్ళి వాయిదా వేశారు. బి.ఎస్.రాములు గారి అన్న మిట్టపెల్లి రాజనర్సయ్య ఐదవ తరగతిలో చదువు ఆపేశారు. ఉపాధ్యాయుల దెబ్బలు, చిత్రహింసలు భరించలేక చదువు మానేసిన వారిలో రాజనర్సయ్య ఒకరు. చదువు మానేస్తే ఏదోఒక పని చేయకతప్పదు. ఏదో కిరాణా షాపులో నెలకు రెండు రూపాయల జీతంతో పనిలో పెట్టారు. అన్న ఆ పని చేయలేకపోయాడు. అన్న రాజనర్సయ్య మరికొందరు మిత్రులు కలిసి ఆడుకునే వారు. కులవృత్తి చేయమని లేదా బీడీలు చేయడం నేర్చుకోమని తీవ్రంగా కొట్టేవారు. బాధలు భరించలేక కొంతమంది కలిసి బొంబాయికి పారిపోయారు. అక్కడ పని నేర్చుకొని రాజనర్సయ్య బట్టలమిల్లు కార్మికుడిగా ఎదిగాడు. [20]

## నిరంతరం దుఃఖించిన బి.ఎస్.రాములు తల్లి

బి.ఎస్.రాములు తల్లి తరచుగా తన దుస్థితిని తలచుకొని ఏడుస్తూ వుండేది. అకాల మృత్యువుతో తన భర్తను తీసుకుపోయిన దేవుళ్ళను 'నీ గుడిలో మన్నుపొయ్య' అంటూ శపిస్తూ ఉండేది. పెద్దకొడుకు రాజ నర్సయ్య బొంబాయి నుండి తిరిగి వస్తే పెళ్ళి చేసింది. రెండు పెళ్ళిళ్ళు విడాకులు అయ్యేదాక మేనమామ బేతి రాములు నిద్రపోలేదు. అలా పెద్దకొడుకు బతుకు ఆగమైపోయింది. చివరకు పెద్దకొడుకు రాజనర్సయ్య 1974లో చనిపోయాడు. ఈ సంఘటనలు రామక్క జీవితంలో 'బతుకుపోరు' నవలలో చూస్తాం.

## విద్యార్థి దశలో బి.ఎస్.రాములు రచనాసక్తి

బి.ఎస్.రాములు 1963లో తొమ్మిదో తరగతిలో వున్నప్పటి నుండి రచనలు



చేయడం ప్రారంభించాడు. పదవ తరగతి నుండి కొన్ని రచనలు అచ్చు అవ్వడం ప్రారంభమైనాయి. తొలుత పద్యరచన చేసేవాడు. పాటలు కూడా రాసేవాడు. హైస్కూలులో వ్యాసరచన, ఉపన్యాస పోటీల్లో బహుమతులు గెలుచుకొనే వారు. పేదరికం వల్ల మేనమామ పెట్టే మానసిక హింస వల్ల ఎంతో కష్టం కలిగి ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్‌కు గురి అయినప్పటికి గొప్ప ఆత్మవిశ్వాసంతో ఉండేవారు. స్నేహితుల అభిమానాన్ని చూరగొన్నారు. ఎనిమిదో తరగతి నుంచి పదమూడేళ్ళ వయసులోనే జగిత్యాలలోని శాఖ గ్రంథాలయంలో కనిపించిన పుస్తకాన్నల్లా చదివేవారు. పుస్తకాల వల్ల ప్రపంచం తెలుసుకున్నాడు. [21]

## బి.ఎస్.రాములు విద్యార్థి జీవితంలో పెరిగిన పరిశీలనాశక్తి

బి.ఎస్.రాములు తెలివితేటలను, చురుకుదనం గమనించి ఉపాధ్యాయులు పరీక్షాపత్రాలు దిద్దేపనిని అప్పగించారు. ఎంతో ఉత్సాహంగా బి.ఎస్.రాములు ఆ పని చేసేవాడు. ఈ పని చేయడంలో బి.ఎస్.రాములుకు గొప్ప అనుభవం లభించింది. తద్వారా ఒకే ప్రశ్నకు ఎన్ని విధాలుగా తోటివిద్యార్థులు జవాబులు రాస్తారో తెలుసుకోగలిగాడు. అలా బి.ఎస్.రాములులో పరిశీలనాశక్తి విపరీతంగా అభివృద్ధి చెందింది. అందరి జవాబు పత్రాలను చదవడంతో అనేక విషయాలు తెలిసి ఆత్మవిశ్వాసం పెరిగి మరింత ఎక్కువగా మార్కులు తెచ్చుకొనే వాడు. చాలాసార్లు తనకు తానే మార్కులు ఇచ్చుకొనే వాడు.

## డిగ్రీ చదవు వద్దనిపించిన పేదరికం

1967 సం॥లో మార్చి పరీక్షల్లో పన్నెండో తరగతి ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులు అయ్యారు. కామర్స్ గ్రూపులో ఏడేళ్ళలో ఉత్తమ శ్రేణిలో ఉత్తీర్ణులయిన మొదటివారు బి.ఎస్.రాములు. పన్నెండో తరగతి ఉత్తీర్ణుడు అయ్యాక డిగ్రీలో చేరాలని అనేకమంది ఉపాధ్యాయులు సలహాలు ఇచ్చారు. 1965లో జగిత్యాలలో డిగ్రీ కళాశాల ఏర్పడింది. బి.ఎస్.రాములు తన తల్లిపడుతున్న కష్టాలు చూడలేకపోయాడు. తన చదువుకోసం తల్లిని మరింత కష్టపెట్టడం భావ్యం కాదనుకున్నాడు. ఆ కాలంలో పోస్టల్-టెలిగ్రాఫ్ డిపార్టుమెంట్‌లలో బోర్డు పరీక్షల్లో వచ్చే మార్కుల ఆధారంగా విద్యార్థులను ఉద్యోగాల్లోకి తీసుకొనే వారు. 1966 సం॥లో 53% మార్కులు వచ్చిన వారికి కూడా ఆ ఉద్యోగాలు వచ్చాయి. తనకు 64% మార్కులు వచ్చాయి కనక తనకు కూడా ఆ ఉద్యోగం వస్తుందని బి.ఎస్.రాములు ఆ ప్రకటన కోసం ఎదురుచూస్తూ గడిపాడు. [22]

### బీడీ పని – ఆరెసెస్ ముఖ్య శిక్షక్

తొమ్మిదో తరగతి నుంచే బి.ఎస్.రాములు బీడీలు చేయడంలో తల్లికి సహకరించే వాడు. బీడీలకు దారం కట్టడం, ఆకు తంబాకు తేవడం వంటి పనులు చేసేవాడు. బీడీలు చేయడం కూడా నేర్చుకున్నాడు. బాల్యం నుంచే మహిళా బీడీ కార్మికుల మధ్య బీడీ కంపెనీ వాతావరణంలో పెరిగారు. 1964 సం॥ నుండి ఇంటిముందు ప్రారంభించిన ఆరెస్సెస్ శాఖకు వెళ్ళేవారు. 1967 నుండి ఆ శాఖకు తానే ముఖ్యశిక్షక్‌గా పని చేశారు. బి.ఎస్.రాములు ముఖ్య శిక్షక్‌గా పని చేసినపుడు కీ॥శే॥ శ్రీధర్‌జీ, కీ॥శే. కళ్ళెపు విద్యాసాగర్‌జీ జగిత్యాలలో ఆరెస్సెస్ ప్రచారకులుగా ఉండేవారు. బి.ఎస్.రాములు ఎంతోమంది మిత్రులను ఆరెస్సెస్ కార్యకర్తలుగా మలిచారు. బీడీలు చేస్తూ, బీడీల కంపెనీ నడిపిస్తూ, శాఖ గ్రంథాలయానికి వెళ్తూ, ఆరెస్సెస్ శాఖను నడిపిస్తూ ఆరెస్సెస్ పత్రిక అయిన 'జాగృతి' వారపత్రికను తెప్పించి పంపిణీ చేస్తూ ఇలా బహుముఖాలుగా ఏకకాలంలో పని చేశారు బి.ఎస్.రాములు. పోస్టల్ డిపార్ట్‌మెంట్‌లో ఉద్యోగం కోసం ఎదురు చూస్తూ కొద్దిరోజులు పేపర్ బాయ్‌గా కూడా పని చేశారు.[23]

### తెలంగాణ అంతటా నిరుద్యోగం

తెలంగాణ ప్రాంతంలో 1964 నుండి నిరుద్యోగం పెరుగుతూ వచ్చింది. ఎక్కువ మందికి ఉపాధ్యాయ ఉద్యోగాలు లభించాయి. 1953లో ఉపాధ్యాయులకు 20 రూపాయల జీతం ఉండేది. 1968లో 96 రూపాయల జీతం ఉండేది. ఆ సమయంలో పోస్టాఫీసుల్లో మాత్రం 240 రూపాయల జీతం ఉండేది. తన మార్కుల ప్రకారం పోస్టాఫీసు ఉద్యోగం ఇస్తారని బి.ఎస్.రాములు ఎదురు చూశారు. వాళ్ళు పేర్కొన్న తేదీనాటికి బి.ఎస్.రాములు వయసు 9 నెలలు తక్కువ అయ్యింది. దాంతో ఉద్యోగం రాలేదు. తనకన్నా తక్కువ మార్కులు వచ్చిన వారికి ఉద్యోగాలు ఎందుకు వచ్చాయో తనకు ఎందుకు రాలేదో ఆయనకు అర్థం కాలేదు. చివరకు ఇలా వయసు తక్కువని తేలింది. రెండవ సారి అప్లయ్ చేస్తే మూడు నెలలు వయసు తక్కువై ఉద్యోగం రాలేదు.[23]

### తెలంగాణలో నిరుద్యోగం – ప్రత్యేక తెలంగాణ ఉద్యమం

1968 సం॥ నాటికి తెలంగాణలో నిరుద్యోగ సమస్య ఇంకా పెరిగిపోయింది. విద్యార్థులు రోడ్ల మీద పడ్డారు. ఆంధ్రప్రాంతంలోని నిరుద్యోగులు, తెలంగాణ



ప్రాంతంలోని ఉద్యోగాల్లో చేరడంతో తెలంగాణ వారికి ఉద్యోగాలు దొరకకుండా అయ్యాయి. ఉదాహరణకు 1964లోనే పదవ తరగతి చదువుతున్నప్పుడు బి.ఎస్.రాములుకు చదువు చెప్పిన ఆరుగురు ఉపాధ్యాయుల్లో ఇద్దరు ఉపాధ్యాయులు కృష్ణాజిల్లా కైకలూరు నుండి జగిత్యాలకు వచ్చిన వారు. ఒకాయన కిరాయికున్న ఇంటాయన కూతురు, తన విద్యార్థిని పెళ్ళి చేసుకున్నాడు. అందరూ ఇలా సంబంధాలు పెంచుకుంటే ఆ క్రమాలు వేరే వుండేవి. అలా జరగలేదు. నిరుద్యోగం పెరిగి తెలంగాణ అంతటా ప్రజల్లో అసంతృప్తి పెల్లుబుకింది. 'ఆంధ్ర గోబ్యాక్', 'జై తెలంగాణ' ఉద్యమం నిప్పులా రాజుకుంది. 1968 నుండి 1971 దాకా ప్రత్యేక తెలంగాణ ఉద్యమం విస్తృతంగా సాగింది. ముఖ్యమంత్రి కాసు బ్రహ్మానందరెడ్డి తెలంగాణ ఉద్యమంపై తీవ్ర నిర్బంధాలను ప్రయోగించారు. పోలీసు కాల్పుల్లో 370 మంది చనిపోయారు. విద్యాలయాలు మూతపడ్డాయి. చదువు సాగలేదు.[24] ఎలాగోలా పరీక్షలు జరిపించాలని ప్రభుత్వం భావించింది. మాస్‌కాపీయింగ్ పెరిగింది. దాంతో మార్కుల శాతం విపరీతంగా పెరిగిపోయింది. బి.ఎస్.రాములుకు 64% మార్కులు ఉన్నాయి. జైతెలంగాణ ఉద్యమ కాలంలో పోస్టాఫీసు ఉద్యోగాలు 83%పైగా మార్కులు వచ్చిన వారికి మాత్రమే వచ్చాయి. ఆ తర్వాత మార్కుల శాతం తగ్గలేదు. ఇలా మూడు సంవత్సరాల ఎదురు చూపు నిష్ఫలమైంది. అప్పటికే 1960 నుండి జగిత్యాలలోనే వున్న ఉపాధ్యాయ శిక్షణలో చేరడానికి ఇష్టపడలేదు. చివరకు అదైనా చదువుదామనుకుంటే 1969లో దాన్ని తీసేసి కరీంనగర్‌లో ఒకటే వుంచారు. రెండు సంవత్సరాల ఉపాధ్యాయ శిక్షణ మరో ఊరులో వుండి చదవడం భారమని భావించారు. పోస్టాఫీసులో ఉద్యోగం వస్తుందన్న ఆశతో ఇటు ఎంప్లాయిమెంట్ కార్డును సరిగ్గా రెన్యువల్ చేయించుకోలేదు. అప్పుడు మూడు నెలలకోసారి కార్డును రెన్యువల్ చేసుకోవాల్సి వచ్చేది.

### నిరుద్యోగంలో చిరుఉద్యోగాల్తో – సాయంకాల చదువు

1970 సం॥లో జగిత్యాలలో బి.ఎస్.రాములు తనకన్నా జూనియర్స్‌తో డిగ్రీ చదవటం ఇష్టం లేక ధర్మపురిలోని తెలుగు సాయం కళాశాలలో చదవడానికి నిశ్చయించుకొన్నాడు. ఈ ప్రతిపాదనను ధర్మపురి నివాసి అయిన చిన్ననాటి మిత్రుడు భీమనాతి ప్రభాకర్ స్వాగతించి అన్ని విధాలుగా సహకరించారు.[25] ధర్మపురిలో డి.ఓ.ఎల్., బి.ఓ.యల్ చేశారు. సాయం కళాశాలలో చదువుతూ పగలంతా న్యూస్‌పేపర్ ఏజెన్సీ నడిపారు. బీడీ కంపెనీలో పనిచేసేవారు. కొంతకాలం హోటల్, బ్రాందీషాపు నిర్వహించారు.

## బి.ఎస్.రాములు ఆధ్వర్యంలో కాలేజీ సమ్మె - సాహిత్య కార్యక్రమాలు

కాలేజీ సమస్యలపై బి.ఎస్.రాములు నాయకత్వంలో రెండు నెలలు పాటు విద్యార్థులంతా కాలేజి బాయ్‌కాట్ చేశారు. ధర్మపురిలో బ్రాహ్మణ కుటుంబాలు ఎక్కువ. చుట్టు పల్లెల్లో భూస్వాములు ఎక్కువ. వారందరికి దిన, వారపత్రికలను చదవడం అలవాటు చేసిన వారు బి.ఎస్.రాములు. నెలకు కనీసం ఒక్కటైనా సాహిత్య గోష్ఠిని నిర్వహించే వారు. యువభారతి రచనలను విరివిగా తెప్పించి అందరితో చదివించే వారు. ఆరెసెస్ శాఖను రెండు సంవత్సరాల పాటు నిర్వహించారు. ఇలా ఏకకాలంలో బహుముఖాలుగా పని చేశారు బి.ఎస్.రాములు.[26]

ఇలా ఆంధ్రప్రాంతం వలసవాదులు తెలంగాణ ఉద్యోగాలు కొల్లగొట్టడం వల్ల బి.ఎస్.రాములు సుమారు 9 సంవత్సరాలు నిరుద్యోగిగా మిగిలిపోవలసి వచ్చింది. ఇలా బి.ఎస్.రాములు జీవితం ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి, దాని నేపథ్యానికి ఒక ప్రత్యక్ష సాక్ష్యం. బి.ఎస్.రాములు లాగే లక్షలాది మంది ఏళ్ళ తరబడి నిరుద్యోగులుగా మిగిలిపోయారు.[27]

## శ్యామలతో పెళ్ళి కుదిరిన క్రమం

బి.ఎస్.రాములు గారికి 1972లో డి.ఓ.ఎల్. అర్హతతో ఆదిలాబాద్ జిల్లాలో తెలుగు పండిట్‌గా ఉద్యోగానికి ఎన్నికైనట్లు జిల్లా పరిషత్ నుండి లెటర్ వచ్చింది. త్వరలో అపాయింట్‌మెంట్ ఆర్డర్ పంపిస్తామని అందులో పేర్కొన్నారు. ఈ ఎన్నిక ఏడాది పాటే వుంటుందని, ఆ తర్వాత రద్దవుతుందని రాశారు. ఇలా చాలామందికి ఉద్యోగాలు వచ్చాయి. దినపత్రికలు తెప్పించి అమ్మడం వల్ల ఏ ఒక్క రోజు కూడా ఆ పని వదిలి పైరవీ కోసం ఆదిలాబాద్ జిల్లా పరిషత్ కార్యాలయానికి వెళ్ళడం వీలు కాలేదు. ఒక్కరిద్దరికి ఆ పని అప్పగిస్తే వాళ్ళు మోసం చేశారు. అలా ఎందరికో ఉద్యోగాలు వచ్చినప్పటికీ బి.ఎస్.రాములు గారికి అపాయింట్‌మెంట్ లెటర్ రానేలేదు.

బి.ఎస్.రాములు గారికి త్వరలో ఉద్యోగం వస్తుందని ధర్మపురిలో బీడీ కంపెనీలో పరిచయమైన మిట్టపల్లి రాజమల్లయ్య, ఈశ్వరమ్మ దంపతులు పిల్లవాడు చాలా తెలివి కలవాడని తమ కూతుర్ని ఇవ్వాలనుకున్నారు. కానీ వారి ఇంటి పేరు బి.ఎస్.రాములు అసలు ఇంటి పేరు మిట్టపల్లి కావడం, ఇద్దరి కుదురు కోరుట్ల ఊరే కావడం, ఇద్దరూ నల్లదారం వాడకూడదనే నియమం కలవారు కావడం వల్ల ఆశ వదులుకున్నారు. అయినా ఎలాగైనా పిల్లవానికి తమ వైపు నుంచే సంబంధం చేయాలని భావించారు.



అలా ఈశ్వరమ్మ అక్క చెన్న గౌరమ్మ, చెన్న నారాయణ కూతురు అయిన చెన్న శ్యామలను పెళ్ళి చేసుకోవడానికి పెళ్ళిచూపులు ఏర్పాటు చేశారు. 17-5-1973న శ్యామలతో పైడిమడుగులో పెళ్ళి జరిగింది. 1974 జూన్ 29న పెద్దకొడుకు ప్రాణిగ్రాహి జన్మించాడు. కరీంనగర్ జిల్లా ఎంప్లాయిమెంట్ ఎక్చేంజి ద్వారా హాస్టల్ వార్డెన్ ఉద్యోగానికి 1975 చివరిలో ఇంటర్వ్యూకు పిలుపు వచ్చింది. ఇంటర్వ్యూలో ఎంపికయ్యారు. 1975 డిసెంబర్ 17వ తేదీన కరీంనగర్ సమీపంలోని ఎలగందలలో సోషల్ వెల్ఫేర్ హాస్టల్ వార్డెన్‌గా ఉద్యోగంలో చేరాడు. ఎలగందుల 1906 దాకా కరీంనగర్ జిల్లాకు జిల్లా కేంద్రంగా ఉండేది. 1906లో కరీంనగర్ జిల్లా కేంద్రం అయ్యింది.[28]

## ప్రభుత్వ ఉద్యోగంతో ఉద్యమ బాట

హాస్టల్ వార్డెన్ ఉద్యోగం అనేక ఒత్తిళ్ళతో కూడుకున్నది. అనేక సమస్యలు చుట్టుముట్టేవి. స్థానికసమస్యలు, విద్యార్థుల సమస్యలు, అధికారుల సమస్యలు, రాజకీయ నాయకుల సమస్యలు ఇలా ఎన్నో రకాల సమస్యలు, ఒత్తిడిలు ఉక్కిరిబిక్కిరి చేశాయి. స్వేచ్ఛగా, ఉత్సాహంగా సమాజం కోసం అంకితమై పనిచేసే స్వభావాన్ని చిన్నతనం నుండే అలవరచుకున్న బి.ఎస్.రాములు యీ పరిస్థితులలో ఇమడలేదు. వాటిని ఎదిరించాడు. వార్డెన్‌ల సంఘాన్ని నిర్మించి "సంఘమిత్ర" అనే పత్రికను ప్రచురించారు.

## దేశీయ సామాజిక పరిణామాలు

1972 నుండి దేశంలో తెలంగాణలోలాగే తీవ్రమైన అసంతృప్తి ప్రబలింది. లోక్‌నాయక్ జయప్రకాష్ నారాయణ్ నాయకత్వంలో అవినీతికి వ్యతిరేకంగా ఉద్యమం మొదలైంది. 1975 సం॥లో ఇందిరాగాంధీ ఎన్నిక చెల్లదని కోర్టు తీర్పు ఇచ్చింది. అందువల్ల రాజీనామా చేయాలని జయప్రకాష్ నారాయణను ఆదర్శంగా తీసుకొని అన్ని పార్టీలు ఉద్యమించాయి. ఇందిరాగాంధీ రాజీనామా చేయలేదు. ప్రజా ఉద్యమాలను, పార్టీలను అణచివేయడానికి ఆమె 25 జూన్ 1975న ఎమర్జెన్సీ విధించింది. లక్షలాది మందిని అరెస్టు చేశారు. దేశం అల్లకల్లోలం అయ్యింది. 1977 ఫిబ్రవరిలో ఎమర్జెన్సీ ఎత్తివేసి ఇందిరాగాంధీ ఎన్నికలు ప్రకటించింది. కాంగ్రెస్ ఓడిపోయింది. లోక్‌నాయక్ జయప్రకాష్ నారాయణ నాయకత్వంలో అనేక పార్టీలు ఏకమై జనతా పార్టీగా ఏర్పడి పోటీ చేసి గెలుపొందాయి. మురార్జీ దేశాయ్ ప్రధాన మంత్రిగా జనతాపార్టీ ప్రభుత్వం ఏర్పడింది. ఎమర్జెన్సీలో అరెస్టు చేసిన అందరినీ

విడుదల చేశారు. ప్రజలు స్వేచ్ఛా వాయువులు పీల్చారు. ఆ స్వేచ్ఛను ఆసరా చేసుకొని నక్సలైటు నాయకులు విద్యార్థి, యువజన, రైతు కూలీ సంఘాలను నిర్మించారు. అనేక సమస్యలపై ఉద్యమించారు. 'గ్రామాలకు తరలండి' అని విద్యార్థులకు పిలుపు ఇచ్చారు. ఇవన్నీ బి.ఎస్.రాములు జీవితంలో చెదిరిపోని ప్రభావాలను వేశాయి. [29]

అలా ఉద్యోగ సంఘాలు నిర్మించడంతో పాటు, 1977లో చంద్రపుల్లారెడ్డి నాయకత్వంలోని నక్సలైటు, విద్యార్థుల ఉద్యమాల సైద్ధాంతిక శిక్షణా శిబిరాలను బి.ఎస్.రాములు ఇంట్లో ఏర్పాటు చేశాడు. ఆ సిద్ధాంత శిక్షణ శిబిరాల్లో చంద్ర పుల్లారెడ్డి, వేములపల్లి వెంకటరామయ్య, కూరరాజన్న మొదలైన వారు క్లాసులు చెప్పారు. [2]

### చరిత్రలో 1967 ఒక కొండ గుర్తు-అంతర్జాతీయ సామాజిక పరిణామాలు

1967లో ఫ్రాన్స్‌లో 'డీగోల్' ప్రభుత్వానికి వ్యతిరేకంగా విద్యార్థులు ఉద్యమించారు. డీగోల్ రాజీనామా చేశాడు. 1967లో భారతదేశంలో సగం రాష్ట్రాల్లో కాంగ్రెస్ ఓడిపోయి ఇతర పార్టీలో అధికారంలోకి వచ్చాయి. 1967లోనే నక్సల్ ఉద్యమం ఉధృతంగా సాగింది. మహారాష్ట్రలో దళిత పాంథర్స్ ఉద్యమం మొదలైంది. రూపాయి విలువ పతనం వేగం పుంజుకుంది. [30] 1967 నుండే బి.ఎస్.రాములు నిరుద్యోగ పర్వం ప్రారంభమైంది.

### తొమ్మిదేళ్ళ నిరుద్యోగం-బి.ఎస్.రాములు అవగాహనను మార్చిన తీరు

ఇలా అంతర్జాతీయ, జాతీయ, ప్రాంతీయ, స్థానిక, వ్యక్తిగత, సామాజిక జీవన పరిణామాలు అన్నింటిలో ఏకసూత్రత గమనించవచ్చు. బి.ఎస్.రాములు జీవితం వీటి అన్నిటిగుండా సాగింది. వీటి ఆటుపోట్లు అన్నీ వీరి జీవితాన్ని అతలాకుతం చేశాయి. 1975 చివరిలో ఉద్యోగం వచ్చేటప్పటికి 9 సం॥ల నిరుద్యోగం బి.ఎస్.రాములు జీవిత దృక్పథాన్ని సమూలంగా మార్చివేసింది. ఈ అస్తవ్యస్త సమాజాన్ని మార్చాలనుకున్నారు. అలా ఆరెసెస్ నుండి నక్సలిజం వైపుకు నడిచారు.

### ఆరెసెస్ నుండి నక్సలిజం వైపుకు నడిచిన బి.ఎస్.రాములు

ఉద్యోగం దొరికాక చాలామంది ఉద్యమాల నుండి ఆగిపోతుంటారు. కానీ రాములు గారు ఉద్యోగం వచ్చాక ఉద్యమాల్లో మరింత దీక్షతో ముందుకు కదిలారు. అలా విద్యార్థులను, ఉద్యోగులను, రచయితలను ఆర్గనైజ్ చేశారు. ఈ సమాజం కోసం ఏదో ఒకటి చేయాలనే తపన అతనిలో నిరంతరం వెన్నాడుతూ వుండేది. తనలాంటి పేద బతుకులకు జీవితం పట్ల ఆశ, విశ్వాసం కలిగించే విధంగా సామాజిక



ఏర్పాటు రావాలని అభిలషించారు. ఇలా నక్సలైటు ఉద్యమంలో మమేకమయ్యారు. నక్సలైట్ ఉద్యమ రాజకీయాలను, సాహిత్యాన్ని విస్తృతంగా అధ్యయనం చేసి ప్రచారం చేశారు. 1978 నుండి పౌరహక్కుల సంఘం, అంబేద్కర్ సంఘం, రాడికల్ విద్యార్థి సంఘం మొదలైన రాజకీయ, సామాజిక కార్యకలాపాలను నిర్వహించారు. [31]

### బి.ఎస్.రాములు విరసంలో చేరిన క్రమం

బి.ఎస్.రాములు 1979-80లో విప్లవ రచయితల సంఘంలో సభ్యుడుగా చేరారు. 1978 నుంచీ హుజూరాబాద్‌లో పని చేయడం వల్ల అక్కడికి అరగంట దూరంలో వుండడం వల్ల వరంగల్‌లోని కాకతీయ యూనివర్సిటీకి, సృజన కార్యాలయానికి రాకపోకలు, సంబంధాలు పెరిగాయి. కాకతీయ యూనివర్సిటీలో పి.డి.ఎస్.యు, ఆర్.ఎస్.యు నాయకత్వం బలంగా ఉండేది. 1980లో రచయితలు 'గ్రామాలకు వెళ్ళి ప్రజలను అధ్యయనం చేయాలి' అని విరసం ఇచ్చిన పిలుపుతో కొంతమంది మిత్రులను తీసుకొని సిరిసిల్ల తాలూకాలో బయలుదేరి నిర్బంధించబడ్డారు. [32]

### ప్రత్యేక తెలంగాణ, నక్సలైట్ ఉద్యమాలకు నిరుద్యోగమే ప్రధాన కారణం

నిరుద్యోగం ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి, నక్సలైటు ఉద్యమానికి ప్రధాన కారణం. అందుకు బి.ఎస్.రాములు జీవితమే ప్రత్యక్ష ఉదాహరణ. తెలంగాణలో 1970 తర్వాతి తరం ఉన్నత చదువులు చదవడమే అనవసరమని, చదివితే నిరుద్యోగం తప్ప భవిష్యత్ ఏమున్నదని తీవ్ర నిరాశకు గురి అయ్యారు. ఈ అసంతృప్తి ఈ సమాజాన్ని సమూలంగా మార్చాలనే వైపు దారి తీసింది. తెలంగాణలో నక్సలైట్‌సమస్య ఆంధ్రప్రాంత వలసవాదం వలన పుట్టిపెరిగింది. [33] 1969లో తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు చేసి వుంటే నక్సలైట్ సమస్య తెలంగాణ ప్రాంతంలో విస్తరించి వుండేది కాదు.

### విప్లవ సంఘాల్లో బి.ఎస్.రాములు

ఇలా నిరుద్యోగ కారణాలు, అనుభవం నేర్పిన పాఠాలు బి.ఎస్.రాములును నక్సలైట్ ఉద్యమం వైపు నడిపించాయి. ఆ క్రమంలో బి.ఎస్.రాములు 1983లో కరీంనగర్ జిల్లా పౌరహక్కుల సంఘం జిల్లా కార్యదర్శిగా ఎన్నికయ్యారు. [34] 1983 మేలో కరీంనగర్‌లో జరిగిన రైతుకూలీ సంఘ రాష్ట్ర మహాసభలకు తనవంతు బాధ్యతలు నిర్వహించారు. పోలీసు నిర్బంధాలకు వ్యతిరేకంగా గ్రామాలకు వెళ్ళి

వాస్తవాలు సేకరించి నిజనిర్ధారణ ప్రకటించేవారు. పోలీసులకు పౌరహక్కుల సంఘం కార్యకలాపాలు సహింపరానివిగా కనపడ్డాయి.

## ఉద్యోగం, కుటుంబం వదిలి ఉద్యమ బాట పట్టిన బి.ఎస్.రాములు

1984 జనవరిలో బి.ఎస్.రాములును అరెస్టు చేసి తప్పుడు కేసులు బనాయించి జైలులో పెట్టారు. 20 రోజుల తర్వాత బెయిల్‌పై విడుదల అయ్యారు. 1984 జులైలో అనంతపురంలో జరిగిన రాడికల్ యువజన సంఘం రాష్ట్ర మహాసభల్లో రాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా ఎన్నికయ్యారు. రాష్ట్ర వ్యాప్తంగా సభలు, సమావేశాలు, ఉద్యమాలు నిర్వహించారు. ఉద్యోగం వదిలి 1985 జూన్ నుండి ఏడు ప్రధాన ప్రజా సంఘాలైన రాడికల్ విద్యార్థి యువజన సంఘాలు, విరసం, జననాట్యమండలి, రైతు కూలి సంఘం, అఖిల భారత విప్లవ సాంస్కృతిక సమితి (ఎఐఎల్ఆర్‌సి), ఎఐఆర్ఎస్ఎఫ్ (అఖిల భారత విప్లవ విద్యార్థి సంఘం) తరపున చేసిన "అఖిల భారత ప్రజా సమాచార సాంస్కృతిక పర్యటన" వందల, వేల విప్లవ రచయితలు, నాయకులు, మేధావులు, పౌరహక్కుల సంఘాల నాయకులు, అభిమానులను కలుసుకోవడం కలిసి పని చేయడం... అనేక అనుభవాలను ఇచ్చింది.[35]

## రహస్య జీవితం

ఇలా 1985-90లలో గద్దర్, వరవరరావు, సంజీవ్, తదితరులతో కలిసి అజ్ఞాతవాసంలో ఉన్నారు. అజ్ఞాతంలో వుంటూ అఖిల భారత ప్రజా సమాచార సాంస్కృతిక పర్యటన చేస్తూ 12 రాష్ట్రాలు సందర్శించారు. ఆయా రాష్ట్రాల్లో పలు సంస్థలతో, సంఘాలతో చర్చలు కొనసాగించారు.[36]

## తిరిగి బహిరంగ జీవితంలోకి - నూతన దృక్పథం-నూతన ఆచరణ

1990 ఏప్రిల్ 1వ తేదీన మంథనిలో జరిగిన కరీంనగర్ జిల్లా ఆర్‌వైఎల్ మహాసభల్లో బహిరంగ జీవితంలోకి వచ్చారు. ప్రస్తుతం దళితవాద, స్త్రీవాద, విప్లవవాద, బౌద్ధ, మానవీయ వాదాలను సమన్వయిస్తూ తాత్విక, సాంస్కృతిక రంగాల్లో కృషి సాగిస్తున్నారు. 1990 నుండి రాష్ట్రమంతటా సుడిగాలిలా పర్యటించారు. 1992లో బీసీ, ఎస్సీ, ఎస్టీల వేదికగా ఏర్పడిన "ఆంధ్రప్రదేశ్ దళిత రచయితల కళాకారుల, మేధావుల ఐక్యవేదిక" వ్యవస్థాపక అధ్యక్షులు. ప్రస్తుతం దానికి గౌరవాధ్యక్షులు.[37]



## బి.ఎస్.రాములు కుటుంబం - శ్యామల పాత్ర - బీడీ కార్మికురాలిగా పిల్లల్ని పోషించిన శ్యామల

బి.ఎస్.రాములు-శ్యామలకు నలుగురు పిల్లలు. పెద్ద కొడుకు పాణిగ్రాహి, రెండవ కుమారుడు శ్రీకాంత్, మూడవ కుమారుడు కిరణ్, నాల్గవ కుమారుడు నరేష్. తండ్రి లేని పిల్లలుగా పిల్లల విద్యాభ్యాసం సాగింది. శ్యామల వీరిని బి.ఎస్.రాములు తల్లివలే బీడీలు చేసి పెంచి పోషించింది. అలా యాభై ఏళ్ళుగా బీడి పరిశ్రమకు బి.ఎస్.రాములు గారి రెండు తరాల జీవితం పెనవేసుకు కొనసాగాయి. ఇలా 'బతుకుపోరు' నవలలో కన్నా బీడి కార్మికులుగా వీరి కుటుంబ అనుభవాలు మరెన్నో రెట్లు ఉంటాయి.

బి.ఎస్.రాములు రహస్య జీవితంలోకి వెళ్ళాక శ్యామల నలుగురు పిల్లల్ని బీడీలుచేస్తూ పెంచి పోషించి వారిని చదివించింది. ఎన్నో నిర్బంధాలకు గురైంది. పిల్లల పెంపకంలో ఆమెది ప్రధాన పాత్ర.[38] ఇలా శ్యామల జీవితం కూడా 'బతుకుపోరు' నవలలోని కష్టసుఖాలలాగే కొనసాగింది.

## బి.ఎస్.రాములు రచనా దృక్పథం

బి.ఎస్.రాములు ప్రజాపక్షపాతి. ప్రజల గురించి, సామాజిక పరిణామాల గురించి పేద ప్రజలకు అనుగుణంగా రాయడమే వారి రచనా దృక్పథం. భారతీయ చారిత్రక భౌతిక వాదం వారి రచనా దృక్పథానికి భూమిక.[39] అది సమస్త వర్ణ, వర్గ, కుల, లింగ, జాతి, మత ప్రాంత విచక్షణకు అసమానతలకు వ్యతిరేకంగా ఉద్యమిస్తుంది. స్వేచ్ఛా, సమానత్వం, సౌభ్రాతృత్వం ప్రతి మనిషికి ఒకే విలువ, అందరికీ సమాన అవకాశాలు వుండాలి అనే ప్రాతిపదికతో బి.ఎస్.రాములు రచనా దృక్పథం కొనసాగుతుంది.

## 'బతుకుపోరు' రచనా దృక్పథం

బి.ఎస్.రాములు మార్క్సిజం, లెనినిజం దృక్పథంతో అనేక రచనలు చేశారు. ఈ దృక్పథంతో రాసిందే 'బతుకుపోరు' నవల. ఆ తర్వాత అంబేద్కరిజంతో సమన్వయించి మరెన్నో రచనలు చేశారు. బౌద్ధ, మానవీయ, స్త్రీవాద, మార్క్సిస్టు, అంబేద్కరిస్టు, బహుజనవాద దృక్పథాలను సంశ్లేషించి మొదలైన ఒక విశిష్ట తాత్విక దృక్పథాన్ని రూపొందించారు.[40] ఆ తాత్విక దృక్పథం దేశంలో రాష్ట్రంలో అనేక పరిణామాలకు స్ఫూర్తిని ఇచ్చింది. వీరి రచనలు అన్నింటిలోనూ యీ దృక్పథాల పరిణామం స్పష్టంగా గోచరిస్తుంది.[41]

### బి.ఎస్.రాములు రచనా నేపథ్యం[42]- రచనా వికాసం

బి.ఎస్.రాములు అమ్మ, అమ్మమ్మ చెప్పిన చిన్ననాటి కథలు విని వాటికి మరికొన్ని కల్పనలు జోడించి స్నేహితులకు చెప్పడం ద్వారా బాల్య దశ నుండే శ్రవ్య కథకుడిగా కథల జీవితం ప్రారంభించారు. చందమామ, బాలమిత్ర పత్రికలకు అనేక గేయ కథలు రాసి పంపారు. బాలమిత్ర మాసపత్రికలో 1968 జనవరిలో 'జగిత్యాల కథ' అనే పేరుతో తొలి కథ వచ్చింది. 1977 నుండి నూతన దృక్పథంతో రచనలు చేయడం ప్రారంభించారు. తిరుగుబాటు, పాలు, ఇంటర్వ్యూ కథలతో ఉద్యమ కథా రచయితగా నమోదు చేసుకున్నారు. ఆ క్రమంలో 1982లో 'బతుకుపోరు' నవల రాశారు. అప్పటి నుండి వీరి రచనా పరంపర కొనసాగుతునే వుంది.

### బి.ఎస్.రాములు రచనలు [43]

| | | |
|---|---|---|
| 1. | బతుకుపోరు నవల (మూడవ ముద్రణ-2004) | 1982 |
| 2. | పాలు - కథల సంపుటి | 1991 |
| 3. | గతితర్క తత్వదర్శన భూమిక | 1991 |
| 4 | కన్యాశుల్కంను ఇప్పుడు ఎలా చూడాలి? (6వ ముద్రణ-2005) | 1993 |
| 5. | దళిత సాహిత్య గర్జన (మూడవ ముద్రణ-1995) | 1993 |
| 6. | గతితర్కం - అంబేద్కరిజం - మార్క్సిజం | 1993 |
| 7. | సాహూ ఇంటర్వ్యూలు | 1994 |
| 8. | అంబేద్కరిజం - సోషలిజం | 1994 |
| 9. | ప్రేమ అంటే ఏమిటి? (మూడవ ముద్రణ-2004) | 1996 |
| 10. | స్మృతి కథల సంపుటి | 1997 |
| 11. | జ్ఞానం పుట్టుక | 1998 |
| 12. | భౌతికవాద ప్రాపంచిక దృక్పథం | 1998 |
| 13. | నేను ఎవరు? గతితర్క తత్వదర్శన భూమిక | 1998 |
| 14. | కథలబడి - కథా సాహిత్య అలంకార శాస్త్రం | 1998 |
| 15. | మమతలు-మానవ సంబంధాలు కథల సంపుటి | 2000 |
| 16. | వేపచెట్టు తెలంగాణ కథలు | 2003 |
| 17. | సమగ్ర సామాజిక కథ 50 ఏళ్ళ తెలుగు కథ తీరు తెన్నులు | 2003 |
| 18. | బహుజనతత్వం (బీసీ, ఎస్సీ, ఎస్టీ సిద్ధాంతాలు-కార్యాచరణ) | 2004 |
| 19. | బీసీలు ఏం చేయాలి? | 2004 |
| 20. | బీసీ, ఎస్సీ, ఎస్టీ, విద్యార్థి యువజనులారా! | 2004 |
| 21. | తేనెటీగలు - కథల సంపుటి | 2004 |
| 23. | పాలు-ఇతర కథలు | 2004 |
| 24. | తెలంగాణ తల్లి ఎరుక | 2005 |
| 25. | భారతీయ సమాజం-నేటి రాజకీయ సామాజిక పరిణామాలు | 2004 |
| 26. | సాహిత్య చరిత్రను కొత్త చూపుతో తిరగరాయాలి | 2004 |
| 27. | బతుకుపయనం - కథల సంపుటి | 2006 |
| 28. | వ్యక్తిత్వ వికాసం-సామాజిక నాయకత్వం | 2006 |
| 29. | జీవితం అంటే ఏమిటి ? | 2006 |
| 30. | తెలంగాణ రాష్ట్ర చరిత్ర | 2006 |
| 31. | తెలంగాణ రాష్ట్రం-నడుస్తున్న చరిత్ర | 2006 |
| 32. | తెలంగాణ రాష్ట్ర ఉద్యమం - భవిష్యత్ కార్యక్రమాలు | 2006 |
| 33. | తెలంగాణ జైత్రయాత్ర | 2007 |
| 34. | అదిగదిగో తెలంగాణ-ఎంతో దూరంలో లేదు | 2007 |
| 35. | తెలంగాణ రాష్ట్రాన్ని పునర్నిర్మించండి<br>మీ వూరిని మీరే అధ్యయనం చేయండి | 2007 |
| 36. | తెలంగాణ ఉద్యమంలో నక్సలైట్ల పాత్ర | 2007 |
| 37. | తెలంగాణ రాష్ట్ర ఉద్యమంలో మలుపులు | 2007 |
| 38. | యుపిలో బిఎస్పి గెలుపు | 2007 |
| 39. | 60ఏళ్ళ తాత్విక సామాజిక పరిణామాలు | 2007 |
| 40. | బీసీలకు రాజకీయ అధికారం | 2007 |
| 41. | భారతీయ చరిత్ర శూద్ర దృక్పథం | 2007 |
| 42. | తెలంగాణ స్టేట్ నీడ్ ఆఫ్ రివైవల్ | 2008 |
| 43. | పర్సనాలిటీ డెవలప్‌మెంట్ సోషల్ లీడర్‌షిప్ | 2008 |
| 44. | వాట్ ఈజ్ లైఫ్ | 2008 |
| 45. | తెలంగాణ స్టోరీస్ | 2008 |
| 46. | తెలంగాణ కథకులు-కథన రీతులు (మొదటిభాగం) | 2008 |
| 47. | తెలంగాణ కథకులు-కథన రీతులు (రెండవభాగం) | 2008 |
| 48. | పాట పుట్టుక | 2008 |
| 49. | దళిత సాహిత్య యుగం వ్యాసాలు | 2008 |
| 50. | రాజ్యం - ప్రజలు | 2008 |

బి.ఎస్. రాములు గారు ఎందరినో రచయితలుగా తీర్చిదిద్దారు. వందలాది రచయితలకు స్ఫూర్తి అయ్యారు. ఆ క్రమంలో వీరికి పలు పుస్తకాలు అంకితం ఇవ్వబడ్డాయి. 125పైగా పుస్తకాలకు విపులమైన ముందుమాటలు రాశారు. వీరిలోని సుగుణం ఏమిటంటే ప్రతి ఒక్కరిలో దాగి వున్న సృజనను వెలికితీసి ప్రోత్సహించడం. ఆయన ఎక్కడ వుంటే అక్కడ సాహిత్య వాతావరణ వెల్లివిరుస్తుంది. 1970ల్లో డా॥ సంగనభట్ల నర్సయ్య, భీమనాతి ప్రభాకర్ మొదలుకొని కె.వి.నరేందర్, దార్ల రామచంద్ర, నేరెళ్ళ శ్రీనివాస్‌గౌడ్, నల్లాల లక్ష్మీరాజం, జాజుల గౌరి, వడ్నాల సూర్య, నాగమ్మ పూలే దాకా పలువురు ఈ విషయాన్ని అనేక సందర్భాల్లో పేర్కొన్నారు.

**బి.ఎస్.రాములు గారి సంపాదకత్వంలో వెలువడిన పుస్తకాలు-పత్రికలు[44]**

| | | |
|---|---|---|
| 1. | దళిత భారతి కవితా సంపుటి-ఆకుల గంగాధర్ | 1993 |
| 2. | ప్రభాతం నాటిక - కె.సీతారాములు | 1993 |
| 3. | కరీంనగర్ జిల్లా దళిత పాటలు | 1993 |
| 4. | హాస్టల్ కథలు - కె.సీతారాములు, | 1995 |
| 5. | గబ్బిలం మాసపత్రిక | 1995 |
| 6. | ప్రవహించే పాట - ఆంధ్రప్రదేశ్ దళిత పాటలు | 1996 |
| 7. | కె.రామలక్ష్మణ్ దళిత పాటలు | 1997 |
| 8. | ఆధునిక కథా సరిత్సాగరం, కరీంనగర్ జిల్లా కథలు | 1997 |
| 9. | జన్మభూమి - కె.సీతారాములు, నాటికలు, పాటలు | 1998 |
| 10. | కె.వి.నరేందర్ - అమ్మ కథల సంపుటి | 1998 |
| 11. | ముదిగంటి సుజాతారెడ్డి - విసుర్రాయి కథల సంపుటి | 1998 |
| 12. | జనజాగృతి పాటలు - కె.రామలక్ష్మణ్ | 2000 |
| 13. | ప్రజాధ్వని పాటలు - ఎర్దండి భూమయ్య | 2001 |
| 14. | కన్నీటి గాథలు-కవితా సంపుటి - ఎర్రశ్రీ | 2001 |
| 15. | అనాగరిక గేయం-మునిమడుల రాజారావు | 2001 |
| 16. | అంకురం-కవితా సంపుటి - గోపగాని రవీందర్ | 2001 |
| 17. | "పద్మపీఠం సంపాదకీయాలు" - కొక్కుల భాస్కర్ | 2002 |
| 18. | ఆధునిక కథా సరిత్సాగరం, కరీంనగర్ జిల్లా కథలు 2వ సంపుటి | 2003 |
| 19. | పి.చంద్ - భూనిర్వాసితులు కథా సంపుటి | 2003 |
| 20. | మేలుకో రైతన్న - అట్ల ఆగరెడ్డి పాటలు | 2003 |
| 21. | తిరుగు ప్రయాణం - నల్లాల లక్ష్మీరాజం కథలు | 2004 |
| 22. | భారతీయ సాహిత్యం - తెలుగు కథలు | 2004 |
| 23. | పెద్దింటి అశోక్ కుమార్-వలస బతుకులు కథల సంపుటి | 2004 |
| 24. | విశాల సాహితీ - బీసీ, ఎస్సీల పాటలు | 2004 |
| 25. | విశాల సాహితి సామాజిక చైతన్య గీతాలు | 2004 |
| 26. | మన్నుబువ్వ - జాజుల గౌరి కథల సంపుటి | 2004 |
| 27. | సామాజిక అర్థశాస్త్రం - ఎస్.విద్యాసాగర్ | 2004 |
| 28. | వొడ్నాల సూర్య కవితలు | 2004 |
| 29. | దార్ల రామచంద్ర - కిర్రు చెప్పులు కథల సంపుటి | 2004 |
| 30. | అంబల్ల జనార్ధన్ కథలు | 2004 |
| 31. | నాగమ్మ పూలే - కులగీత దీర్ఘకవిత | 2004 |
| 32. | బతుకుతాడు నవల - నేరెళ్ళ శ్రీనివాస్ గౌడ్ | 2004 |
| 33. | ప్రేమాంజలి - సారంగ కవిత | 2004 |
| 34. | బి.సి.కులాల దృక్పథం-ఇ.వెంకటేశు | 2004 |
| 35. | బతుకుబాటలో కవితా సంపుటి - వి.శంకర్ | 2006 |
| 36 | గూడ అంజయ్య - దళిత కథలు | 2006 |
| 37. | దళిత దర్శనం-డా॥కత్తి పద్మారావు | 2008 |
| 38. | మహాత్మా జ్యోతిరావు పూలే-డా॥కత్తి పద్మారావు | 2008 |
| 39. | దనుంబోడు బౌద్ధ స్థూపం-అజ్మీర్ వీరభద్రయ్య | 2008 |
| 40. | జీవనవాహిని స్వీయచరిత్ర - వంగా నర్సయ్య | 2008 |

ఇంకా వందలాది వ్యాసాలు, దేశవ్యాప్తంగా ఎన్నో ఉపన్యాసాలు, 125పైగా పుస్తకాలకు పీఠికలు రాశారు. విశ్వవిద్యాలయాలలో పలు సెమినార్ పేపర్లు సమర్పించారు.

**బి.ఎస్.రాములు విశాల సాహితీ పురస్కారాలు[45]**

బి.ఎస్.రాములు గారి తల్లి మిట్టపెల్లి లక్ష్మీరాజు 15-1-1991న మరణించారు. ఆమె జ్ఞాపకార్థం ఏదైనా మంచిపని చేయాలని చనిపోతూ కోరింది. అలా తన తల్లి జ్ఞాపకార్థం ప్రారంభించిన విశాల సాహితి బి.ఎస్.రాములు కథా పురస్కారాలు ఇప్పటివరకు 27 మందికి అందచేసి సత్కరించారు.

## బి.ఎస్.రాములు విశాల సాహితి కథా పురస్కారాలు

| | రచయిత పేరు | కథల సంపుటి పేరు | సంవత్సరం |
|---|---|---|---|
| 1. | నవీన్ | జీవితకాల కృషికి | 1998 |
| 2. | భూపాల్ | 'అంబల్లబండ' కథల సంపుటి | 1998 |
| 3. | ఆడెపు లక్ష్మీపతి | నాలుగు దృశ్యాలు కథల సంపుటి | 1998 |
| 4. | కాలువ మల్లయ్య | 'మాకథలు' కథల సంపుటి | 1999 |
| 5. | ముదిగంటి సుజాతారెడ్డి | 'విసుర్రాయి' కథల సంపుటి | 1999 |
| 6. | శాంతి నారాయణ | 'పల్లేరు ముళ్ళు' కథల సంపుటి | 1999 |
| 7. | కె.వి.నరేందర్ | అమ్మ, యుద్ధం, బురదలో జాబిల్లి | 1999 |
| 8. | ఓల్గా | ప్రయోగం, రాజకీయ కథలు | 2000 |
| 9. | ఎండ్లూరి సుధాకర్ | మల్లెమొగ్గల గొడుగు కథలు | 2000 |
| 10. | ఎ.అప్పలనాయుడు | ప్రత్యామ్నాయం కథలు | 2000 |
| 11. | వి.చంద్రశేఖర్‌రావు | లెనిన్ ప్లేస్ కథలు | 2000 |
| 12. | నాగప్పగారి సుందరరాజు | మాదిగోడు, మావూరి మైసమ్మ | 2000 |
| 13. | గంటేడ గౌరనాయుడు | ఏటిపాట కథలు | 2000 |
| 14. | బోయ జంగయ్య | బోజ కథలు | 2001 |
| 15. | అంబల్ల జనార్ధన్ | బొంబాయి కథలు | 2001 |
| 16. | కుప్పిలి పద్మ | ముక్తి కథలు | 2001 |
| 17. | సింగమనేని నారాయణ | సింగమనేని కథలు | 2001 |
| 18. | పి.చంద్ | భూనిర్వాసితులు, శేషగిరినవల | 2001 |
| 19. | పెద్దింటి అశోక్ కుమార్ | వలస బతుకులు, ఎడారి మంటలు | 2001 |
| 20. | డా॥ కొలకలూరి ఇనాక్ | అస్పృశ్యగంగ (కథల సంపుటి) | 2002 |
| 21. | నంబూరి పరిపూర్ణ | ఉంటాయి మాకుషస్సులు | 2002 |
| 22. | పులుగు శ్రీనివాస్ | సంకర విత్తులు (కథల సంపుటి) | 2002 |
| 23. | కె.వరలక్ష్మి | మట్టి–బంగారం (కథల సంపుటి) | 2003 |
| 24. | నల్లాల లక్ష్మీరాజం | తిరుగు ప్రయాణం | 2003 |
| 25. | బెజ్జారపు వినోద్ కుమార్ | గవ్వలమూట (కథలసంపుటి) | 2003 |
| 26. | దాశరథి రంగాచార్య | జీవనయానం (స్వీయచరిత్ర) | 2002 |
| 27. | కీ.శే. బిట్ల నారాయణ | నా అంతరంగ తరంగాలు | 2003 |



## బి.ఎస్.రాములు అందుకున్న పురస్కారాలు

బి.యస్. రాములు సామాజిక తత్త్వవేత్తగా, కథా రచయితగా, నవలా రచయితగా ప్రముఖ సాహితీ సంస్థల నుండి వివిధ పురస్కారాలు అందుకున్నారు. (46)

1. కొడవటిగంటి కుటుంబరావు స్మారక విప్లవ కథకు ఇచ్చే పురస్కారం – ఆదివాసుల జీవితాన్ని – పోరాటాన్ని చిత్రించిన "అడవిలో వెన్నెల" కథకు 1984 అక్టోబరు 28న తెనాలిలో కాళీపట్నం రామారావు, రావిశాస్త్రి, కొడవటిగంటి వరూధినిల నేతృత్వంలో పురస్కారం అందజేశారు.
2. ప్రతియేటా ఇచ్చే డా॥దాశరథి రంగాచార్య పురస్కారం బీడీ కార్మికుల జీవితాలను చిత్రించిన 'బతుకుపోరు' నవలకు 1992లో ఇచ్చారు.
3. మాజీ మంత్రి, స్వాతంత్ర్య సమరయోధుడు, బీ.సీ. ఉద్యమకారుడు, కొండా లక్ష్మణ్ బాపూజీ ఫౌండేషన్ పురస్కారం 1992లో బి.యస్.రాములు చేసిన 'సాహిత్య విశిష్ట కృషికి'గాను అందజేశారు.
4. వరంగల్ జిల్లా 'పాలకుర్తి సోమన కళాపీఠం' వారు "పాల్కురికి సోమన" పురస్కారంతో సత్కరించారు.
5. ప్రముఖ హేతువాది త్రిపురనేని రామస్వామి చౌదరి పేరిట గల తెలుగు విశ్వవిద్యాలయం ధర్మనిధి పురస్కారం యిచ్చి బి.యస్.రాములును 'హేతువాది'గా 1995లో సన్మానించారు.
6. ప్రతియేటా తెలుగు విశ్వవిద్యాలయం ఉత్తమ కథా సంపుటికి అందజేసే పురస్కారం 2002లో బి.యస్.రాములు 'మమతలు మానవ సంబంధాలు' కథ సంపుటికి అందజేశారు.
7. షోలాపూర్ – సిరిసిల్ల పద్మపీఠం వారు బి.యస్.రాములును "పద్మాంజలి అవార్డు"తో సత్కరించారు. ఇవే కాక మరెన్నో పురస్కారాలు అందుకున్నారు.
8. దళిత సాహిత్య అకాడమీ, ఢిల్లీ వారు మహాత్మా జ్యోతిరావ్ పూలే ఫెలోషిప్‌తో 2001లో గౌరవించారు.
9. హర్యానాలోని పానిపట్‌లో ప్రేమ్‌చంద్ సమకాలీకులు జయప్రకాశ్ నారాయణ్ సహచరుడైన బిహార్ కథకుడు రామవృక్ష బేనిపురి శతజయంతి పురస్కారాన్ని 2003లో అందుకున్నారు.
10. తెలంగాణ తల్లి రూపకల్పన చేసిన సందర్భంగా తెలంగాణ సంబురాల్లో 2007 మార్చిలో కె.సి.ఆర్.చే బంగారు గండెపెండేరం సత్కారం.

11. ఆంధ్ర సారస్వత పరిషత్ వారిచే డా. సి.నా.రె చేతుల మీదుగా 'యశోదారెడ్డి ధర్మనిధి పురస్కారం' బంగారు కంకణం పురస్కారం. 2008 నవంబర్.

కీ॥శే॥ కె.రామ్మోహన్‌రాజు బి.ఎస్.రాములు జీవించిన కాలం అతనిని మలచిన తీరును గురించి ఇలా అంటారు. "కాళిదాసు రచనలకు మల్లినాథ సూరి వ్యాఖ్యానం రాసే దాకా కాళిదాసు చాలా మందికి అర్థం కాలేదంటారు. కానీ బి.ఎస్.రాములు ఏకకాలంలో కాళిదాసు, మల్లినాథ సూరి అయి కూర్చున్నాడు. ఈ కాలపు సాహిత్యావసరం అది."(47)

తెలంగాణ తొలితరం కథకులు గూడూరి సీతారాం గారు బి.ఎస్.రాములు గారి సాహిత్య, సామాజిక కృషి గురించి ఇలా పేర్కొన్నారు. "బి.ఎస్.రాములుగారి కథలు భారతీయ సాహిత్య చరిత్రలో ఠాగూర్, ప్రేమ్‌చంద్ కథల్లా నిత్యనూతనంగా నిలిచిపోతాయి. 1982లోనే వీరిని గోర్కి, లూసన్ అని ప్రశంసించారు. తాత్త్విక వ్యాసాలు, గ్రంథాలు వీరిని పోతులూరి వీరబ్రహ్మం, వేమన, హెగెల్, ఆచార్య నాగార్జున సరసన నిలబెట్టారు. ప్రపంచంలోని సామాజిక తత్వశాస్త్రాల్ని జీవశక్తిగా మార్చుకొని సమకాలీన సామాజిక తత్వశాస్త్రాల్ని రూపొందిస్తున్నారు. అరిస్టాటిల్, ఆనందవర్దనునివలె సాహిత్య, అలంకార శాస్త్రాలు కూడా రాశారు. తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమాన్ని నడపడంలో తనవంతు చేర్పును అందించారు."

దళిత దార్శనికులు, ప్రముఖ కవి కత్తి పద్మారావు గారు బి.ఎస్.రాములుగారి కృషి గురించి ఇలా పేర్కొన్నారు. "బి.ఎస్.గారిలో హెగెల్‌లో ఉన్న తాత్త్విక విశ్లేషణల పరిపక్వత ఉంది. మార్క్స్ స్వతంత్ర సిద్ధాంతాలు ప్రతిపాదించినా హెగెల్ లేకుండా మార్క్స్ లేడు. ప్రపంచ తత్వశాస్త్రంలో హెగెల్‌కి ప్రత్యేక పీఠం వున్నట్లే భారతీయ తత్వశాస్త్రంలో బి.ఎస్.ది గొప్ప పీఠం. ఈ రెండు దశాబ్దాలలో తెలుగునేలలోని తాత్త్విక పరిణామాలు ఆయన లేకుండా ఊహించలేం. బహుజనుల్లో పోతులూరి వీరబ్రహ్మం తరువాత నూతన అన్వయాలు చేసింది బి.ఎస్.రాములుగారే. బౌద్ధాన్ని అంబేద్కర్‌ని చదివాక ఆయన ప్రయాణం ప్రేమ సముద్రంలో సాగింది. ఔన్నత్య వ్యక్తిత్వాల నుండి సమకాలిక సమన్వయాలను ఉపక్రమిస్తున్న తత్వశాస్త్ర అధ్యయన పరులలో బి.ఎస్.గారు మొదటి శ్రేణిలో నిలబడతారు. ఈయన రచనలు అంగ్లీకరించబడి జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో చర్చలోకి వెళితే ఒక ప్లేటోకి ఒక హెగెల్‌కి తగ్గవు అని మాత్రమే నేను చెప్పగలను. ఇక బి.ఎస్.గారి పని భారతీయ సామాజిక త్వాత్విక విశ్వవిద్యాయాన్ని ప్రారంభించడం. ఇక అందులో అందరమూ విద్యార్థులమే." (బహుజనతత్వం; పేజి నెం.245, 252)



కీ॥శే॥ డా॥ పి.వి.రమణ బి.ఎస్.రాములు గురించి ఇలా పేర్కొన్నారు "బి.ఎస్.రాములు ఒక చైతన్యం, ఒక ఉద్యమం, ఒక ప్రకాశం, ఒక ప్రభంజనం, బ్రతుకునే అధ్యయన యోగంగా మల్చుకున్న నిరంతరాన్వేషణ తపస్వి. వ్యక్తిత్వం రీత్యా రాములు సాత్వికుడు. ప్రవృత్తి రీత్యా తాత్వికుడు. ప్రధానంగా ఆయన మానవతావాది. బి.ఎస్.రాములు కథలు రాశారు. కథా శిల్పాన్ని గురించి చర్చించారు. మానవ సహజాత స్వభావాలపై కూలంకషంగా పరిశోధన చేశారు." (48)

బి.ఎస్.రాములు తన స్వీయ చరిత్ర గురించి చెప్పిన విషయాన్ని కె.పి.అశోక్ కుమార్ ఇలా పేర్కొన్నారు. "పోరాటం ఎక్కడో లేదు. బతుకులోనే పోరాటం ఉంది. మన బతుకే ఒక పోరాటం ఒక స్థాయి బతుకు బతకడమే ఒక పోరాటంగా సాధించుకోవాల్సిన జీవితాలు మనవి. ఇందువల్ల జీవిత యధార్థ చిత్రాలే సామాజిక నవల, కథ అవ్వచ్చు అని తల్లిసాలు పిల్లడు కథ నిరూపిస్తుంది. ఒక బీద కుటుంబంలోని తండ్రిపోయిన పిల్లలను పెంచి పెద్దచేసిన ఒక అమ్మకథ ఇది. తన తల్లి జ్ఞాపకాలు, దుఃఖమే తప్ప సుఖం లేని ఆమె జీవితాన్ని తలచుకునే ఓ తల్లిసాలు పిల్లాడి కథ ఇది. ఇందులోని తల్లి మాక్సింగోర్కి అమ్మ కంటే, మహాశ్వేతాదేవి ఒక తల్లి కంటే తక్కువేం కాదు."(49)

యువ సాహితీ వేత్త కర్రె సదాశివ్ ఇలా అంటారు. (50) "బి.ఎస్ రాములు పూర్తి పేరు బేతి శ్రీరాములు. ఆధునిక సామాజిక తత్వవేత్తగా ప్రఖ్యాత రచయితగా తన రచనల ద్వారా సుప్రసిద్ధులు. వీరి కథలు తెలంగాణ ప్రజల జీవన సరళిని, సామాజికాంశాలను, చరిత్రను నిక్షిప్తం చేస్తున్న కాలనాళికలు. వీరి కథలు, నవలలు వ్యాసాలు వందేళ్ళ సామాజిక జీవితాన్ని మనకు సాహిత్య రూపంలో అందిస్తున్నాయి. భారతీయ చారిత్రక భౌతికవాద సిద్ధాంత వేత్తగా పలు రచనలు చేశారు.

"బి.ఎస్.రాములుగారు ప్రస్తుతం దళితవాద, స్త్రీవాద, విప్లవవాద, బౌద్ధ, మానవీయ వాదాలను సమన్వయిస్తూ తాత్విక, సాంస్కృతిక రంగాల్లో కృషి చేస్తున్నారు. 1992 లో బీసీ, ఎస్సీ, ఎస్టీల వేదికగా ఏర్పడిన "ఆంధ్రప్రదేశ్ దళిత రచయితల కళాకారుల, మేధావుల ఐక్య వేదిక" వ్యవస్థాపక అధ్యక్షులు, ప్రస్తుతం దానికి గౌరవాధ్యక్షులు. దరకమే ఐక్యవేదిక అధ్యక్షులుగా, సామాజిక తత్వవేత్తగా రాష్ట్రమంతటా పర్యటించి సామాజిక, తాత్విక, సాహిత్య రంగాలలో బలమైన ప్రభావం వేశారు. ఆయా రంగాలను మలుపు తిప్పారు. 1992 కన్నా ముందు 1992 తరువాత తెలుగు సమాజం సాహిత్య, తాత్విక సిద్ధాంతాలు, భావజాలాలు, ఉద్యమాలు వేరు. ఈ స్పష్టమైన విభజన రేఖ ఏర్పడ్డానికి బి.ఎస్.రాములు, దరకమే ఐక్యవేదిక చేసిన కృషి ప్రధాన కారణం. అందుకే బి.ఎస్.రాములు గారిని యుగ వైతాళికుడు"(51) అని ప్రశంసించారు.

బి.ఎస్.రాములు గారు తెలుగు ప్రాచీన సాహిత్యాన్ని మదించిన సాహితీవేత్త, ప్రాచ్య, ప్రాశ్చాత్య, అలంకార శాస్త్రాలను కాచివడపోసిన అలంకారికులు. తెలుగు కథా సాహిత్యానికి 'కథల బడి - కథా సాహిత్య అలంకార శాస్త్రం' గ్రంథాన్ని అందించారు. తత్వశాస్త్రంలో గతితర్క, తత్వదర్శన భూమికను అందించారు. వీరి కథల్లో శైలి, శిల్పం వైవిధ్య భరితంగా పరిణామ శీలంగా కనబడుతుంది. ఏ కథకు ఏ శిల్పం ఏ శైలి నప్పుతుందో బాగా తెలిసిన కథా శిల్పి. బి.ఎస్.రాములు గారు కథకులకు కథకుడు అని ప్రసిద్ధి పొందారు.

బి.ఎస్. రాములుగారి వ్యక్తిత్వం, సాహిత్యం, సామాజిక ఆచరణ, త్యాగం బహుముఖీనమయినది. కొన్ని విషయాల్లో కొందరితో బి.ఎస్.రాములుగారిని తులనాత్మక అధ్యాయనంచేసి చెప్పవచ్చు. కాని బహుముఖీన వ్యక్తిత్వాన్ని, సాహిత్య కృషిని, సామాజిక ఆచరణను, త్యాగాన్ని సాహితీ, ఉద్యమ నిర్మాణం మొదలగు అన్నింటి విషయాల్లో పోల్చడానికి పోలిక దొరకడం అంత సులభం కాదు.

వీరి విషయంలో భారతదేశంలోని ప్రేంచంద్, రాహుల్ సాంకృత్యాయన్, వేమన, పోతులూరి వీరబ్రహ్మం, కబీర్, గురురవిదాసు వంటి మహాకవులు, రచయితలు గుర్తుకువస్తారు. అయితే ఆధునిక సాహిత్యంలో పూర్తి స్థాయిలో పోల్చడానికి వెతుక్కోవలసి వుంటుంది. ప్రేంచంద్ మహా రచయితగా కథలు, నవలలు రాయడంతోపాటు భారతీయ సాహిత్యంలో ప్రోగ్రెసివ్ రైటర్స్ - అసోసియేషన్ వ్యవస్థాపక అధ్యక్షుడిగా, హంస పత్రిక సంపాదకుడిగా ఎంతగానో కృషి చేశారు. బి.ఎస్.రాములుగారు కూడా రచనలు చేయడంతో పాటు అనేక మంది రచయితలను ఎదిగించారు. రచయితల సంఘాలను నిర్మించారు. ఆం.ప్ర. దళిత రచయితల, కళాకారుల, మేధావుల ఐక్యవేదిక వ్యవస్థాపక అధ్యక్షులుగా విశేషంగా కృషిచేశారు.

బి.ఎస్.రాములుగారు కాలంతోపాటు ఎదుగుతూ వచ్చిన మహా రచయిత. కథలు, నవలలు, సాహిత్య విమర్శతో పాటు, సాహిత్య అలంకార శాస్త్రాలను సృజించారు. భావితరాలకు నూతన మార్గ దర్శనం చేశారు. కథాశిక్షణ శిబిరాల ద్వారా వందలాది మంది యువ రచయితలను సాహితీవేత్తను తీర్చిదిద్దారు. గ్రామీణ ప్రాంతాలలో అట్టడుగు వర్గాల్లో, పేదల్లో వున్న సృజనాత్మకతను వెలికి తీసి కథకులుగా మార్చారు. సాహితీవేత్తగా వీరి కృషి అనితరసాధ్యమైనది.

బి.ఎస్.రాములుగారు సవ్యసాచి. సాహిత్యం, సామాజిక, సాంస్కృతిక రంగాలను దేన్నీ వదలలేదు. తనదైన ముద్ర వేసి దార్శనికునిగా, నాయకుడిగా మార్గదర్శనం చేశారు. ముందుకు నడిపించారు."[52]



## పాదసూచికలు

1. బి.ఎస్.రాములు కథలు-ఒకపరిశీలన, కర్రె సదాశివ్; పుట : 4
2. బి.ఎస్.రాములు కథలు-ఒకపరిశీలన, కర్రె సదాశివ్; పుట : 5, 6
3. బి.ఎస్.రాములు కథలు-ఒకపరిశీలన, కర్రె సదాశివ్; పుటలు : 7, 8
4. బహుజనతత్వం - బి.ఎస్.రాములు; పుటలు : 247, 252
5. సాహిత్య చరిత్రను కొత్త చూపుతో తిరగరాయాలి, పుట :149
6. ఆధునిక భారతీయ సామాజిక తత్వవేత్త బి.ఎస్.రాములు జన్మదిన స్వర్ణోత్సవ సంచిక; పుట : 3
7. ఈనాడు దినపత్రిక 28-1-2005 రాష్ట్రేతర ఎడిషన్
8. పేర్వారం జగన్నాథం, బి.ఎస్.రాములు కథలు-ఒకపరిశీలన - కర్రెసదాశివ్, పుట : 5
9. 50వ జన్మదిన స్వర్ణోత్సవ సంచిక - బి.ఎస్.రాములు; పుట : 70
10. బి.ఎస్.రాములు కథలు - ఒకపరిశీలన - కర్రె సదాశివ్ ; పుట : 21
11. చేనేతను ముంచుతున్న నూలు సమస్య-2004, డి.నర్సింహారెడ్డి, పి.సురేష్; పుట:7
12. అంబేద్కర్ రచనలు 12వ సంపుటి
13. 50వ జన్మదిన స్వర్ణోత్సవ సంచిక - బి.ఎస్.రాములు; పుట : 33
14. 50వ జన్మదిన స్వర్ణోత్సవ సంచిక - బి.ఎస్.రాములు; పుట : 35
15. బి.ఎస్.రాములు సంభాషణలు.
16. 50వ జన్మదిన స్వర్ణోత్సవ సంచిక - బి.ఎస్.రాములు; పుట : 71
17. 50వ జన్మదిన స్వర్ణోత్సవ సంచిక - బి.ఎస్.రాములు; పుట : 72
18. బి.ఎస్.రాములు సంభాషణలు.
19. 50వ జన్మదిన స్వర్ణోత్సవ సంచిక - బి.ఎస్.రాములు; పుట : 69
20. 50వ జన్మదిన స్వర్ణోత్సవ సంచిక - బి.ఎస్.రాములు.
21. 50వ జన్మదిన స్వర్ణోత్సవ సంచిక - బి.ఎస్.రాములు.
22. బి.ఎస్.రాములు సంభాషణలు.
23. 50వ జన్మదిన స్వర్ణోత్సవ సంచిక - బి.ఎస్.రాములు.

24 తెలంగాణ రాష్ట్ర ఉద్యమ చరిత్ర - బి.ఎస్.రాములు; పుట : 47
25 50వ జన్మదిన స్వర్ణోత్సవ సంచిక - బి.ఎస్.రాములు.
26 50వ జన్మదిన స్వర్ణోత్సవ సంచిక - బి.ఎస్.రాములు.
27 50వ జన్మదిన స్వర్ణోత్సవ సంచిక - బి.ఎస్.రాములు.
28 శతవసంతాల కరీంనగర్ - సి.శ్రీనివాసు; పుట: 47
29 బి.ఎస్.రాములు సంభాషణలు.
30 తేనెటీగలు కథల సంపుటి - బి.ఎస్.రాములు గారితో సంభాషణలు.
31 తేనెటీగలు కథల సంపుటి - బి.ఎస్.రాములు గారితో సంభాషణలు.
32 తేనెటీగలు కథల సంపుటి - బి.ఎస్.రాములు గారితో సంభాషణలు.
33 50వ జన్మదిన స్వర్ణోత్సవ సంచిక - బి.ఎస్.రాములు గారితో సంభాషణలు.
34 తేనెటీగలు కథల సంపుటి - బి.ఎస్.రాములు గారితో సంభాషణలు.
35 తేనెటీగలు కథల సంపుటి - బి.ఎస్.రాములు గారితో సంభాషణలు.
36 తేనెటీగలు కథల సంపుటి - బి.ఎస్.రాములు గారితో సంభాషణలు.
37 గూడూరు సీతారాం - బి.ఎస్.రాములు - తేనెటీగలు కథల సంపుటి - బి.ఎస్.రాములు గారితో సంభాషణలు.
38 శ్రీమతి శ్యామల గారితో సంభాషణలు.
39 బి.ఎస్.రాములు కథలు-ఒకపరిశీలన, కర్రె సదాశివ్; పుట: 136
40 బి.ఎస్.రాములు కథలు-ఒకపరిశీలన, కర్రె సదాశివ్; పుట:140
41 బి.ఎస్.రాములు కథలు-ఒకపరిశీలన, కర్రె సదాశివ్; పుట: 142
42 50వ జన్మదిన స్వర్ణోత్సవ సంచిక - బి.ఎస్.రాములు; పుట: 38
43 విశాల సాహితీ ప్రచురణల పట్టిక
44 విశాల సాహితీ ప్రచురణల పట్టిక
45 విశాల సాహితీ ప్రచురణల పట్టిక
46 బి.ఎస్.రాములు కథలు-ఒకపరిశీలన, కర్రె సదాశివ్; పుట: 33
47 50వ జన్మదిన సంచిక - బి.ఎస్.రాములు; 14-8-98; పుట: 77
48 50వ జన్మదిన సంచిక - బి.ఎస్.రాములు; పుట:105
49 50వ జన్మదిన సంచిక - బి.ఎస్.రాములు; పుట:119
50 బి.ఎస్.రాములు కథలు-ఒకపరిశీలన; పుట : 136.
51 ఆధునిక భారతీయ సామాజిక తత్వవేత్త బి.ఎస్.రాములు 50వ జన్మదిన స్వర్ణోత్సవ సంచిక-దార్ల రామచంద్ర
52. బి.ఎస్.రాములు కథలు-ఒకపరిశీలన; పుట : 137.



**మూడవ అధ్యాయం**

# బతుకుపోరు నవల - సామాజిక నేపథ్యం - చరిత్ర

## బీడీ పరిశ్రమ - కథా పరిచయం

### బతుకుపోరు నవల - బీడీ కార్మికుల సమస్య

బతుకుపోరు నవల బీడీ కార్మికుల సమస్యలను, వారి పోరాటాన్ని చిత్రించిన నవల. బీడీ పరిశ్రమకు చెందిన నవల. అందువల్ల బీడీ పరిశ్రమకు, సామాజిక నేపథ్యానికి చరిత్రకు సంబంధించిన అంశాలను తెలుసుకోవడం అవసరం.

"మన రాష్ట్రంలో ఫ్యాక్టరీల చట్టం క్రింద అత్యధిక సంఖ్యలో కార్మికులుగా స్త్రీలు పని చేస్తున్న ఏకైక అతి పెద్ద ప్రయివేటు పరిశ్రమ బీడీ పరిశ్రమ. ఇంకో మాటలో చెప్పాలంటే రాష్ట్రంలోని ప్రభుత్వ ఉద్యోగుల కన్న ఎక్కువ సంఖ్యలోఉపాధి కల్పిస్తున్న పరిశ్రమ బీడీ పరిశ్రమ.

నిజామాబాద్, కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాల్లో ఈ పరిశ్రమ నలభై ఏళ్ళ క్రితమే నెలకొల్పబడినా, గత ఇరవై ఏళ్ళ నుండి (ఇది 1983లో రాసిన మాట) వ్యవసాయ రంగంలో మిగిలిపోయిన స్త్రీ కార్మికులకూ, వంశపారంపర్యంగా వచ్చే చేతివృత్తులు లాభసాటిగా కాకుండా పోయిన కార్మికులకూ జీవనాధారంగా ఈ పరిశ్రమ దినదినాభివృద్ధి చెందుతోంది.

గత పదిహేనేళ్ళుగా బీడీ కార్మికులు తమ సమస్యల కోసం ఆర్థిక పోరాటాలు చేస్తున్నా యితర రంగాల్లోని కార్మికుల సమస్యల స్థాయిలో అందరి దృష్టిని తమ వైపు తిప్పుకుని వార్తా పత్రికల్లో చర్చనీయాంశం అవుతున్నది ఇటీవలి కాలం నించే. బహుశా స్త్రీ కార్మికులు కావడం వల్లనే యింతకాలం దాకా వార్తల్లో నిర్లక్ష్యం చేయబడ్డారేమో...? బీడీ పరిశ్రమలో దాదాపుగా నూటికి తొంభై మంది స్త్రీలే."[1]

ప్రస్తుతం రాష్ట్రంలో ఏడు లక్షలకు పైగా బీడీ కార్మికులు పని చేస్తున్నారు. అందులో 90శాతం స్త్రీలే. ఒక్క నిజామాబాద్ జిల్లాలోనే మూడు లక్షల మంది బీడీ కార్మికులున్నారు. కరీంనగర్ జిల్లాలో రెండు లక్షల మంది బీడీకార్మికులున్నారు. కొన్ని ప్రాంతాల్లో ప్రధాన జీవనాధారం బీడీలు చేయడమే. పంటలు పండని రోజుల్లో కూడా కుటుంబాలను ఆర్థికంగా నిలబెట్టింది బీడీ కార్మికులే. అలాగే కులవృత్తి దెబ్బతిన్న చేనేత రంగం నుండి వేలాది మంది బీడీ కార్మికులుగా ప్రవేశించారు. [2]

ఈ బీడీ, సిగరెట్, తేయాకు పరిశ్రమలకు యూరప్ వలస వ్యాపార విస్తరణకు సంబంధం వుంది. యూరప్ వ్యాపారస్థులు సముద్ర మార్గాన భారతదేశంలో ప్రవేశించాక అప్పటి మొగల్ సామ్రాజ్య చక్రవర్తి అయిన అక్బరును వ్యాపార అనుమతి కోరుతూ విన్నవించుకున్నారు. పొగాకు, తేయాకు ప్రత్యేకతలను అక్బరు పాదుషాకు వివరించారు. పొగాకును నమిలి చూసి, పొగపీల్చి వారు చెప్పింది బాగానే వుందని అనుమతి ఇచ్చారు. పొగాకు వ్యాపారం, పొగాకు పంట భారతదేశంలో విస్తరించింది. తేయాకు, కాఫీ అలాగే విస్తరించాయి. ఇప్పుడు ఇవి నిత్యజీవితంలో భాగం అయ్యాయి.

### కాళ్ళకు నీళ్ళిచ్చి బీడి యివ్వడం భారతీయ సంప్రదాయం

ఇంటికి వచ్చిన వారికి కాళ్ళకు నీళ్ళు ఇచ్చి కాళ్ళు కడుక్కొని కూర్చోగానే బీడీని మర్యాద పూర్వకంగా ఇచ్చేవారు. అలా బీడీ భారతీయ ప్రజల సంస్కృతిలో భాగం అయ్యింది. అంబలి స్థానాన్ని టీ ఆక్రమించింది. ఇప్పుడు ఇంటికి వచ్చిన వారికి టీ ఇవ్వడం కూడా భారతీయ ప్రజల సంస్కృతిలో, మర్యాదలో భాగమైంది.

### బీడి కన్నా ముందుది చుట్ట

బీడీ కన్నా ముందు పొగాకును మెత్తని నీళ్ళతో తడిపి చుట్టగా చుట్టి ఒక కొస అంటించి మరొక కొస నుంచి పొగ పీల్చేవారు. పొగాకును చుట్టడం వల్ల దానికి చుట్ట అని పేరు వచ్చింది. బీడీలు కూడా కత్తిరించిన తునికి ఆకులో మధ్యలో పొగాకు వేసి చుట్టుతుంటారు.

### మోదుగాకుతో చుట్ట - జకుముకి దూది

పొగాకును గ్రామీణ ప్రాంతాల్లో పచ్చి మోదుగు ఆకును పైపులా చుట్టి అందులో పొగాకు గుచ్చి దానిపై జకుముకు రాయితో అంటించిన దూదినిగానీ, నిప్పు కణికను గానీ పెట్టి పొగపీల్చేవారు. ఒకే చుట్టను బంధుమిత్రులు వరుసగా ఒకటి, రెండు దమ్ములు పీల్చేవారు. ఎంగిలి అంటకుండా రెండు చేతులను పిడికిలా పట్టుకొని



గుప్పిటి నుండి పొగపీల్చేవారు. కొందరు సిగరెట్టును కూడా ఇలా గుప్పెటపట్టి పీలుస్తుంటారు. చుట్టను కాగితంతో చుట్టితే 'సిగార్' అనేది 'సిగరెట్' అయ్యింది. 'పొగాకు'ను ఆకులో చుట్టితే 'బీడీ' అయ్యింది. కాగితంతో చుట్టే పరిశ్రమ విదేశీ పరిశ్రమ అయ్యింది. ఆకుతో చుట్టే పరిశ్రమ దేశీయ పరిశ్రమ అయ్యింది. బీడీ ఆకును చుట్టే తునికి ఆకు భారతదేశంలోనే దొరుకుతుంది. కనుక బీడీ ఆకు సేకరించడం గ్రామీణ అటవీ ప్రాంతాల్లో ఒక వృత్తిగా రూపుదిద్దుకుంది.

### యూరప్ దొరల చుట్టలు పెద్దవి

పూర్వం పొగాకు చుట్టలు ఐదు, ఆరు అంగుళాల పొడవు వుండి పది సిగరెట్లలో పట్టేంత పొగాకు కలిగి వుండేవి. అందువల్లనే "సిగార్" కన్నా చాలా చిన్నదని కాగితంతో చుట్టిన చుట్టను 'సిగరెట్' అని పిలిచారు.

### పొగాకును ఏ ఆకుతో చుట్టాలో ప్రయోగాలు

బీడీ పరిశ్రమ, బట్టల మిల్లు పరిశ్రమతో పాటు పుట్టి పెరిగింది. పొగాకును ఆకులో చుట్టుకొని పొగపీల్చడానికి ఏ ఆకులు బాగుంటాయో అని ప్రజలు రకరకాల ఆకులలో చుట్టుకొని ప్రయోగాలు చేశారు. చివరకు మోదుకు ఆకును చుట్టుకొని పొగాకు వేసుకొని తాగడం స్థిరపడింది. అది స్థానికంగా స్వయంగా ఆకులో చుట్టుకొని పొగాకు వేసుకొని తాగేవారు.

### బీడీలు చుట్టడంలోని నైపుణ్యాలు

బీడీ అనేది మొదట కుటీర పరిశ్రమలా ప్రారంభమయ్యింది. ఎవరి చుట్ట వాళ్లు చుట్టుకోవడానికి బొంబాయి, సూరత్, అహ్మదాబాద్ అనే నగరాల్లో ఆకులు దొరికేవి కావు. పల్లెల నుంచి ఆకులు తెచ్చుకొని ఆకుల అంచులు చక్కగా అందంగా కత్తిరించి చుట్టలుగా చుట్టి అమ్మేవారు. పొగాకు ఒకరి ఉత్పత్తి. బీడీ ఆకు మరొకరి ఉత్పత్తి, బీడీలను చుట్టలాగా చుట్టడం మరొక చోట జరిగింది. చుట్ట నుండి పొగాకు కారిపోకుండా పైన ఆకును నొక్కే వాళ్ళు. ఆకు విడిపోకుండా వుండటానికి దారాన్ని చుట్టడం జరిగింది. అడుగు నుండి పొగాకు కారిపోకుండా కొసను లోపలికి మలచడం జరిగింది. దానివల్ల పొగ పీల్చేటప్పుడు పొగాకు నోట్లోకి రాకుండా పొగ మాత్రమే వచ్చేట్లుగా సౌకర్యం ఏర్పడింది. ఇలా చుట్ట నుండి బీడీ అనే రూపం రూపొందింది.

ఇప్పుడు బీడీలు చెయ్యడం నైపుణ్యం గల కళ. ఆకులు కత్తిరించడం ఒక

నైపుణ్యం, ఎండిన ఆకును ఒక మోతాదులో నాన పెట్టడం ఒక నైపుణ్యం, ఆకు నార తీయడం ఒక నైపుణ్యం. పగిలిన భాగంను వదిలి బీడీకి పనికి వచ్చే విధంగా ఆకును సైజుకు కత్తిరించడం ఒక నైపుణ్యం. బీడికి ఒకటిన్నర చుట్లు ఆకు చుట్టడం, అందులో సమానంగా పొగాకును సుతిమెత్తగా సర్దడం ఒక నైపుణ్యం. ఒకటిన్నరచుట్ల బీడీ ఆకును పొగాకులో చుట్టిన తర్వాత పొగాకు రాలిపోకుండా మూతిని నొక్కడం ఒక ప్రత్యేక నైపుణ్యం. చివరి కొసను సన్నాయి పీకలాగా మలిచి లోపలికి నొక్కడం ఒక నైపుణ్యం. బీడీ విచ్చుకుపోకుండా దారం కట్టడం ఒక నైపుణ్యం. 20 లేదా 25 బీడీలను గుండ్రంగా పేర్చి కట్టలు కట్టడం వాటిని అందంగా తీర్చిదిద్దడం ఒక ప్రత్యేక నైపుణ్యం. ఇలాంటి కట్టలను చాటలో చక్కని వరుసలుగా పేర్చడం కూడా ఒక నైపుణ్యం. బీడీ ఆకు ఎక్కువగా నానితే మరకు అవుతుంది. ఎక్కువసేపు నానితే జిగట జిగటగా మారుతుంది. తక్కువ నానితే ఆకు పగిలిపోయి వృధా అవుతుంది. అందువల్ల బీడీ ఆకు సుతిమెత్తగా ఉంచుకోవడం ఒక ప్రత్యేక నైపుణ్యం. ఎక్కువ తడి ఉంటే లోపల ఉన్న పొగాకు కూడా బూజెక్కుతుంది. బీడీ కూడా నల్లబడుతుంది. ఇన్ని నైపుణ్యాల కలయిక బీడీ తయారు చేయడం.[3]

అందువల్ల బీడీల ఆకు కత్తిరించడం, బీడీలు చేయడం, కట్టలుగా కట్టడం వేగంగా బీడీలు చేయడం, శరీరం అదరకుండా చేతులు కదిలేటట్టుగా బీడీలు చేయడం మొదలైన ఈ నైపుణ్యాలను పూర్తి స్థాయిలో అలవరచుకోవడానికి కనీసం ఆరు నెలలు పడుతుంది. ఈ ఆరు నెలల పాటు నేర్చుకుంటూ చేసిన బీడీలు, తద్వారా నష్టపోయిన ఆకు, వాటికి వచ్చేకూలీ కూడా నేర్పిన వారికే చెందుతుంది. సొంతంగా బీడీలు చేయటం వస్తే బీడీలు నేర్పిన కార్మికురాలు తమ శిష్యురాలికి ప్రత్యేకంగా ఫారం పెట్టిస్తుంది. ఇంకా ఆమెకు బీడీలు చేయడం సరిగ్గా రాదు అని బీడీ కంపెనీ యజమాని భావిస్తే బీడీ కార్మికురాలు తన బీడీల్లో కలిపి లెక్క అప్పగిస్తుంది. ఆమె అన్నిటికి బాధ్యత వహిస్తుంది. శిష్యురాలు చేసిన బీడీల లెక్కను విడిగా యింట్లో రాసిపెట్టుకుంటుంది. వాటి డబ్బులు ఆమెకే ఇచ్చివేస్తుంది. ఇలా కొంతకాలం సాగాక స్వతంత్ర కార్మికురాలిగా బీడీ కంపెనీ యజమాని ఆమెకు సొంతంగా ఎకౌంటు తెరచి ఆకు, పొగాకు, దారం కూడా ఇస్తారు. అప్పుడు ఆమె బీడీ కార్మికురాలు అయినట్టు లెక్క.

## బీడీ పరిశ్రమ ప్రస్థానం

ఇలా 1956 నుండి బి.ఎస్.రాములు గారి తల్లి మిట్టపెల్లి లక్ష్మిరాజు ఎందరికో బీడీలు చేయడం నేర్పింది. ఆమె వద్ద ఎప్పుడు ఒకరిద్దరు ఆడపిల్లలు బీడీలు



నేర్చుకుంటూ వుండేవారు. తాను కూడా బొంబాయిలో (1945-50 మధ్య) బీడీలు చుట్టడాన్ని ఇలానే నేర్చుకుంది. [4]

మొదట బీడీలు చేసే పరిశ్రమ మగవారి పరిశ్రమగా ఉండేది. బొంబాయి, అహ్మదాబాదు, సూరత్ బట్టల మిల్లుల్లో కార్మికులుగా పని చేద్దాం అనుకునే అందరికీ పని దొరికేది కాదు. ఎవరైనా శెలవు పెడితే శెలవు రోజుల్లో కార్మికుడిగా పని చేసేవారు. వీరిని బదిలీ కార్మికులు అని పిలిచే వారు. కొందరికి పొద్దస్తమానం నిలబడి బట్టల మిల్లులో పని చేయడం, బట్టల మిల్లు చప్పుడు పడేది కాదు. నూలు, దుమ్ము, ధూళితో అనారోగ్యం పాలయ్యేవారు. వారు ఇతర వృత్తులను ఆశ్రయించే వారు. అలా ఆశ్రయించిన వృత్తుల్లో బీడీలు చుట్టడం ఒకటి. [5]

బీడీలు చుట్టే కూలీ కూడా బట్టల మిల్లుల్లో పని చేస్తే వచ్చే కూలీలో సమానంగా ఉండాలని భావించే వారు. కాస్త తక్కువ అయినప్పుడు బట్టల మిల్లు కార్మికులతో పోల్చి డిమాండ్ చేస్తుండే వారు. మరొకవైపు బట్టల మిల్లు కార్మికుల కుటుంబాలలోనే స్త్రీలు బీడీలు చుట్టడం నేర్చుకున్నారు. భార్యాభర్తలు కలిసి బీడీలు తయారు చేసేవారు. ఇలా బీడీ పరిశ్రమ బొంబాయి, సూరత్, అహ్మదాబాద్ నగరాల్లో ఒక కుటీర పరిశ్రమగా రూపుదిద్దుకుంది. మగ కార్మికులు సమ్మెలు చేస్తూ, కూలీలు పెంచాలని, డిమాండ్ చేయడంతో బీడీ తయారీదారులు ఇతర ప్రాంతాల్లో బీడీలు తయారు చేయించడానికి విస్తరించారు. అలా బొంబాయి నుండి బీడీ పరిశ్రమ రైలు రూట్‌లో నిజామాబాద్ కేంద్రంగా స్థిరపడింది.[6]

## నిజామాబాద్ కేంద్రంగా మారిన బీడీ పరిశ్రమ

నిజామాబాద్‌లో బీడీ పరిశ్రమ స్థిరపడే నాటికి బీడీ పరిశ్రమ యజమానులుగా మార్వాడి, గుజరాతి సేట్లు బీడీ పరిశ్రమ యజమానులుగా మారారు.

## బీడీ ఆకు సేకరణ - ప్రజలు

బీడీలకు కావలసిన తునికి ఆకును బీడీ కంపెనీల యజమానులు సేకరించుటకు కష్టమయ్యేది. కొంత ఆదాయం కూడా వస్తుందని ప్రభుత్వం అటవీశాఖ ద్వారా తునికి ఆకు సేకరణను కాంట్రాక్టర్లకు అప్పగించింది. తునికి ఆకు సేకరించడానికి డిసెంబర్‌లో టెండర్లు పిలుస్తారు. అటవీ గ్రామాల్లో ఫిబ్రవరిలో ప్రూనింగ్ చేస్తారు. అనగా చిన్న తునికి చెట్లను ఒక అంగుళం కొమ్మ వుంచి కొసేస్తారు. ఆ చెట్లు 45 రోజులకు కొత్త ఆకులను చిగురిస్తాయి. అవే బీడీ

ఆకుగా ఉపయోగపడే ఆకులు. తమలపాకుల్లాగా బీడీ ఆకును మార్చి, ఏప్రిల్ నెలలో సున్నితంగా తెంపాలి. ఆకు తెంపడం మొత్తం 20 రోజుల్లో పూర్తయిపోతుంది. ముఖ్యంగా గోండులు, లంబాడీలు కుటుంబం మొత్తం ఈ ఆకు తెంపడానికి బయలుదేరతారు. వాళ్ళకు ఏడాదంతా కలిసి నగదు పైకాన్ని చూసేది కేవలం ఈ తునికాకు సీజన్‌లోనే. 50 ఆకులను ఒక కట్టగా ఆంధ్రప్రదేశ్‌లో కడతారు. మహారాష్ట్రంలో 70 ఆకులు కడతారు. రాజస్తాన్‌లో పాల్‌పూడ 40 ఆకులతో కడతారు. మధ్యప్రదేశ్, ఛత్తీస్‌ఘడ్ రాష్ట్రాల్లో 50 ఆకులతో కడతారు. కట్టలను నారతో కడతారు. ఈ పని కోసం పల్లె ప్రజలు, ఆదివాసులు, గోండులు, లంబాడీలు ఉదయం 4 గంటలకే లేచి 11 గంటల దాకా అడవుల వెంట ఆకు తెంపి ఇంటికి తీసుకువెళతారు. ఆడవాళ్ళు వంటలు చేస్తుంటే పిల్లలు ఆకులను కట్టలుగా పేరుస్తుంటారు. సాయంత్రం 5 గంటలకు కట్టలను కళ్ళం మీద ఇచ్చివస్తారు. ఇచ్చిన కట్టల్లో కొన్ని చిన్నగా వున్నాయని లెక్కలో రాయకుండా తీసుకుంటారు. ఉదయాన్నే వారిని ముల్లు, పాములు, తేళ్ళు, ఎలుగుబంట్లు బాధించేవి.(1) ఆకు తేళ్ళు కూడా కుట్టేవి.

ఇలా తునికి ఆకు తెంపడం అనేది ప్రాణగండం చర్యలాగా ఉండేది. నడుముకు పాతచీర కట్టుకొని ఆకును అందులో వేసుకొనే వారు. దానిని గంపలో నింపి ఇంటికి తెచ్చేవారు. ఆకులను లెక్కించి నారతో కట్టుకట్టుతారు. కట్టిన కట్టలను తునికి ఆకు కాంట్రాక్టరు చూపించిన సూపర్‌వైజర్‌లకు ఇచ్చి లెక్క రాయించుకొనే వారు. లెక్కలో ప్రతి ఒక్కరి నుండి 2, 3 కట్టలు ఎక్కువ తీసుకొనే వారు. నిరుద్యోగులు, గ్రామీణ టీచర్లు తునికాకు కాంట్రాక్టర్ల దగ్గర ఆకు సేకరించే కల్లాలకు గుమాస్తాగా పని చేస్తుంటారు. సేకరించిన ఆకు కట్టలను తొడిమలు పైకి ఉండేటట్లుగా వరుసగా పేర్చి నీరెండకు ఆరనిస్తారు. ఆ తర్వాత సంచుల్లో ప్యాక్ చేసి లారీల్లోకి ఎక్కిస్తారు. పలుచగా వుండే జనప సంచులు గాలి ధారాళంగా ఆడే విధంగా వుంటాయి. దాన్ని 'బార్దాన్' అని పిలుస్తారు. సుమారు గజం పొడవు సంచులుగా అడుగు మందంతో కుడతారు. ఈ సంచుల లెక్కలు అటవీ అధికారులు చూసుకొని రాయల్టీ కింద కాంట్రాక్టర్ల నుండి ప్రభుత్వానికి, తమకు వసూలు చేస్తుంటారు.

## తునికి ఆకు తెంపించే కాంట్రాక్టర్లు

ఆకు తెంపి గాలికి ఆరనిచ్చి బ్యాగింగ్ పూర్తయ్యేసరికి 35 రోజులు పడుతుంది. ఆకు కళ్ళం, ఆకు సేకరణ 20 రోజులే సాగుతుంది. మిగతా 15 రోజులు ఆకు



కట్టలను ఆరనివ్వడం మొదలైన పనులకు అవసరమవుతాయి. బ్యాగులను లెక్కించుకొని ఫారెస్ట్ అధికారులు లెక్కరాస్తారు.(7)

కొందరు బీడీ తయారీదారులు తామే తునికి ఆకు కాంట్రాక్టర్లుగా బయలుదేరి వెళ్ళేవారు. తునికి ఆకు కొనుగోలు కోసం సుమారు 2 నెలలు దాకా బీడీ కార్మికులకు డబ్బులు ఇవ్వకుండా అటు మళ్ళించే వారు. మరికొందరు బీడీ తయారీదారులు తునికి ఆకు కాంట్రాక్టరు ద్వారానే క్వాలిటీని చూసి ధరను ఇచ్చి తీసుకునేవారు.

ఇలా తునికి ఆకు సేకరణలో ప్రభుత్వం, బీడీ ఆకు కాంట్రాక్టర్లు, బీడీ తయారీదారులు, తునికి ఆకును తెంపే అటవీ ప్రాంతాల ప్రజలు, అనే నాలుగు దశలలో బీడీ ఆకు సేకరణలో పాల్గొంటారు. బీడీ ఆకులను బీడీ తయారీదారులు గోదాములలో నిల్వవుంచుకోవాల్సి వుంటుంది. ఇది బీడీల కోసం తునికి ఆకు సేకరించే విధానం.

## బీడీలోని పొగాకు - పంట - పరిశ్రమ

బీడీలో ఉపయోగించే పొగాకును, పొగాకు వ్యవసాయ దారులు ఉత్పత్తి చేస్తారు. గుంటూరు, ప్రకాశం జిల్లాల్లో కూడా పొగాకు పండిస్తారు. పొగాకు గ్రేడింగ్ పరిశ్రమలో కూడా పేదస్త్రీలే కూలీలుగా పనిచేస్తుంటారు. ఆకుపచ్చని పొగాకు నలుపు రంగుకు మారేదాకా పొగాకును అనేక దశలలో తడిపొడి పద్ధతుల్లో తయారు చేస్తుంటారు. చుట్టలకు, బీడీలకు, సిగరెట్లకు వేరువేరు క్వాలిటీ పొగాకు, గ్రేడింగ్ చేస్తుంటారు. అలాగే కిళ్ళీల్లో వాడే జరదాలకు, ముక్కుకు వాడే నస్యం పొడికి పొగాకును ప్రత్యేకంగా గ్రేడింగ్‌లో ఎన్నిక చేస్తారు. బీడీలో వాడే పొగాకు సాధారణంగా బంగారు రంగులో సన్నని రెమ్మలుగా ఉండేదాన్ని ఎన్నిక చేస్తారు. బంగారు రంగు నుండి కాస్త మట్టి రంగు మారే పొగాకు కూడా బీడీలకు వాడుతుంటారు. పొగాకులో ఆయా బీడీ కంపెనీ తయారీదారులు తమదైన ప్రత్యేక మసాలా ద్రవ్యాలను కలిపి, ప్రత్యేక రుచివాసన వచ్చేట్లుగా పొగాకును తయారు చేస్తారు. తద్వారా ఏ బీడీ, ఏ తయారీయో తాగే వారికి తెలుస్తుంది.

## సైజు తగ్గిన బీడీ - పొడువు పెరిగిన సిగరెట్

పూర్వం తునికి ఆకు విరివిగా దొరుకుతున్నప్పుడు బీడీలు పెద్దవిగా 3 అంగుళాలు దాకా వుండేవి. బీడీ ఆకు రేటును చక్కెరకన్నా 3, 4 రెట్లు ఎక్కువ చేసింది ప్రభుత్వం. దానివల్ల బీడీలు వీలైనంత చిన్న సైజులోకి మారుతూ వచ్చాయి.

ఇప్పుడు రెండు ఇంచుల సైజుగా సన్నగా, చిన్నగా మారిపోయాయి. వెయ్యి బీడీలకు సుమారు 220 గ్రాముల పొగాకు వాడతారు. చేసేటప్పుడు గాలికి, తరుగుకు కొంతపోతుంది. చివరకు 5 బీడీలలో ఒక గ్రాము పొగాకు ఉంటుంది. ఒక్క సిగరెట్‌లో ఉండే పొగాకుతో 4, 5 బీడీలు తయారవుతాయి.

## కేంద్ర ప్రభుత్వ సారథ్యంలో పొగాకు

పొగాకు పరిశ్రమను కేంద్ర ప్రభుత్వం తన పరిధిలోకి తీసుకుంది. సెంట్రల్ ఎక్సైజ్‌లో భాగంగా పొగాకు, బీడీ పరిశ్రమ సాగుతుంది. బీడీ ఆకు పరిశ్రమ ఆయా రాష్ట్రాల అటవీ శాఖ ఆధ్వర్యంలో కొనసాగుతుంది. బీడీలు తయారు చేసే కూలీ పెంచాలని బీడీ కార్మికులు డిమాండ్ చేసే క్రమంలో బీడీల పరిశ్రమ స్త్రీ కార్మికుల పరిశ్రమగా విస్తరించింది. నగరాల నుండి పట్టణాలకు, లోతట్టు గ్రామాలకు పాకింది.

## స్త్రీల పరిశ్రమగా బీడీ పరిశ్రమ

వ్యవసాయ పనులలో ఉన్న వారు, పోగా మిగిలిన వ్యవసాయ కూలీలకు, ఇతర స్త్రీలకు బీడీ పరిశ్రమ ఒక ఆధారమైంది. నీడలో కూర్చొని బీడీలు చేయడం, కాస్త ఎండబారిన పడకుండా వుండవచ్చని బీడీ పరిశ్రమపై ఎక్కువమంది మొగ్గుచూపారు. చేనేత వృత్తి కోల్పోయిన కుటుంబాలకు బీడీ పరిశ్రమ ఒక ప్రత్యామ్నాయ ఉపాధిగా ఎదుగుతూ వచ్చింది. అలా నేడు నిజామాబాద్, కరీంనగర్, ఆదిలాబాద్, కర్నూలు జిల్లాల్లో లక్షలాది ప్రజల జీవితాల్లో వెలుగు దివ్వె అయ్యింది. జీవితానికి ఈ వృత్తి ఆశాకిరణం అయ్యింది. బీడీ పరిశ్రమ ఇలా విస్తరించి ఉపాధి చూపించకపోతే లక్షలాది ప్రజలు ఆకలితో అలమటించే వారు. ఆత్మహత్యలు చేసుకొని వుండేవారు. చేనేత వంటి చేతివృత్తుల కులాల వారి ఎదుగుదల పూర్తిగా పతనమై వుండేది. అలా ఒక చారిత్రక సన్నివేశంలో బీడీ పరిశ్రమ ప్రజల జీవితాల్లో వెలుగునిచ్చి ఒక మహోన్నతమైన పాత్ర నిర్వహించింది.

## బీడీ పరిశ్రమ లక్షలాది ప్రజల ఉపాధి[8]

ఆదిలాబాద్, కరీంనగర్, వరంగల్ జిల్లాల్లోని సింగరేణి బొగ్గు గనులలోని కార్మికుల కన్నా ముందు బీడీ పరిశ్రమే ప్రజలకు ఒక ఆదాయ వనరుగా ఉండేది. సింగరేణి లక్షా ఇరవై ఐదు వేల మందికి మాత్రమే ఉపాధి కల్పించింది. కానీ బీడీ పరిశ్రమలో ఆరులక్షల మందికి ఉపాధి లభించింది. ప్రభుత్వ ఉద్యోగాలతో సమానంగా ప్రజలకు ఉపాధి ఇస్తున్న పరిశ్రమ బీడీ పరిశ్రమ. అయినప్పటికీ ప్రభుత్వ ఉద్యోగులకు,



సింగరేణి కార్మికులకు ఇస్తున్న ప్రాధాన్యం, ప్రచారం బీడీ కార్మికులకు లేదు. కారణం బహుశా ఇది స్త్రీల పరిశ్రమ కావటమేనేమో.

## యాభయ్యేళ్ళుగా బీడీ పరిశ్రమ ఆసరాతో బతికిన బి.ఎస్. రాములు కుటుంబం మూడు తరాలు

ఏదేమైనప్పటికీ బీడీ పరిశ్రమ బి.ఎస్.రాములు వంటి తత్వవేత్తలకు, వనమాల చంద్రశేఖర్ వంటి కలెక్టరేట్ పరిపాలనాధికారులకు, చిరంజీవి వంటి డిఆర్‌డిఏ ప్రాజెక్టు డైరెక్టర్ వంటి ఉన్నతాధికారులకు, ఎందరో రచయితలకు, డాక్టర్లకు, టీచర్లకు, ఇంజనీర్లకు జన్మనిచ్చింది, కడుపు నింపింది.[9] బి.ఎస్.రాములు ప్రభుత్వ ఉద్యోగం వదిలి 1985-90ల్లో విప్లవ ఉద్యమంలోకి వెళ్ళిన తర్వాత వారి పిల్లలను పెంచి పోషించడానికి శ్యామల గారికి బీడీ పరిశ్రమే కడదాకా ఆధారంగా నిలిచింది. శ్యామల కూడా పదేళ్ళ వయస్సు నుండి బీడీ కార్మికురాలే. శ్యామల అత్తగారు కూడా చిన్నప్పటి నుంచి బీడీ కార్మికురాలే. బి.ఎస్.రాములు కూడా బీడీ కార్మికుడే. రచయిత తల్లి మిట్టపెల్లి లక్ష్మి రాజవ్వ బీడీ కార్మికురాలిగా నిరంతరం 30 ఏళ్ళు బీడీలు చుట్టి తాను బతుకుతూ పిల్లల్ని పెంచి పోషించింది. పిల్లలను చదివించింది. బి.ఎస్.రాములు పిల్లలకు కూడా బీడీ పరిశ్రమ ఆకలి తీర్చింది. ఇలా తల్లికొడుకు, కోడలు, మనవలు అందరూ సుమారు యాభైయేళ్ళు, మూడు తరాలు బీడీపరిశ్రమ ఆసరాతో ప్రాణం నిలుపుకున్నారు. ఆకలి తీర్చుకున్నారు. ఆత్మగౌరవం పెంచుకున్నారు. అందుకోగలిగే ఎత్తుకు ఎదిగారు. బి.ఎస్.రాములు రహస్య జీవితంలోకి వెళ్ళాక బీడీ పరిశ్రమ లేకుంటే తల్లి పిల్లలను చదివించేది కాదు. కష్టకాలంలో తల్లి బీడీలు చేసి ఒక డ్రస్సుతో, పాత చీరలే బెడ్‌షీట్లుగా, బతికి బట్టకట్టిన పిల్లలు ఇప్పుడు సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లయ్యారు. అమెరికాలో ఇద్దరు పిల్లలు సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లుగా పని చేస్తూ స్థిరపడుతున్నారు. మరో ఇద్దరు ఇండియాలో సాఫ్ట్‌వేర్ ఇంజినీర్లుగా పని చేస్తున్నారు. ఈ ఎదుగుదల వెనుక కన్నతల్లి మిట్టపెల్లి లక్ష్మీరాజు, శ్యామలగార్ల నిరంతర శ్రమ, కన్నతల్లి వంటి బీడి పరిశ్రమ ప్రధాన కారణం.

## బీడీ పరిశ్రమ ఒక కన్నతల్లి

ఇలా కన్నతల్లి వంటి బీడీ పరిశ్రమ ఆసరాతో లక్షలాది మంది విద్యావంతులు అయ్యారు. ఉద్యోగులు అయ్యారు. నాయకులు, లెక్చరర్‌లు, వ్యాపారవేత్తలు, డాక్టర్లు అయ్యారు. ఇలా బీడీ పరిశ్రమ ఉత్తర తెలంగాణ ప్రాంతంలో ప్రజల జీవితాల్లో దశాబ్దాల తరబడి అంతర్భాగం అయ్యింది. కార్లు ఉన్న వారు కూడా ఇప్పటికీ బీడీలు

చేయడం కొన్ని ప్రాంతాల్లో చూడవచ్చు. పనిపట్ల ఉండే గౌరవం, డిగ్నిటీ ఆఫ్ లేబర్‌కు ఇది ఒక గొప్ప ఉదాహరణ. డబ్బు ఉంది కదా అని, బీడీలు చేయటం చిన్న వృత్తి అని ప్రజలు ఈసడించుకోలేదు. ఎదిగిన తర్వాత కూడా అన్నం పెట్టిన కన్నతల్లిలా గౌరవించారు. అదే బీడీ కట్టలపై పుర్రెగుర్తు ముద్రించాలనే కేంద్ర ప్రభుత్వ నిర్ణయంపై లక్షలాది ప్రజలు ఉద్యమంగా ఎగిసిపడి విరుచుకు పడటానికి ప్రధాన కారణం. ఈ రోజు వారి చేతిలో ఓటు హక్కు ఉంది. వారి మేధస్సులో చైతన్యం ఉంది. ఈ రెండు ఉన్న ప్రజలు బీడీ పరిశ్రమను కాపాడుకోవడం కోసం ఉద్యమిస్తూనే ఉంటారు అని 2006 నవంబర్‌లో కరీంనగర్‌లో జరిగిన ఉపఎన్నికల సమయంలో ఉవ్వెత్తున ఎగసిన బీడీ కార్మికుల ఉద్యమం స్పష్టం చేస్తున్నది.

### యూరప్ వలసలు సామ్రాజ్యవాదం, భారతీయ పరిణామాలు[10]

బహుళజాతి కంపెనీలు ఇంకా మిగిలి వున్న కుటీర పరిశ్రమలను ధ్వంసం చేస్తూ తమ ఉత్పత్తులకు కొనుగోలుదారులను పెంచుకోవడానికి చేస్తున్న ప్రయత్నాలు, సమాజాన్ని విధ్వంసం చేస్తున్నాయి. చేనేత కుటీర పరిశ్రమను ధ్వంసం చేసి బట్టల మిల్లులు వచ్చాయి. చేనేత కార్మికులు వృత్తి కోల్పోయారు. స్వతంత్ర వృత్తులు వదిలి కన్నతల్లి, ఉన్న ఊరు వదిలి బట్టమిల్లు కార్మికులుగా వలసపోయే వారిగా మిగిలిపోయారు. రోగాలు కార్మికుల పాలు, లాభాలు యజమానుల పాలు అయ్యాయి.

తేయాకు తోటలు వ్యవసాయం నుంచీ, కుటీర పరిశ్రమ నుంచి మల్టీనేషన్ పరిశ్రమగా మారింది. మంచినీళ్ళను కూడా అమ్మే సంస్కృతి వేల కోట్ల రూపాయల పరిశ్రమగా ఎదిగింది. ఉప్పు కోసం గాంధీజీ చేసిన సత్యాగ్రహం లక్ష్యం పోయి, మల్టీనేషన్ కంపెనీల ఉప్పు విస్తరించింది. వడ్రంగి పని వృత్తి నుండి ప్లైవుడ్ విస్తరించి ఫర్నిచర్ రంగాలలో వడ్రంగులు, కార్మికులుగా మారిపోయారు.

పొగాకు సిగరెట్ పరిశ్రమలు బహుళజాతి కంపెనీల చిహ్నంగా మారిపోయాయి. వ్యవసాయంలో యంత్రాల ప్రవేశం, ఎరువుల వాడకం ద్వారా మల్టీనేషన్స్ ప్రారంభమయ్యాయి. గ్రామీణ వృత్తి కార్మికులు ఉపాధి కోల్పోయారు. కిరాణా షాపులు, జనరల్ స్టోర్స్ కిరాణా దుకాణాల స్థానంలో మల్టీనేషనల్ కంపెనీల సూపర్ మార్కెట్‌లను విస్తరింప చేశాయి. స్థానిక వ్యాపారులు ఉపాధి కోల్పోయారు. భవన నిర్మాణంలో భారీ పెట్టుబడిదారులు ప్రవేశించారు. నిపుణులు కార్మికులుగా మారారు. చెరువుల స్థానంలో భారీ ప్రాజెక్టులు ప్రవేశించి భారీ కాంట్రాక్టర్లను తయారు చేశాయి.



ఈ విధ్వంసం ఒక్కరోజులో ప్రారంభం కాలేదు. రెండువందల సంవత్సరాలుగా కొనసాగుతూనే వుంది.

### కుటీర పరిశ్రమలకు యంత్ర పరిశ్రమలకు తేడా[11]

యంత్ర ఉత్పత్తి యజమానులు మొదట చేతి నైపుణ్యం గల వృత్తిదార్లకు పని లేకుండా చేస్తారు. పనికి, మనిషికి, ఆనందానికి మధ్య గల సంబంధాన్ని తెంచేస్తారు. యంత్రాల్లో యంత్రంగా పని చేసే కార్మికుడిగా మార్చుతారు. ఇక అతని చేతివేళ్ళ నైపుణ్యానికి పారిశ్రామిక ఉత్పత్తిలో సంబంధం లేదు. అది సైంటిస్టులు, డిజైనర్లు మాత్రమే చూసుకొనేదిగా మారిపోతుంది. చేతి పరిశ్రమ బహుళ జాతి పరిశ్రమల మధ్య ఉత్పత్తి విధానంలోనూ, పంపిణీ విధానంలోనూ అనేక భిన్న అంశాలు వున్నాయి. అవి పొలిటికల్, ఎకనామికల్, సివిల్‌జేషన్ కల్చర్‌లలో వేటికవి ప్రత్యేకంగా కొనసాగుతాయి. కుటీర పరిశ్రమలకు, బహుళ జాతి పరిశ్రమలకు మధ్య వైరుధ్యం ఉంది.

### 'బతుకుపోరు' నాటి సామాజిక చారిత్రక పరిణామాల పరిశీలన

తెలంగాణ ఉద్యమ నవలలను పరిశీలించడానికి ఆనాటి సామాజిక, దేశ కాల పరిస్థితులను పరిశీలించాలని చెప్తూ డా॥వరవరరావు తన పరిశోధనలో ఇలా అంటారు. "ఈ నవలలన్నీ పోరాట కాలం నాటి తెలంగాణ సమాజాన్ని కథా వస్తువుగా తీసుకొని కథ నడిపినవే వీటిని పరిశీలించాలంటే మొదట మనం ఈ నవలలకు ఆనాటి దేశ, కాల పరిస్థితులతో వున్న సంబంధాన్ని విశ్లేషిస్తూ పరిశీలించాలి. ఎందుకంటే ప్రకృతిలో వలెనే సమాజంలోనూ ఏదీ విడిగా వుండదు. ఆనాటి పరిస్థితులను ఆర్థిక, సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలలో పరిశీలించాలి. వాటికి ఒకదానితో ఒకదాన్నికున్న సంబంధాన్ని పరిశీలించాలి."[12]

### ఉత్తర తెలంగాణ ఉద్యమాలు - నేపథ్యం

ఇలాగే బతుకుపోరు నవల కూడా సామాజిక పరిణామాల్లో సామాజిక, చారిత్రక ఉద్యమ నేపథ్యంలో వెలువడింది. ఈ నవల రచనా కాలం నాటి సామాజిక, చారిత్రక పరిణామాలను పరిశీలించడం అవసరం.

1964లో ప్రారంభమై 1967లో నక్సలైటు ఉద్యమంలో ప్రాచుర్యం పొందిన మార్క్సిస్టు, లెనినిస్టు, మావోలతో పని చేసే ఉద్యమాలు దేశ వ్యాప్తంగా పెల్లుబికాయి. నక్సలైటు ఉద్యమానికి నాయకుడైన చారుమజుందార్ 1975 నాటికి భారతదేశంలో

సాయుధ పోరాటం ద్వారా విప్లవ ప్రభుత్వం ఏర్పడుతుందని భావించాడు. బీహార్‌లో భీర్‌భూమ్, ఆంధ్రప్రదేశ్‌లో మొదలైన ప్రాంతాల్లో 1975 నాటికి భారతదేశం సాయుధ పోరాటంలో విముక్తమై విప్లవ ప్రభుత్వం ఏర్పడుతుందో భావించిన పోరాటాలు. 1969.70లో కొండపల్లి సీతారామయ్య, సత్యమూర్తివంటి నాయకులు, నక్సల్‌బరి శ్రీకాకుల పోరాటాల నుండి గుణపాఠాలు తీసుకున్నారు. 1975 నాటికి దేశంలో విప్లవ ప్రభుత్వం ఏర్పడదు అని, విప్లవ ప్రభుత్వం ఏర్పడటానికి దీర్ఘకాలిక సాయుధ పోరాటం అవసరమని భావించారు. కనుక విస్తృతంగా ప్రజాశ్రేణుల్లో చేరి ఉద్యమాలు నిర్వహించాలనీ, తద్వారా చైతన్యం పెంచాలని కార్యకర్తలను ఎదిగించాలని భావించారు. దాంతో దీర్ఘకాలికంగా ఉద్యమాలను నిర్వహించాలని ప్రజాసమస్యలను తీసుకొని ఉద్యమాలు చేస్తూ ప్రజాసంఘాలను ఏర్పరచాలని ఒక నిర్ణయానికి వచ్చారు. అది కొంతమేరకు ఆచరణలోకి రాకముందే ఎమర్జన్సీ విధించబడింది. పలువురు అరెస్టు అయ్యారు. ఎమర్జెన్సీ తర్వాత విద్యార్థుల ఆశలతో ప్రజల్లోకి చొచ్చుకుపోయే కార్యక్రమాలు తీసుకున్నారు.[13]

దీర్ఘకాలిక సాయుధ, గెరిల్లా పోరాటాలకు ప్రభుత్వ బలగాలు బలహీనంగా ఉండే గ్రామీణ లోతట్టు అటవీ ప్రాంతాన్ని వ్యూహాత్మకంగా ఉద్యమ ప్రాంతాలగా అభివృద్ధి చేయాలని భావించారు. తెలంగాణ సాయుధ పోరాటం జరిగిన ప్రాంతాల్లో ప్రజలు కదలడానికి వెనుకంజ వేశారు. కొత్త ప్రాంతాల్లో కార్యక్రమాలు ప్రారంభించారు. అలా కరీంనగర్, ఆదిలాబాదు, నిజామాబాదు జిల్లాల్లో, కొత్త ప్రాంతాల్లో ప్రజలను ఆ సమస్యలపై కదిలించారు.

### జగిత్యాల జైత్రయాత్రలో విస్తరించిన చైతన్యం

"జగిత్యాల జైత్రయాత్ర" పేరులో ఈ కదలిక సుప్రసిద్ధమైనది. కరీంనగర్, ఆదిలాబాద్ రైతాంగ పోరాటాలు అనే ప్రాచుర్యంలోకి వచ్చాయి. అదే క్రమంలో దండకారణ్యం గెరిల్లా జోన్ అనే విస్తృత ప్రాంత అవగాహన ముందుకు వచ్చింది. ఇలా 1977 నుండి ఉత్తర తెలంగాణ ప్రాంతంలో మొదలైన ప్రజల పోరాటాలు నక్సలైట్, మావోయిస్టు పోరాటాలుగా ప్రసిద్ధి చెందాయి. ఆ క్రమంలో ప్రజల్లోకి చొచ్చుకుపోయిన విప్లవ కార్యకర్తలు అనేక ప్రజాసమస్యలను పట్టించుకున్నారు. విప్లవ కార్యకర్త అడవిలోకి వెళ్తే అక్కడ అసంఘటితరంగ కార్మికులుగా పల్లెప్రజలు ఆదిమవాసులు బీడీ ఆకు తెంపే పనిలో ఉండేవారు. మైదాన ప్రాంతాల్లో చూస్తే బీడీలు చేసే వాళ్ళు ఉండేవారు. ఇలా తునికి ఆకు అడవికి, గ్రామానికి సంబంధం కలిపింది. తునికి ఆకు తెంపే కూలి పెరగాలని, అటవీ గ్రామాల పల్లె ప్రజలు



ఆదిమవాసులు ఉద్యమించారు. కాంట్రాక్టర్లను, వారి తలలు వంచి కూలీలు పెంచుకున్నారు. పార్టీ ఫండ్ కూడా సేకరించుకున్నారు. దీంతో ప్రభుత్వం కాంట్రాక్టు వ్యవస్థల స్థానంలో స్వయంగా తునికాకు సేకరించే పనిని తీసుకుంది. దానిని సేకరించిన తర్వాత అమ్మే పద్ధతిని ప్రవేశ పెట్టింది. ప్రజలకు కూలి పెరగకుండా, పార్టీకి కాంట్రాక్టర్లు ఫండు ఇవ్వకుండా ఉండే విధంగా ప్రభుత్వం తమ పాలసీలను మార్చుకుంది.

### గ్రామాలకు తరలిన విద్యార్థులు[14]

1977–84 కాలంలో ఉత్తర తెలంగాణలో భూముల ఆక్రమణ దున్నేవాడికే భూమి అనే నినాదం, విద్యార్థి యువజన పోరాటాలు, గ్రామాలకు తరలిరండి అని క్యాంపెయిన్, సారా వ్యతిరేక పోరాటాలు, బీడీ కార్మికుల పోరాటాలు, సింగరేణి కార్మికుల పోరాటాలు ఉధృతమయ్యాయి. ఈ పోరాటాలు విప్లవ పార్టీలకు లక్షలాది ప్రజల అభిమానాన్ని సంపాదించి పెట్టింది. ఇలా రైతాంగం నుండి అల్లం రాజయ్య, కొలిమంటుకుంది, ఊరు, అగ్నికణం మొదలైన నవలలు రాశారు. కాగా బీడీ కార్మికుల పోరాటాల గురించి, సారా పోరాటాల గురించి బి.ఎస్.రాములు నవలలు రాశారు. సింగరేణి ప్రాంతం నుంచి కథలు వచ్చాయి. 'బతుకుపోరు' నవల రచనా పద్ధతిలో సింగరేణి జీవితం గురించి 'నల్లవజ్రం' నవల వెలువడింది. అటవీ దళాల జీవితాల గురించి వసంతగీతం, సరిహద్దు మొదలగు నవలలు వెలువడ్డాయి. అడవీ, ఊరు నవలలు గిరిజన జీవితాల గురించి వెలువడ్డాయి. ఉద్యమంలో భాగంగా వెలువడిన నవలల్లో ఒక భిన్నమైన నవల 'బతుకుపోరు'. అందుకే దీన్ని ఉద్యమ నవలగా, ఉద్యమ నవలా చరిత్రలో తగు ప్రాధాన్యతతో చర్చించడం నిరాకరించారు.

### బతుకుపోరు నవల ఒక సామాజిక నవల[15]

ఈ నవలలో బి.ఎస్.రాములు ఇంకా అనేక విషయాలు చిత్రీకరించారు. వ్యక్తులు విప్లవకారులు అయినా కాకపోయినా వాళ్ళ మధ్య మానవ సంబంధాలు ఉంటాయి. ఈ నవల రాసేనాటికి మానవ సంబంధాల చిత్రణ విప్లవ సాహిత్యంలో రెండవ స్థానంలోనే ఉంది. ఆ కాలంలో రాములు ఈ సమాజ సంబంధాల చిత్రణనే ప్రధానంగా తీసుకొని వాటి ద్వారా ఉద్యమ పురోగతిని చిత్రించాడు. నిజానికి ఆచరణలో విప్లవకారుల క్రమం కూడా అదే. తోటి జనంతో మానవ సంబంధాలే లేకపోతే ఒక వ్యాపారి సైతం తన సరుకునే అమ్ముకోలేనప్పుడు విప్లవ ప్రయోజనాన్ని ఆశించేవాళ్ళు వాటిని నిర్లక్ష్యం చేయజాలరు. విప్లవ సాహిత్య కారులు అసలే నిర్లక్ష్యం చేయకూడదు.

ఈ నవలలో ఉన్న రెండో అంశం భాష. అప్పటికి విప్లవ కథా సాహిత్యంలో బండబూతులూ, మాండలికం అనే పేరున ఎన్నడో మరుగున పడ్డ పదాలు వీరవిహారం చేస్తున్నాయి. అలాంటి సమయంలో ఆ పద్ధతికి అలవాటుపడబోతున్న పాఠకుల ముందుకి ఆ లక్షణాలేవీ లేకుండా ఈ నవలను తీసుకురావడం సాహసం. కానీ మనిషి అస్తిత్వానికి సంబంధించిన ప్రాకృతిక సూత్రాలు అర్థం చేసుకుంటే అది సహజంగానే కనిపిస్తుంది. అందువల్లనే ఈ నవల ఏ విప్లవ వాసన లేకుండా జనంలోకి వెళ్ళగలిగింది. పరిగణనలోకి తీసుకోవలసిన ఇంకో అంశం ఏమిటంటే ఈ నవల తర్వాత విప్లవ సాహిత్యోద్యమంలో మరో 'సామాజిక నవల' రాకపోవడం కొంత విషాదమే.

## బతుకుపోరు నవల - సామాజిక నేపథ్యం - చరిత్ర

యంత్రాలతో ఉత్పత్తి వల్ల భారతదేశంలోని కులవృత్తులు, కుటీర పరిశ్రమలు దెబ్బతిన్నాయి. చేనేత వృత్తివారు బట్టల మిల్లుల్లో కార్మికులుగా పని చేయడానికి పొట్ట చేత పట్టుకొని వలసవెళ్ళారు. మహాత్మా జ్యోతిరావు పూలే, యమ్.ఎన్.లోఖాండే సత్యశోధక సమాజ ఉద్యమ నాయకత్వంలో 1860 సం॥లో బట్టలమిల్లు కార్మికులు పని, పరిశ్రమల మెరుగుదలకు పని గంటల భారం తగ్గించుకునేందకు సమ్మెచేశారు. ఇలా ఇంగ్లండు, ఫ్రాన్స్, జర్మనీ, అమెరికా దేశాల్లో కార్మికులతో ధీటుగా బొంబాయి బట్టల మిల్లు కార్మికులు చైతన్యంతో ముందుకు కదిలారు.[16]

బొంబాయి మహానగరంలో కుటుంబంతో సహా కలిసి జీవించే స్థాయికి జీతాలు, కూలీలు ఉండేవి కావు. చైతన్యయుత ఉద్యమాలు చేస్తూ కార్మికులు అనేక చట్టాలను, భద్రతను, సౌకర్యాలను సాధించుకున్నారు. నైజాం రాష్ట్రం నుండి మరాఠా రాష్ట్రానికి తన ప్రజలు వలస వెళ్ళడం వల్ల రాజ్యానికి అవమాన కరమని నిజాం రాజు భావించాడు. వరంగల్‌లో, హైదరాబాద్‌లో ప్రభుత్వం తరపున బట్టల మిల్లును నెలకొల్పారు. ఆదిలాబాద్ జిల్లా, సిర్పూర్‌లో బట్టల మిల్లును ఏర్పాటు చేయించారు. తద్వారా వేలాది మందికి ఉపాధి దొరికింది. వ్యవసాయం తర్వాత అతి ఎక్కువ మందికి ఉపాధి కల్పించిన చేనేత వృత్తి లక్షలాది మందికి పని కల్పించలేకపోయారు. అందువల్ల బొంబాయి, సూరత్ నగరాలకు వలసలు పోతూనే ఉండేవారు.[17]

కుటీర పరిశ్రమలు, చేతివృత్తులను, ఆధునీకరించాలని నిజాం రాజు అనేక సంస్కరణలు ప్రవేశ పెట్టాడు. చేతివృత్తి పనిముట్లను అభివృద్ధిపరిచే పరిశోధనలు కావించాడు. 1945లో పవర్‌లూమ్ మాదిరిగా చేనేత మగ్గాలకు రూపకల్పన చేయించాడు. దానిని "సట్టర్ మగ్గం" అని పిలిచేవారు. అంతకముందు చేతి మగ్గం



నాడెను చేతిలో అటుఇటు వేసేవారు. ఈ సట్టర్ మగ్గంలో విద్యుత్‌తో నడిచే మిల్లు మగ్గంలో లాగే పోగులుసగంపైకి, సగం కిందికి విచ్చుకున్న తర్వాత నాడెను చేతితో వేయడం కాకుండా, తాడుపిడితో అటుఇటు వేగంగా కదిలే విధంగా రూపొందించారు.

నిజాంకు రాజవైద్యుడుగా హకీం వనమాల నారాయణదాసు పని చేస్తూ వుండేవాడు. అతడు చేనేత వృత్తి చేసే పద్మశాలి కులానికి చెందినవాడు. అతని ద్వారా చేనేత ప్రజలు నిజాం రాజుకు, కష్టాలు విన్నవించుకోగా సబ్సిడీపై నూలు, రంగులు ఇచ్చే ఏర్పాటును చేశారు. చేనేత సహకార సంఘాలు ఏర్పాటయ్యాయి.

కులవృత్తులు గిట్టుబాటుగాక లక్షలాది కుటుంబాలు పేదరికంలోకి మారిపోయారు. అందువల్ల ఏ పనిలేక వ్యవసాయం పనిలో కూలీలుగా మారిపోయారు. తద్వారా వ్యవసాయంపై మునుపు ఎన్నడూ లేనంత ఒత్తిడి పెరిగింది. కూలీల రేట్లు పడిపోయాయి. భూస్వామ్య విధానంలో స్థానిక భూస్వాములైన బ్రాహ్మణ, రెడ్డి, వెలమ దొరలు, పటేళ్ళ దోపిడి దౌర్జన్యం, అణచివేత, వెట్టిచాకిరి ప్రజల జీవితాలను మరింత కుంగదీసింది.

## హైదరాబాద్ రాజ్యంలో గ్రంథాలయాలు

"క్రీ.శ. 1897లో మునగాల రాజానాయని వేంకట రంగారావు కొమర్రాజు వేంకట లక్ష్మణరావు, ఆదిపూడి సోమనాథరావులు రాబర్టు శావెల్ శ్రీకృష్ణదేవరాయల గురించి రచించిన విస్మృత సామ్రాజ్యం (Forgotten Empire) అనే గ్రంథాన్ని చదివిన తర్వాత శ్రీకృష్ణదేవరాయలు పేరున ఏదైనా సత్కార్యం తలపెట్టాలనే భావన వారిలో కలిగింది."[18]

1901లో హైదరాబాద్ నందలి కోఠిలో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం పేరుతో గ్రంథాలయాన్ని స్థాపించారు. 1902లో పైన పేర్కొన్న పెద్దలే రాజరాజనరేంద్ర గ్రంథాలయాన్ని హన్మకొండలో నెలకొల్పారు. ఈ గ్రంథాలయాల స్థాపన ఒక ఉద్యమంగా ఎదిగి 1927 నాటికి తెలంగాణలో దాదాపు 110 గ్రంథాలయాల స్థాపనకు దారితీసింది. 1921లో ఆంధ్రజనసంఘం స్థాపించబడింది. ఇదే 1930లో ఆంధ్ర మహాసభ అనే పేరు మార్చుకొని సుప్రసిద్ధమైనది. ఆంధ్రమహాసభను పల్లెల్లో సంఘం అని పిలిచేవారు."[19] మాడపాటిహనుమంతరావు, టేకుమాళ్ళ రంగారావు, మట్టా లక్ష్మీ నర్సయ్య, ఆదిరాజగిరి భద్రరావు, నడింపల్లి జానకి రామయ్య, బూర్గుల రామకృష్ణారావు, మందుముల నరసింహారావు, బోయినపల్లి వెంకట రామారావు, కొమ్మవరపు సుబ్బారావు, బూర్గుల నరసింహారావు, పండిట్ రామస్వామి తొలి సభ్యులుగా

ఈ సంస్థ స్థాపించబడింది. కార్యవర్గంలో మొదటి అధ్యక్షుడు ఆర్.రాజగోపాల రెడ్డి కార్యదర్శి మాడపాటి హనుమంతరావు, సహాయ కార్యదర్శి మందుముల నరసింహారావు. ఆంధ్ర మహాసభ అనేక సంఘ సంస్కరణలకు శ్రీకారం చుట్టింది. దాని ప్రేరణతో, స్ఫూర్తితో కె.వి.రంగారెడ్డి (నేటి రంగారెడ్డి జిల్లా వీరి పేరునే ఏర్పాటు చేశారు) హైదరాబాద్ శాసనసభలో 1936 నుండి 1938 సంవత్సరాల కాలంలో యీ క్రింది శాసనాలను ప్రవేశ పెట్టారు.

**ఆంధ్రమహాసభ-1936**

1. స్త్రీలకు వారసత్వ హక్కు
2. వర్ణాంతర వివాహం చేసుకుంటే వారి సంతానం సక్రమ సంతానం అని నిరూపన
3. బాల్య వివాహాలను నిరోధించుట
4. విధవ వివాహాలు సక్రమమైనవని ప్రకటించుట
5. అస్పృశ్యత నివారణ
6. జాగీర్లరద్దు, ఉద్యోగుల నియామకానికి పబ్లిక్ సర్వీసు స్థాపన
7. బావుల కింద చేసే వ్యవసాయానికి నీటిపన్ను తీసుకోరాదు.
8. జమాబంది మురాఫాల కొరకు నకళ్ళ ఉజరత్ తీసుకొనగూడదు
9. అప్పుల వసూళ్ళలో దౌర్జన్యం కూడదు [20]

**నిజాం రాజ్యం ఉనికి రద్దయిన తీరు** [21]

ఆంధ్రమహాసభ కొంతకాలానికి రెండు మహాసభలుగా చీలిపోయింది. కమ్యూనిస్టుల నాయకత్వంలో వుండే ఆంధ్రమహాసభ తెలంగాణ సాయుధ పోరాటాన్ని ప్రారంభించింది. నిజాం అండతో కాసిం రజ్వీ నాయకత్వంలో ముస్లిం రజాకార్లు కమ్యూనిస్టు ఉద్యమంపై తిరగబడి అనేక ఘోరకృత్యాలకు పాల్పడ్డారు. హైదరాబాదు రాష్ట్రంలోని స్టేట్ కాంగ్రెస్ పార్టీ ఇండియన్ యూనియన్‌ను జోక్యం చేసుకోవాలని విజ్ఞప్తి చేసింది. 13 సెప్టెంబర్ 1948న భారత సైన్యం ప్రవేశించి నైజాం రాజ్యాన్ని ఆక్రమించింది. 17 సెప్టెంబర్‌న నిజాం రాజు లొంగిపోయాడు. అలా 17 సెప్టెంబర్‌న నైజాం రాజ్యం స్వాతంత్ర్యం పొందింది. హైదరాబాద్ రాష్ట్రం ఏర్పడింది.

తన రాజ్యాన్ని దురాక్రమించిన భారత ప్రభుత్వంపై నిజాం రాజు ఐక్యరాజ్య సమితిలో ఫిర్యాదు చేశారు. దీనిపై ఐక్యరాజ్యసమితిలో 1970 దాకా చర్చ కొనసాగింది.



ఇదే సమయంలో ఫిర్యాదు చేసిన జమ్ముకాశ్మీరు సమస్య అంతర్జాతీయ సమస్యగా ఐక్యరాజ్య సమితిలో ఇప్పటికి చర్చించబడుతూ ఉన్నది.

17 సెప్టెంబరు 1948 నుండి 1956 నవంబరు 1 దాకా ఎనిమిదేళ్ళ పాటు హైదరాబాదు రాష్ట్రం ప్రత్యేక రాష్ట్రంగా కొనసాగింది. దానికి బూర్గుల రామకృష్ణారావు ముఖ్యమంత్రిగా వుండేవారు. 1953 డిసెంబర్ 1వ తేదీన కర్నూలు రాజధానిగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది. ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం ఉద్యోగులకు జీతాలు ఇవ్వలేక 33 కోట్ల లోటు బడ్జెట్‌తో పతన అవస్థకు చేరుకుంది. హైదరాబాద్ రాష్ట్రం సంపన్నమైనదని దానిలో కలిసిపోతే సమస్యలన్నీ పరిష్కారం అవుతాయని సమైక్య రాష్ట్రం కోసం ప్రయత్నాలు ప్రారంభించారు. అలా 1956 నవంబరు 1న ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడింది. ఆంధ్రరాష్ట్రం, నిజాం రాష్ట్రం రెండు రద్దుకావడాన్ని చాలామంది వ్యతిరేకించారు. కమ్యూనిస్టు నాయకులు సమైక్య రాష్ట్రానికి మద్దతుగా ప్రచారం చేశారు. బూర్గుల రామకృష్ణారావు రెడ్లమీద కోపంతో హైదరాబాద్ రాష్ట్రాన్ని రద్దు చేసి ఆంధ్రప్రదేశ్ ఏర్పడడానికి అంగీకరించాడు. ఈనిర్ణయం నీ మరణ శాసనం అని నెహ్రూ హెచ్చరించారు. అయినా అతడు వినలేదు.

**తెలంగాణ ప్రజల అసంతృప్తి** [22]

ఆంధ్ర, హైదరాబాద్ రాష్ట్రాల విలీనాన్ని వ్యతిరేకించిన వారు కొంతకాలం వేచి చూశారు. నాలుగు ఐదేళ్ళకే ఆంధ్రప్రాంత పెత్తనం అన్ని రంగాల్లో విస్తరించింది. తెలంగాణ ఉద్యోగాలను ఆంధ్రప్రాంతం వారు ఆక్రమించడం పెరిగింది. తెలుగుమీడియం చదువులు ప్రారంభమై తెలంగాణలో విద్యాభివృద్ధి జరిగి విద్యార్థులు యువకులుగా ఉద్యోగాల కోసం ఎదురుచూసే సరికి నిరుద్యోగం ఎదురైంది. 1959లో ఏర్పడ్డ జిల్లా పరిషత్‌లు గ్రామగ్రామాన స్కూళ్ళను ఏర్పాటు చేశాయి. 1959 నుండి 1964 వరకు గ్రామీణ ప్రాంతాలలో ఉపాధ్యాయ ఉద్యోగాలు లభించాయి. 1965 నుంచి తిరిగి నిరుద్యోగ సమస్య పెరగడం ప్రారంభించింది. మరొకవైపు ప్రభుత్వ అన్ని శాఖలలో సెక్రటేరియట్‌లో, డైరెక్టరేట్లల్లో నూటికి డెబ్బైశాతం ఆంధ్రప్రాంతీయులు నిండిపోయారు. వారు అనేక విధాలుగా తమ బంధుమిత్రులను అనేక రంగాలలో ఉద్యోగ ఉపాధి అవకాశాలు కల్పించి తెలంగాణలోకి వలసలను విస్తరించారు. నీటి ప్రాజెక్టులు ఉండే ప్రాంతాలేవో ముందేతెలుసుకొని ఆంధ్రప్రాంతం కమ్మలు, రెడ్లు మొదలైన అగ్రకులాలు తెలంగాణలోని ప్రాజెక్టుల కింద సాగుకాబోయే భూములను ఎక్కడికక్కడ తక్కువ రేట్లకు కొన్నారు. ఎకరా 50 రూ. నుండి 500 రూ.వరకు కొన్నారు. తెలంగాణ ప్రజలకు వారు ఎందుకు కొంటున్నారో అర్థం కాలేదు. ఆ

భూములకు నీటికాలువలు రాబోతున్నాయని కూడా తెలియదు. అలా నిజాం సాగర్, కడెం, నాగార్జున సాగర్, శ్రీరాంసాగర్ మొదలైన ప్రాజెక్టుల ఆయకట్టుల ప్రాంతాల్లో, ఆంధ్రప్రాంతాల కమ్మ, రెడ్డి కులాల వాళ్ళు వలసలు సాగించారు.

### తెలంగాణ భాష - సంస్కృతి నిరాదరణ(23)

మరొకవైపు స్థానిక ప్రజల భాషను, సంస్కృతిని కొంతమంది కించపరిచారు. హేళన చేశారు. మీకు భాష రాదన్నారు. మీకు భాష తెలీదు అన్నారు. లక్షలాది మంది ప్రజలు బి.ఎస్.రాములు లాగే 1967 నుండి 1975 దాకా తెలంగాణ ప్రాంతాల్లో నిరుద్యోగులుగా మిగిలిపోయారు. ఏదైనా ఉపాధి చేపట్టాలంటే పెట్టుబడి కావాలి. పెట్టుబడి లేనివారు కూలీలుగా మారిపోవలసి వచ్చింది. ఇలా సామాజిక, సాంస్కృతిక, ఆర్థిక, అణచివేత, దోపిడీ చూసి తెలంగాణ ప్రజల హృదయం ఆకలి కడుపులో రగిలిపోయింది. రాష్ట్రం ఏర్పడిన పన్నెండేళ్ళకే తిరిగి ప్రత్యేక రాష్ట్రం కావాలని ఉద్యమించారు. ముందే చెప్పినట్లుగా 1968-71 దాకా ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ఉధృతంగా సాగింది. ప్రజలలో చైతన్యాన్ని పెంచింది. దీనిలో రాజకీయ నాయకులు ప్రవేశించి తమకు అనుకూలంగా ఓట్లుగా మార్చుకొని ఎన్నికయ్యారు. 1971లో కాసు బ్రహ్మానందరెడ్డిని తొలగించి పి.వి.నరసింహారావుగారిని ముఖ్యమంత్రిగా కాంగ్రెస్ పార్టీ ఎన్నుకొంది. శ్రీకాకుళంలో జరిగిన నక్సలైటు ఉద్యమం ముందుకు తెచ్చిన భూమి పంపిణి ఎంతోకొంత పరిష్కరించాలని పి.వి.నరసింహారావు భూస్వామి అయినప్పటికి భూసంస్కరణలను ప్రవేశ పెట్టాడు. ఆంధ్రప్రాంత భూస్వాములు దీనిని వ్యతిరేకించారు. ఈ వ్యతిరేకతను "జైఆంధ్ర" ఉద్యమ రూపంలో ముందుకు తెచ్చారు. దాంతో ఆంధ్రప్రదేశ్‌లో రాష్ట్రపతి పరిపాలన విధించబడింది. గవర్నరు సలహాదారుగా వున్న హెచ్.సి. సరీన్ కాలంలో 1973లో ఐదు లక్షల ఉద్యోగాల కల్పన పథకం ముందుకు తెచ్చారు. అలా ఎంతోమందికి ఉద్యోగాలు దొరికాయి.

### ప్రత్యేక తెలంగాణ నుండి నక్సలైట్ ఉద్యమంలోకి(24)

కానీ 1968లో శ్రీకాకుళ ఉద్యమం, ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో పుట్టిన చైతన్యం ఆగిపోలేదు. వేలాది మంది యువకులు నక్సలైట్ ఉద్యమం పట్ల ఆకర్షితులయ్యారు. దున్నేవాడికే భూమి అంటూ భూస్వామ్య వ్యవస్థ రద్దుకు చేసిన నినాదాలు వారికి లక్ష్యాలు అయ్యాయి. ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో పనిచేసిన యువతరం,నక్సలైట్లు గ్రామీణ ఉద్యమ కార్యకర్తలుగా మలుపు తిరిగారు. అలా 1969 నుండి తెలంగాణ ప్రాంతంలో నక్సలైటు ఉద్యమం అంకురించింది. విద్యార్థి



సంఘాలను, గ్రామీణ రైతు కూలీలను ఆర్గనైజ్ చేశారు. 1970లో విప్లవ రచయితల సంఘం ఏర్పడింది. జలగం వెంగళరావు ముఖ్యమంత్రిగా వున్నప్పుడు 1975లో ఎమర్జన్సీలో నక్సలైట్ ఉద్యమంలో చాలామంది నిర్బంధించబడ్డారు. కొందరు చంపబడ్డారు. వెంగళరావు ముఖ్యమంత్రిగా ఉన్న కాలంలో వేలాదిమందిని చిత్రహింసల పాలు చేశారు. ఎమర్జెన్సీ ఎత్తేసిన తర్వాత కేంద్రంలో జనతాపార్టీ అధికారంలోకి వచ్చింది. 1978లో ఎన్నికల్లో మర్రి చెన్నారెడ్డి ముఖ్యమంత్రి అయ్యాడు. బి.ఎస్.రాములు అనుభవించిన తొమ్మిదేళ్ళ నిరుద్యోగం వంటి దుస్థితి, నిరాశ తెలంగాణ ప్రాంత విద్యార్థి యువజనుల్లో తీవ్ర అసంతృప్తికి, నూతన మార్గాల అధ్యయనానికి తెరతీసింది. బి.ఎస్.రాములు పేదరిక నిర్మూలన కోసం తమవంతు ఉద్యమం చేపట్టాలని భావించారు.

### ఎమర్జెన్సీ తర్వాత ఉద్యమాలు(25)

1977 నుండి కరీంనగర్ జిల్లాలో నక్సలైట్ నాయకత్వంలో అనేక సమస్యలపై ప్రజలు కదిలారు. విద్యార్థి యువజన సంఘాలు, రైతుకూలీ సంఘాలు, ఉపాధ్యాయ సంఘాలు, పౌరహక్కుల సంఘాలు, విరసం, జననాట్యమండలి, రచయితల సంఘాలు మొదలైనవి ఎన్నో బహుముఖాలుగా సామాజిక ఉద్యమాలుగా ప్రజలలో విస్తరించాయి. అప్పటిదాకా వున్న సంస్థలను, నిర్మాణాలను వీరు ప్రశ్నించారు. ప్రజల సమస్యల పరిష్కారం కోసం వారిని నిలదీశారు. అన్ని రంగాలలాగే బీడీ కార్మికుల రంగంలో కూడా విప్లవ చైతన్యం వల్ల కార్యకర్తలను, ఉద్యమాలను నిర్మించారు. ప్రత్యేకంగా బీడీ కార్మిక సంఘాలను ఏర్పాటు చేశారు. బి.ఎస్.రాములు విప్లవ రచయితల సంఘం సభ్యుడిగా తన జీవిత అనుభవాల నేపథ్యం వల్ల బీడీ కార్మికుల జీవితాలను ఉద్యమాలను చిత్రించాలనుకున్నారు. ఈ సామాజిక నేపథ్యంలో వెలువడినదే 'బతుకుపోరు' నవల.

### బతుకుపోరు నవల పుట్టుక(26)

అందువల్లే ఈ నవలలో బీడీ కార్మికుల జీవన విధానం, సంస్కృతితో పాటు కరీంనగర్ జిల్లాలో సాగుతున్న విప్లవ ఉద్యమాలను అంతర్లీనంగా చిత్రించారు. ఇలా 'బతుకుపోరు' నవల ఒక సామాజిక చారిత్రక నేపథ్యంలో వెలువడిన నవల. అందులోరెండు తరాల అనుభవం కలిగి, స్వయంగా బీడీ కార్మికులను బి.ఎస్.రాములు అనుభవ సంపన్నతతో పరిశీలనాశక్తి, కథాకథన నైపుణ్యం, ఈ నవలను తెలుగు సాహిత్యంలో ఉత్తమ నవలలో ఒకటిగా గుర్తింపు పొందింది.

'బతుకుపోరు' బీడీ కార్మిక స్త్రీల గురించిన నవల. బీడీ పరిశ్రమ పొగాకుతో, బీడీ ఆకుతో, బీడీలు చేసే పరిశ్రమతో ముడిపడి వుంది. పొగాకు, బీడీలు తయారు చేయడం అనే వృత్తుల్లో ప్రధానంగా స్త్రీలే వున్నారు. ఈ మూడు దశలను వాటి చారిత్రక పరిణామాల్ని తర్వాతి అధ్యాయంలో పరిశీలిస్తాను.

**బతుకుపోరు నవల – ఇతివృత్తం**

బీడీకార్మిక కుటుంబం యొక్క జీవన విధానాన్ని, సంస్కృతిని కుటుంబ సంబంధాలను, పరిణామాలను ఇతివృత్తంగా తీసుకుని మొత్తం బీడీ పరిశ్రమను చిత్రించిన నవల యిది. ఈ నవల సమాజానికి పలు విషయాలను తెలుపుతుంది.

ఈ కథలో లక్ష్మి ప్రధాన పాత్ర. లక్ష్మీ ఉదయం నిద్రలేచినప్పటినుంచి రాత్రి పడుకునే దాకా సాగిన దినచర్యల్లో అనేక అంశాలు వస్తాయి. అనేక పాత్రలు సంఘటనలు అత్యంత సహజంగా కన్పిస్తాయి. ఇదంతా మొదటిభాగం. ఇలా జీవితానికి, నవలకు మధ్య, కల్పనకు, వాస్తవికతకు మధ్యఉండే అంతరాలు తొలగి జీవితమే నవలగా సాక్షాత్కరింప చేస్తుంది బతుకుపోరు నవల.

**వ్యక్తి నుండి సామూహికత్వంలోకి**

రెండవ భాగంలో కథావస్తువు వ్యక్తి నుండి సామూహికత్వంలోకి విస్తరిస్తుంది. అందరూ బీడీ కార్మికులే అయినప్పటికీ ఎవరి వ్యక్తిత్వం వారికి ప్రత్యేకంగా తీర్చిదిద్దిన తీరు స్పష్టమవుతుంది. ఆ పాత్రలు వాస్తవిక జీవితంలో మనకు ఎదురైనట్లుగా సజీవ పాత్రలుగా ఫీలవుతాము. ఆ జీవితాలు మనకెంతో ఆత్మీయమైనవిగా భావిస్తాము. అలా రచన పాఠకుల హృదయాల్లోకి సజీవ పాత్రలుగా చొచ్చుకొనిపోతుంది.

ఈ నవల గురించి ముందుమాటలో కె.రాంమోహన్‌రాజు ఇలా అంటారు. "ప్రొలిటేరియట్ క్రమంగా పరిణామం చెందుతుంటుంది. పుట్టినప్పుడే బూర్జువాజీకి వ్యతిరేకంగా పుడుతుంది. మొదట కొందరు శ్రామిక వ్యక్తులు పోరాటం సాగిస్తారు. తదుపరి ఒక కర్మాగారంలో కూలీలు ఆ పోరాటాన్ని ముందుకు తీసుకుపోతారు. ఆ తరువాత ఒకచోట ఒక వ్యాపారానికి సంబంధించిన కూలీలందరు ఏకమవుతారు. తమ్ము పీడించే బూర్జువాజీని ఎదిరిస్తారు."[27]

పైమాటలు కారల్ మార్క్స్ కమ్యూనిస్టు మానిఫెస్టోలో చెప్పినవి. ఆ మాటల్ని నవలా రూపంలోకి అనువదించడమే బి.ఎస్.రాములు చేసినపని.



ఒక విషయం గూర్చిరాయాలనుకున్నప్పుడు రచయిత ఆ పరిస్థితుల్లో జీవించి ఉండకపోతే అది జీవితం అనిపించదు. రాములు తాను చూడనిదాన్ని గాక చూసినదాని వెనుక ఉండే కనిపించని కారణాల గూర్చి రాశారు. వాటిని జీవితంతో ముడిపెట్టారు జీవితం నుంచి విడదీయదగ్గ కారణాలేవీ అతనికి కన్పించలేదు. రాములు ఏ జీవితాన్నయితే చిత్రించదలచుకున్నాడో ఆ కార్మికులతో కలిసి జీవించాడు. వారి బాధల్ని అనుభవించి పలవరించాడు. అందుకే ఈ నవల రూపుదిద్దుకుంది.

ప్రస్తుత తెలుగు సాహిత్యంలో ఇలా రాస్తున్న వారి సంఖ్య ఎక్కువ అవుతున్నందువల్ల మన సాహిత్యం బహుశా దేశంలోని అన్ని సాహిత్యరీతులకన్నా ఎంతో ముందుందని నేను విశ్వసిస్తున్నాను.

ఆంధ్రప్రదేశ్‌లో బీడీకార్మికులు ఆరు లక్షలమంది ఉంటారు. నిజామాబాద్, కరీంనగర్, మెదక్, హైదరాబాదు, వరంగల్ జిల్లాల్లో స్త్రీల పరిశ్రమగా ఇది కొనసాగుతున్నది. బీడీపరిశ్రమపై లక్షలాది కుటుంబాలు ఆధారపడి బతుకుతున్నాయి. కరీంనగర్, నిజామాబాద్ జిల్లాల్లో దేశంలో అందరికన్నా ఎక్కువ ఉపాధిరంగంలో స్త్రీలు పనిచేస్తున్నారు. బీడీ పరిశ్రమవల్లే స్త్రీలకు యీ ఖ్యాతిదక్కింది. రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులు ఆరు లక్షలు. బీడీ పరిశ్రమ మీద ఆధారపడ్డవారు కూడా అంతే. ఇంత పెద్దఎత్తున ఉపాధి కలిగించు పరిశ్రమ రాష్ట్రంలో మరొకటి లేదు.[28]

రచయిత బి.ఎస్. రాములు తల్లి బీడీకార్మికురాలే. రచయిత రాములుగారు కూడా ఒకప్పుడు బీడీకార్మికుడే. రచయిత జీవన సహచరి శ్యామలగారు కూడా చిన్నప్పటినుంచి బీడీకార్మికురాలే. రచయిత ఐదారేళ్లు బీడీపరిశ్రమలో పనిచేసి విప్లవ జీవితంలోకి వెళ్లారు. ఇంటికి పెద్దదిక్కుగా తల్లి శ్యామల పిల్లలను బీడీలు చేసి పోషించింది. ఇలా బీడీలను తయారుచేసే వృత్తితో వీరి జీవితాలు ముడిపడిఉన్నాయి.



# బతుకుపోరు నవల కథాపరిచయం

లక్ష్మి, రాజయ్య అనే దంపతులు పేదరికంలో పుట్టిపెరిగారు. గిట్టుబాటు కాని చేతివృత్తి వదిలి, ఇతర వృత్తులు చేపట్టారు. లక్ష్మి బీడీలు చేస్తుంది. రాజయ్య బట్టల దుకాణంలో గుమాస్తాగా పనిచేస్తుంటాడు. వీరికి ముగ్గురు సంతానం. వీరు పిల్లల చిన్నచిన్న కోరికలను కూడా తీర్చలేక బాధపడుతుంటారు. చాయ్, పాలు, డబల్ రొట్టె మొదలైనవి కూడా వారికి అపురూప వస్తువులు. పిల్లలు ఇంటిపనిలో తల్లికి సహకరిస్తారు. వీరిలో పెద్దకొడుకు శ్రీనివాసు, రెండవ సంతానం సరస్వతి, ఆఖరివాడు నాని. శ్రీనివాసు తమ్ముణ్ణి ఎత్తుకొని ఆడిస్తుంటాడు. శ్రీను కొత్త షర్టుకోసం నెలరోజులుగా అడుగుతుంటాడు. శ్రీను చొక్కాలు అన్ని చిరిగిపోయి ఉంటాయి. తల్లి బీడీల కూలిడబ్బులు వచ్చిన తర్వాత కుట్టిస్తానంటుంది. తల్లి ఏదైనా కొనుక్కొని తీసుకురమ్మని పనిచెప్తే ఆ పని చేయడానికి ఐదుపైసలు కమీషన్ అడుగుతాడు శ్రీను. పిల్లలు చదువుకోవడానికి వీలుకాకుండా తల్లి నిరంతరం పనిచెప్తూ ఉంటుంది.

లక్ష్మి ఇంటిపనంతా చేసి చాయ్ పెడుతుంది, వంటచేస్తుంది. పిల్లలు బుడబుడ స్నానం చేస్తారు. శరీరం సరిగా తడవకుండానే స్నానాలు చేస్తారు. ఉదయాన్నే చాకలిమైసి బట్టలు తీసుకువెళ్ళడానికి వస్తుంది. చాకలిమైసికి యీ పిల్లల కోసం పెట్టిన అన్నం ఇచ్చేస్తుంది. పిల్లలకు పెన్నుపత్తి, బలపాలు కొనివ్వడానికి కూడా డబ్బులు సరిగాఉండవు. పిల్లలు బడికిపోను అని ఏడిస్తే పోకు నాకేమి చదువుకుంటే ఎవరు బుద్ధిమంతులు అవుతారు, చదువుకోకపోతే నాలాగే బీడీలు చెయ్యి అని తల్లి బెదిరిస్తుంది. ఎక్కాల పుస్తకం డబ్బులు ఇవ్వమన్న శ్రీనునే తిడుతుంది తల్లి. శ్రీను సరస్వతిని బడికి పంపిన తర్వాత పాలుతాగే చిన్నకొడుక్కి స్నానం చేయిస్తుంది. బాయికాడికి పోయి పిల్లలు, భర్త బట్టలు ఉతికి ఆరేసి మళ్ళీ ఆకు కత్తిరించడానికి కూర్చుంటుంది లక్ష్మి. అప్పటికి ఉదయం పదకొండు అవుతుంది.

అంతలో పొరుగింటి అమ్మాయి సుగుణ ఆకుగుల్ల తీసుకొని లక్ష్మి దగ్గరకు వచ్చి కూర్చుంటుంది. సుగుణ ఆరో తరగతి వరకు చదివి బీడీలు చేస్తూ ఉంటుంది.



సుగుణది పెళ్లివయసు. బి.ఎ. చదివి బీడీల కంపెనీలో పనిచేసే నారాయణ, అతని తల్లి లచ్చిరాజు పెళ్లిచూపులు చూశారు. మొన్న చూసిపోయినవాళ్లు ఏమన్నారని లక్ష్మి అడుగుతుంది. కట్నం కింద ఏమేమి అడిగారో సుగుణ చెప్తుంది. పెళ్లి తీరుతెన్నుల గురించి కొద్దిసేపు చర్చ జరుగుతుంది. "గుంటెడు జాగుండది, గుడిసెకు కప్పుండదిగని వేలకు వేలు కావాలె కట్నాలు!"(29) అని మగపెళ్లి వాళ్ళను విమర్శిస్తుంది లక్ష్మి. మగవాళ్ళతో సమానంగా సంపాదిస్తున్నపడు కట్నం ఎందుకని ప్రశ్నిస్తుంది. బీడీలు చెయ్యడానికి సుగుణ కంపెనీకి బయలుదేరుతుంది. తనకుకూడా బీడీ ఆకు తంబాకు పట్టి ఉంచుమని లక్ష్మి చెప్తుంది.

పొద్దు నడినెత్తికి వచ్చేసరికి లక్ష్మి భర్త రాజయ్య ఊర్లు తిరిగి అలసిపోయి ఇంటికి చేరతాడు. అతడి ముఖం అంతా పీక్కుపోయి ఉంటుంది. కోరుట్ల సమీపంలోని మాదాపురంలో రాజన్న పెద్దవ్వ బిడ్డ కొడుకు అనగా రాజయ్య మేనల్లుడు వెంకట రాజన్న హోటల్‌లో ముందురోజు ఛాయ్ తాగుతున్నవాడ్ని తీసుకుపోయి పోలీసులు తుపాకి తూటాలు పేల్చి చంపేస్తారు. ఎన్‌కౌంటర్ కథ అల్లుతారు. రైతుకూలీ సంఘాలు పెట్టి ఆర్గనైజ్ చేసిన విప్లవ కార్యకర్త వెంకటరాజన్న. ఈ ప్రస్తావనలో పేర్కొన్న సంఘటన వాస్తవంగా జరిగిన సంఘటనే. 1982 జనవరిలో మాదాపురంలో అంకం నారాయణ, వాసం గజేందర్ అనే యువకులను చంపివేసిన సంఘటన ఇది. ఈ సంఘటనపై నిజనిర్ధారణ కోసం ఢిల్లీనుంచి జార్జ్‌ఫెర్నాండెజ్ తదితరులు వచ్చి పర్యటించారు. అన్నీ జ్ఞాపకం వచ్చి మేనల్లుడు గుర్తుకు వచ్చి అన్నం తినలేక మధ్యలోనే చేయి కడిగిలేస్తాడు రాజయ్య. బట్టల షాపుకి వెళ్లిపోతాడు.

బడినుండి పగటి భోజనానికి పిల్లలు ఇంటికివస్తారు. ఇంత దూరం బడినుంచి రావడం కష్టంగా ఉందని అందరిలాగే తనకుకూడా టిఫిన్ బాక్స్ పెట్టమని గారాబంగా అడుగుతాడు శ్రీను. తిన్నాక ఎవరి ప్లేటు వారినే కడగమంటుంది తల్లి. సుగుణ పెళ్లిసంబంధం గురించి అడిగివద్దామని అలాగే బీడీల దారాన్ని రీలుకు చుట్టుకువస్తానని పక్కింటికి వెళ్తుంది లక్ష్మి. పిల్లలు తిరిగి బడికి వెళ్ళిన తర్వాత బీడీకంపెనీకి బయలుదేరుతుంది లక్ష్మి. దారి మధ్యలో సుగుణను చూసివెళ్ళిన నారాయణ ఎదురవుతాడు. కంపెనీలో ఏజెంటు ఎక్కువ మొత్తానికి సంతకం తీసుకుని తక్కువ జీతం ఇస్తే పోట్లాట పెట్టుకుని నారాయణ ఇంటికి పోతున్నాడు. ఎంతో బాధలో ఉన్నాడు. ఆ సమయంలో పెళ్లి కట్నకానుల గురించి అంత ఎక్కువగా ఎందుకు అడిగారు అని లక్ష్మి అడుగుతుంది. నారాయణ అలా ఏమీలేదు అని చెప్పి వెళ్లిపోతాడు.

బీడీల కంపెనీకి వచ్చి తానురోజు కూర్చునే స్థలంలో కూర్చుంటుంది లక్ష్మీ. అరుగు పక్కన చిన్నగది. నలుగురు, అయిదుగురు మగవాళ్లకి ప్రత్యేక గది అది. ఆడవాళ్లు కంపెనీలో ఇల్లంతా వరుసగా కూర్చొని బీడీలు చేస్తుంటారు. ఇంట్లో వెనుకవైపున కంపెనీ కమీషన్ ఏజెంటు కుటుంబం ఉంటుంది. కంపెనీలో అందరూ అనేక విషయాలు మాట్లాడుకుంటూ బీడీలు చేస్తుంటారు. వారి బతుకుబాధలు ముచ్చటిస్తూ వుంటారు. తమను దోచుకుని కమీషన్ ఏజెంటు బాగుపడుతున్నాడని విమర్శిస్తుంటే వినలేక కమీషన్ ఏజెంటు భార్య సత్తెక్క మధ్యలో మాట్లాడుతుంది.

నారాయణను అన్నం తిన్నాక తిరిగి బీడీ కంపెనీకి తొందరగా బయలుదేరి వెళ్ళమని తల్లి అడుగుతుంది. బీడీ కంపెనీలో అన్యాయాన్ని ఎదిరించినందుకు తనను కంపెనీ ఉద్యోగం నుండి తీసేసారని నారాయణ బాధపడుతూ తల్లికి చెప్తాడు. లచ్చిరాజును చూసి లక్ష్మీ బాధపడుతుంది. పదిహేనేళ్లకే పళ్లు ఊడిపోవడం చూసి తన బతుకు ఇంతే అనుకుంటుంది. లక్ష్మీ చిన్నతనంలో ఆడిన ఆటలు, స్నేహితులను గుర్తుచేసుకుంటూ మళ్లీ చిన్నపిల్లను అయితే బాగుండు అనుకుంటుంది. లక్ష్మీ గత స్మృతుల వల్ల బాధపడుతుంది. చిన్నప్పుడు లక్ష్మీ లచ్చిరాజు దగ్గరే బీడీలు చెయ్యడం నేర్చుకుంటుంది. బొంబాయిలో బీడీలు చేయడం నేర్చుకొని వస్తుంది లచ్చిరాజు.

లక్ష్మీ మరిది ఎంబిబిఎస్ చదువుతున్న విషయం గుర్తుచేసుకుని బాధపడుతుంది. ఎంతో కష్టపడి మరిదిని చదివిస్తే మరిది తన పిల్లలను చదివిస్తాడో లేదో అని వేదన పడుతుంది. బతుకంతా మరిది చదువుకు ధారపోసాక తన పిల్లల్ని దగ్గరకు తీసుకుని చదివించకపోతే తమ జీవితాలు చెరకురసం పండిన పిప్పిలా మిగిలిపోతుందని కళ్ళనీళ్ళు తెచ్చుకుంటుంది లక్ష్మీ.

లచ్చిరాజు తనను చూసి లక్ష్మీ కన్నీళ్ళు పెట్టుకుందని భావిస్తుంది. పెళ్లి సంబంధం గురించి ముచ్చటిస్తుంది. ఇప్పుడే పెళ్ళి వద్దన్నాడని చెప్పడం కన్నా ఏవేవో ఎక్కువ అడిగితే వాళ్ళే ఊరుకుంటారు కదా అని లచ్చిరాజు సమాధానం చెప్తుంది. సాయంత్రం లక్ష్మీ రోడ్డుమీద నడుస్తుంటే వరుసకు కొడుకు అయిన చంద్రశేఖర్ ఎదురవుతాడు. ఎక్కడికి వెళ్తున్నావు? అని అడుగుతుంది. శేఖర్ వాళ్ళ కంపెనీలో బీడీలు చేయించే కమీషన్ ఏజెంటు రాజా రామన్న ఈశ్వరీ అనే అమ్మాయిని చేయిపట్టుకుంటే విసిరికొడుతుంది. రాజారామన్నకు త్రాసుకాటా కుచ్చుకొని ఆసుపత్రిలో చేర్పించారని చెప్తాడు. ఆ కంపెనీ ఏజెంటు రాజారామన్న భార్యను తీసుకొచ్చుకోవడంలేదని, అంజవ్వను ఉంచుకున్నాడని చెప్తాడు శేఖర్. లక్ష్మీ రాజారామ్‌ను, అంజవ్వను మనసులో తిట్టుకొని ముందుకు నడుస్తుంది.



సాయంత్రం బడి వదిలిన తర్వాత పిల్లలు ఇంటికి వచ్చి తల్లికోసం ఎదురుచూస్తూ ఉంటారు. శ్రీను ఏడ్చే తమ్ముణ్ణి ఎత్తుకొని ఆడిస్తుంటాడు. బీడీల కంపెనీలో ఆరోజు “పగార” (పేమెంటు) పంచుతారని, పైసలు ఇచ్చిన తర్వాత పిల్లలకు కావలసినవి కొనిస్తానని చెప్తుంది లక్ష్మీ. చిన్నవాడికి పాలు ఇచ్చి, శ్రీనుకు పిల్లవాణ్ణి అప్పగించి మళ్లీ కంపెనీకి వెళ్లింది లక్ష్మీ. కంపెనీలో బీడీల పైకం పంచుతున్నాడు కమీషన్ ఏజెంటు రాజేశం. ఆకు తుట్టిపోయిందని ఆకువిలువను కత్తిరించి కూలీడబ్బులు ఇస్తుంటే కార్మికులు తిరగబడతారు. దీనికి రామక్క నాయకత్వం వహిస్తుంది. రామక్క కూడా ముప్పైఏళ్లుగా బీడీలు చేస్తున్న సీనియర్ కార్మికురాలు. మగ కార్మికులు కూడా ఎదురు తిరుగుతారు. డబ్బులు తీసుకోకుండా సమ్మె చేయడానికి నిర్ణయించుకుంటారు కార్మికులు. రాత్రి లక్ష్మీ ఇంటికి చేరేసరికి పిల్లలు బీడీల పైసలు ఇచ్చారని అంగీలు, రిబ్బన్లు కొనివ్వమని తల్లివెంట పడతారు. పిల్లలు కరెంటుదీపాల వెలుగులో తమ నీడలు పెరగడం, తగ్గడం చూసి అగో దెయ్యం అని ఆటలు ఆడుకుంటూ ఉంటారు. రాత్రి దుకాణం నుంచి పెనిమిటి రాజయ్య ఇంటికి వస్తాడు. చుట్టాల తాకిడివల్ల పెరుగుతున్న ఖర్చుల గురించి భార్యాభర్తలు కొద్దిసేపు వాదించుకుంటారు. చిన్నకొడుకు నానికి ఇన్నిరోజులు టీకాలు వేయించలేదని లక్ష్మీ భర్తకు గుర్తుచేస్తుంది.

లక్ష్మీ ముగ్గురి పిల్లలు చాలు అని ఆపరేషన్ చేయించుకోమంటుంది. భర్త రాజయ్య తాను సైకిల్ తొక్కుతూ ఊరూరా తిరగడం వల్ల బలం తగ్గుతుందని భయపడతాడు. రాజయ్య బట్టల గుమస్తాల సంఘం ఎన్నికల్లో కోశాధికారిగా ఎన్నిక అయిన విషయం లక్ష్మీకి చెప్తాడు. వాళ్లు కూడా సమ్మె చేస్తామని వర్తక సంఘానికి నోటీసు ఇచ్చిన విషయం గుర్తుచేస్తాడు. ఈ సందర్భంగా మగవారికన్నా ఆడవాళ్లు ఎన్నిరెట్లు పనులు ఎక్కువ చేస్తారో అని లక్ష్మీ వాదిస్తుంది. మా ఆడవాళ్ల కష్టాలు మీకేమి తెలుస్తాయి అని భర్తతో వాదిస్తుంది. సుగుణ, నారాయణల పెళ్లి ఖాయమైన విషయం పెనిమిటికి చెప్తుంది.

ఆ రాత్రి లక్ష్మీమీద చేయివేస్తాడు రాజయ్య “సాతనయిత లేదు” అని దీనంగ వేడుకుంటుంది లక్ష్మీ. “ఏది యాంత్రికతో ఏది వ్యక్తిగత అవసరమో తేడా తెలియనంతగా గడియారంలాంటి యాంత్రికత కార్మిక స్త్రీల జీవితాల్లో పెనవేసుకుపోయింది.[(30)]

ఇక రెండవ భాగం ప్రారంభమవుతుంది. సమ్మె చేయడానికి నిర్ణయించిన రామక్క రాత్రి నాలుగు గంటలకు మెలకువ వచ్చి నిద్రలేస్తుంది. పక్క ఇంటినుంచి ఏడుపు వినిపించి తన ఒక్కగానొక్క కొడుకు ఎక్కడ ఉన్నాడో తెలియక గుర్తుచేసుకుని

వెక్కివెక్కి ఏడుస్తుంది. కొడుకు బడిపంతులు పెట్టే కష్టాలు భరించలేక బడి ఎగ్గొడుతుంటాడు. ఇరుగుపొరుగు వారు ఏదేదో అంటుంటారు. దయ్యం పట్టిందని , పిచ్చి పట్టిందని అంటూ పరిష్కార మార్గాల కోసం అనేక సలహాలు ఇస్తుంటారు. గుండుకొట్టించి నెత్తిమీద నిమ్మకాయలు మర్దన చేపిస్తారు. ఆ అవమానం భరించలేక కొడుకు చదువుమానేసి పారిపోయి బొంబాయి చేరతాడు. ఎక్కడెక్కడో పనిచేస్తూ "లుంపెన్ కార్మికుడుగా" పతన దశకు మారిపోతాడు. బూర్జువా సమాజం వల్లనే ఇతని బతుకు అలా అవుతుందని అతనికి తెలియదు. ఈ పాత్ర బి.ఎస్.రాములుగారి స్వయాన సొంత అన్న పాత్రే. కల్పన కాదు.

తెల్లవారిన తర్వాత సమ్మె మొదలవుతుంది. మహిళా కార్మికులు బీడీలు చెయ్యడం మానేసి ఊరేగింపు తీస్తారు. వీరితోపాటు బడిపిల్లలు కూడా కలసిపోయి జిందాబాద్... అంటూ కలిసి గుంపుగా నడుస్తుంటారు. ఆ సమ్మెకు రహస్యంగా నాయకత్వం నడిపిస్తున్న శంకరయ్య విప్లవకార్యకర్త. ఇతను ఊరేగింపులో ఆ ఉద్యమ సమ్మెను గురించి మాట్లాడతాడు. సమ్మెవల్ల కార్మికులు ఎన్ని అవస్థలు పడుతుంటారో, తద్వారా సమ్మె నుండి విరమించుకొని బీడీలు చెయ్యడానికి వెళ్లాలని లోలోపల బాధపడుతుంటారో అనేక సంఘటనల ద్వారా రచయిత వివరిస్తాడు. సమ్మె చేయడానికి వీలుకానంతగా పేదరికం ఎలా అడ్డుపడుతుందో యీ నవల చదివితే తెలుస్తుంది.

సమ్మె నాయకులు వారిని నయానా భయానా సమ్మెకు కట్టుబడాలని ఒప్పిస్తుంటారు. మరోవైపు బీడీకంపెనీ నాయకులు సమ్మె నాయకులను చర్చలకు పిలిపించి కొంత పార్టీ ఫండు ఇచ్చి సమ్మె విరమింప చేయాలనుకుంటారు. సుధాకర్ అనే నాయకుడు ఇలాంటి పనులు చేస్తుంటాడు. విప్లవ కార్యకర్త అయిన శంకరన్న ఇలాంటి పనులకు లొంగిపోడు అని కంపెనీ ఏజెంట్లు నిర్ధారించుకుంటారు. రోజురోజుకి సమ్మె విస్తృతం అవుతుంది. సుగుణ, నారాయణలు సమ్మెకు సంబంధించిన పోస్టర్లు రాస్తుంటారు. లక్ష్మీ పిల్లలు శ్రీను, సరస్వతి నేను రాస్తా నేను రాస్తా అని బ్రెష్‌లు లాక్కుంటారు. సరస్వతి కాలుతగిలి అందరి ముఖాలపై ఎరుపు సిరా చిలకరించినట్లుగా పడుతుంది. పోస్టర్లు అతికించడానికి నారాయణ, లక్ష్మీ నారాయణలు బయలుదేరుతారు.

"గుమ్మంలోకి వచ్చి తమ కలలు ఎప్పుడు పండుతాయో అని వెళ్తున్న ఇద్దరిని చూస్తూ నిల్చుంది సుగుణ. నారాయణ చేతిలో ఎర్ర అక్షరాలు ఉన్న పోస్టర్లు చిరుగాలికి తరగలించడం సుగుణ చూస్తుంది. ఆ ఇద్దరూ చీకటి కడుపులో చిచ్చురగిల్చే వెలుతురు బాణాల్లా ముందుకు సాగిపోతున్నారు"(31) అనే వాక్యంతో నవల ముగుస్తుంది.



## పాదసూచికలు

1 ముదిగంటి సుజాత రెడ్డిగారితో సంభాషణలు
2 కరీంనగర్, నిజామాబాద్ జిల్లాల డైరక్టరీ, సంపాదకులు : దుర్గం రవీందర్; పుటలు : 286, 344
3 బీడీ కార్మికులతో సంభాషణ
4 50వ జన్మదిన స్వర్ణోత్సవ సంచిక - బి.ఎస్.రాములు; పుట : 33
5 50వ జన్మదిన స్వర్ణోత్సవ సంచిక - బి.ఎస్.రాములు; పుట : 34
6 బతుకుపోరు నవల - మూడవ ముద్రణ, బి.ఎస్.రాములు ; పుట : 101
7 పేరాల లక్ష్మీకాంతంతో సంభాషణలు.
8 మచ్చ గంగారామ్‌గారితో సంభాషణలు.
9 వనమాల చంద్రశేఖర్ గారితో సంభాషణ; కరీంనగర్
10 వరవరరావుగారితో సంభాషణ, హైదరాబాద్
11 వరవరరావుగారితో సంభాషణలు.
12 తెలంగాణ విమోచనోద్యమం-తెలుగు నవల, డా॥ వరవరరావు ; పుట : 17.
13 వరవరరావుగారితో సంభాషణలు.
14 కాసుల ప్రతాపరెడ్డి గారితో సంభాషణ, హైదరాబాద్.
15 50వ జన్మదిన స్వర్ణోత్సవ సంచిక - బి.ఎస్.రాములు; అంపశయ్య నవీన్.
16 సత్యశోధక సమాజ్ కార్మిక ఉద్యమాలకు పుట్టినిల్లు - వి.జి.ఆర్.నారొగొనే.
17 తెలంగాణ రాష్ట్ర చరిత్ర - బి.ఎస్.రాములు.
18 తెలంగాణ రాష్ట్ర చరిత్ర - బి.ఎస్.రాములు.
19 "తెలంగాణలో చైతన్యం రగిలించిన నిజాం రాష్ట్రాంధ్ర మహాసభలు" ప్రథమ భాగము - కె.జితేంద్ర బాబు; పుట : 26, 30
20 స్వీయ చరిత్ర - కె.వి.రంగారెడ్డి, 2003; పుట : 17
21 తెలంగాణ రాష్ట్ర చరిత్ర - బి.ఎస్.రాములు ; పుట : 30
22 తెలంగాణ తల్లి ఎరుక - బి.ఎస్.రాములు ; పుట : 32
23 సాహిత్య చరిత్రను కొత్తచూపుతో తిరగరాయాలి - బి.ఎస్.రాములు
24 కరీంనగర్ నక్సలైట్ ఉద్యమాలు.
25 తేనెటీగలు కథల సంపుటి - బి.ఎస్.రాములు ; పుట : 152
26 బతుకుపోరు నవల - మొదటి ముద్రణ, బి.ఎస్.రాములు ; పుట : 34
27 బతుకుపోరు నవల - కె.రామ్మోహనరాజి ముందుమాట, 2వ ముద్రణ.
28 బతుకుపోరు నవల - రెండవ ముద్రణ, బి.ఎస్.రాములు; ముందుమాట.
29 బతుకుపోరు నవల - రెండవ ముద్రణ, బి.ఎస్.రాములు.
30 బతుకుపోరు నవల - మూడవ ముద్రణ, బి.ఎస్.రాములు.
31 బతుకుపోరు నవల - మూడవ ముద్రణ, బి.ఎస్.రాములు.

**నాల్గో అధ్యాయం**

# 'బతుకుపోరు' నవలలో వాస్తవికత

బతుకుపోరు నవలను రచయిత తన తల్లి పాత్ర ద్వారా చిత్రించాలనుకున్నారు. బీడీలపై ఆధారపడి జీవించే మధ్య వయస్సు కుటుంబ జీవితాలను చిత్రించటంతో ప్రారంభించారు. తల్లి పాత్రను అనేక పాత్రల్లోకి మలిచారు.

ఈ నవలలో రచయిత మొత్తం బీడీ కార్మికుల సమస్యలను, సంస్కృతిని వ్యక్తిత్వ వైవిధ్యాన్ని చిత్రించాలనుకున్నారు. దానివల్ల అనేక పాత్రలను తీసుకోవడం జరిగింది. కథ మొత్తం లక్ష్మిపాత్ర వెంట నడుస్తుంది. బీడీ కార్మికుల గత జీవితాలకు, పరిణామాలకు ప్రతీకగా రామక్క, లచ్చిరాజు జీవితాలను చిత్రించారు.

నవల కథా పరిసరాల చుట్టూ విప్లవోద్యమాలు జరుగుతాయి. అంకం నారాయణ, వాసం గజేందర్ అనే యువకులను 1982 జనవరిలో కరీంనగర్ జిల్లా కోరుట్ల సమీపంలోని మాదాపూర్ గ్రామంలో ఒక హోటల్‌లో ఉండగా పట్టుకొని పోలీసులు కాల్చి చంపారు. ఈ సంఘటనను రచయిత 'బతుకుపోరు' నవలలో రాజయ్య మేనల్లుడు వెంకటరాజంగా పొందుపరిచారు.

అలాగే దత్తాసామంత్ నాయకత్వంలో బొంబాయిలో బట్లమిల్లు కార్మికుల సమ్మె ఏడాదిన్నరపాటు జరిగింది. ఆ సమ్మెను చిత్రించడంతో పాటు ఆ సమ్మె పర్యవసానం కూడా ఈ నవలలో చిత్రించారు. వాసం గజేందర్ చిత్రణలో కూడా చూడవచ్చు. వారిని అన్యాయంగా చంపి ఎన్‌కౌంటర్ కథ అల్లిన విషయంపై జార్జి ఫెర్నాండెజ్ బృందం ఆ ప్రాంతంలో పర్యటించి నిజానిజాలు తెలుసుకున్నారు.

ఒక ఊరిలో కులవృత్తుల సంబంధాలు ఎలా ఉంటాయో చాకలి మైసి పాత్ర ద్వారా చిత్రించారు. మొత్తానికి రచయిత వారితల్లి జీవితాన్ని ఈ నవలలో చిత్రించాలనుకున్న మొదటి లక్ష్యం నెరవేరకపోయినా బీడీ కార్మికుల జీవితాల్లోని పలు కోణాలను చిత్రించిన సమగ్ర నవల అని చెప్పవచ్చు.

రచయిత అన్నగారి జీవితం గురించి 'బతుకుపోరు' నవలలో రామక్క కొడుకుగా చిత్రించారు. నవల ప్రారంభించాక తనదైన వ్యక్తిత్వాన్ని, జీవితాన్ని నవల



సంతరించుకొని సామాజిక జీవితాల ప్రతినిధి నవలగా రూపొందింది 'బతుకుపోరు' నవల.[1]

రామక్కపాత్ర, నర్సన్న అనగా రచయిత సోదరుని పాత్ర పెట్టుబడిదారీ వ్యవస్థ తన లాభాల కోసం పీల్చిపిప్పి చేస్తే కుటుంబాలు విచ్ఛిన్నమై ఎలా తల్లి, కొడుకులు సైతం దూరమై పోయారో చిత్రించారు. కార్మికులను పని నుండి తొలగించి నిరుద్యోగులుగా మార్చితే వాళ్ళు లుంపెన్‌గా ఎలా మారుతారో ఈపాత్ర స్వభావంలో చిత్రించారు. కార్మికులు ఎక్కువ డిమాండ్ చేయకుండా తక్కువ కూలికి పని చేయడానికి, కార్మిక రంగానికి వెలుపల నిరుద్యోగ సైన్యాన్ని పెంచుతుంటారు. గ్రామీణ వ్యక్తి పరిశ్రమలో ఒక యంత్రం వంటి కార్మికుడిగా ఇమడలేని స్థితి నర్సయ్య పాత్రలో చిత్రించారు. బొంబాయి, భీవండి ప్రాంతాలలో కరీంనగర్ జిల్లా నుండి కడుపు చేత పట్టుకొని వలస వెళ్ళిన వారు లక్షలాది మంది ఉన్నారు. వాళ్ళు అక్కడ, వారి కుటుంబాలు ఇక్కడ. అనుబంధాలు, ఆప్యాయతలు, నిర్దాక్షణ్యంగా దూరం చేయబడ్డాయి. అయినా వారు సుఖపడింది ఏమీ లేదు. సంపాదించి లేదు. బట్టకు, పొట్టకు బతకడం తప్ప.

1981 సం॥లో బొంబాయి బట్టల మిల్లులో సాగుతున్న దత్తా సామంత్ సమ్మె నిజానికి కరీంనగర్ జిల్లాలో చేస్తున్న సమ్మె వంటిదే. ఆ సమ్మెలో ఇక్కడి జీవితాలు అతలాకుతలమై పోయాయి. పల్లెకు, బొంబాయి పారిశ్రామిక నగరానికి గల సంబంధం ఏమిటో చెప్పాలనుకున్నారు. అది కథలో భాగంగా కొంతమేరకే చిత్రించారు. ఇలా 1980–82 మధ్య కరీంనగర్ జిల్లాలో జగిత్యాల ప్రాంతంలో బొంబాయిలో సాగిన సామాజిక పరిణామాలను కుటుంబ సంబంధాలను కూడా ఇందులో నిక్షిప్తం చేయడం జరిగింది.

బీడీ కార్మికులకు కష్టాలు, కన్నీళ్ళే తప్ప ఎదుగుదలే లేదు అనే భావం కలిగించడం రచయిత లక్ష్యం కాదు. వారు కూడా ఈ సమాజంలోని అభివృద్ధిని అందుకోవడం సాధ్యమే అని, అందుకోవాలని ఆశిస్తూ బీడీ కార్మికుల పిల్లలు, టీచర్లు, ఇంజినీర్లు, డాక్టర్లుగా ఎందరో అయ్యారు. వారందరికి ఒక ప్రతినిధిగా లక్ష్మి మరిది ఎమ్‌బిబిఎస్ చదువుతున్నాడనే పాత్ర ద్వారా చిత్రించడం జరిగింది.

పేద వర్గాల నుండి ఎదిగి డాక్టర్లుగా, ఇంజినీర్లుగా మధ్య తరగతిగా మారుతున్న వారు, ఉమ్మడి కుటుంబాలుగా వున్నవారు, వ్యక్తి కుటుంబాలుగా మారిపోయి తమ ఎదుగుదల కోసం రక్తమాంసాలను, జీవితాలను అర్పించిన కుటుంబ సభ్యులను వారు ఎదిగిన తర్వాత పట్టించుకుంటారో లేదో అన్న భయం గ్రామీణ ప్రాంతాల

వారు భయపడ్డారు. ఆ భయం నిజమైంది కూడా. అందుకే లక్ష్మి ఇలా అనుకుంటుంది. "తాము ఇంత కష్టపడి పిల్లలకు కాపీలు, డ్రస్సులు కొనివ్వకుండా కూడబెట్టి మరిదికి పంపిస్తే డాక్టరయ్యాక తమ పిల్లలను దగ్గరుండి చదివిస్తాడో లేదో"[2] అని లక్ష్మి మదన పడుతుంది.

1978-84 మధ్య విప్లవకారుల నాయకత్వంలో అనేక పోరాటాలు జరిగాయి. బీడీ కార్మికుల పోరాటాలు కూడా విస్తృతంగా సాగాయి. దశాబ్దాల నుండి బీడీ కార్మిక సంఘాలకు, భారత కమ్యూనిస్టు పార్టీ (సిపిఐ)కి చెందిన ఎఐటియుసి నాయకత్వం వహిస్తూ ఉండేది. ఆ నాయకులు యాజమాన్యంతో లాలూచీ పడుతున్నారని కార్మికులు అనుకుంటుండేవారు. దీన్ని ఆసరా చేసుకొని విప్లవోద్యమం కార్యకర్తలు వారిని ప్రజలలో ఎండగట్టడం ప్రారంభించారు. ఇలా సాంప్రదాయకంగా నడిపించే కార్మిక సంఘానికి ప్రతినిధిగా సుధాకర్ పాత్రను ఇందులో చిత్రించారు. సుధాకర్‌ను విమర్శిస్తూ కార్మికులలో తమ పట్టు పెంచుకోవడం కోసం మిలిటెంటు ఉద్యమాలు చేపట్టిన విప్లవ కార్యకర్త ప్రతినిధిగా శంకర్ పాత్రను చిత్రించారు. దీనిని సున్నితంగా ఒక సన్నివేశంలో ఇలా ప్రవేశ పెట్టారు. సమ్మెను ఆపడం ఎలా? అని యజమానులు చర్చిస్తున్నప్పుడు వారి సంభాషణలో భాగంగా యీ రెండు పాత్రల మధ్య ఉన్న తేడాను చిత్రించారు. దాదా "అసలు ఈ ముచ్చట్లన్నీ ఇంట్లో కూర్చొనే ఆడోళ్లకు ఎలా తెలుస్తున్నాయని" అడిగినపుడు, రాజేశం "వాడు ఒకడు దాపురించిండు గదా శంకరిగాడు చదువు బందు చేసి ఏగి తిరుగుతుండుగదా ఇందుకేనాయె" అన్నాడు.[3]

ఇక్కడ ఒక విశేషం గమనించడం అవసరం. విప్లవ కార్యకర్తలుగా మారుతూ చదువులు బందుచేసి గ్రామాల్లోకి వేలాది విద్యార్థులు కదిలివెళ్ళారు. ప్రజల్లో కలిసి పని చేశారు. అలా విప్లవ విద్యార్థి యువజన రాజకీయాల నుంచీ బీడీ కార్మికుల నాయకుడిగా శంకర్ ఎదిగాడు. వీళ్ళు ప్రజల్లో పాలల్లో పాలల్లా కలిసిపోయారు. కార్మిక సంఘ నిర్మాణం ఉన్నట్టు కనపడదు. నిర్మాణం కూడా పాత సాంప్రదాయ పద్ధతిలో కొనసాగదు. ఉద్యమానికి అవసరమైన మేరకు కార్మికులతో సంబంధాలు పెట్టుకుంటారు. వారికి సూచనలు ఇస్తుంటారు. కార్మికులు అకస్మాత్తుగా కదిలినట్లుగా, సమ్మె చేసినట్లుగా కనపడుతుంది. ఇలా నిర్మాణం లేనట్టు కనపడే నిర్మాణం అంతర్లీనంగా కొనసాగుతుంది. ఇదే తీరులో 1982లో గోదావరి గనిలో సింగరేణి బొగ్గుగని కార్మికులు రెండు నెలలు బొగ్గు బావులు బందుపెట్టి సమ్మె జరిపారు. దీనికి సింగరేణి కార్మిక (సికాస) సమాఖ్య నాయకత్వం వహించింది. దానికి (సి.కా.స) పేరు సుప్రసిద్ధం. అలాగే గ్రామాల్లో సారా నిషేధించాలని రైతు కూలి సంఘాలు,



రాడికల్ సంఘాలు ఏర్పడ్డాయి. స్కూల్లను అప్‌గ్రేడ్ చెయ్యాలని, స్కూలు గదుల నిర్మాణం చేపట్టాలని ముందుకు వచ్చారు. ఇలా బీరకాయ పీచులాగా సమాజంలోని అన్ని రంగాల్లో విప్లవకారుల కార్యక్రమాలు విస్తరించాయి. ఈ విషయం ప్రజలకు, ప్రభుత్వానికి ఎక్కువగా తెలియకుండా చూసుకున్నారు.

అందువల్ల కంపెనీ దాదా ఇలా అంటాడు. "సుధాకర్ గాడికి పారేసినట్టు వానికి ఇంత పారెస్తే పీడపోవు కదా అని చెప్తే సేటు వినకపోయె". ఇక్కడ సుధాకర్‌కు ఇచ్చినట్లుగా కొంతమొత్తం ఇవ్వడం అనేది పార్టీఫండు కావచ్చు, ప్రయివేటు ఫండు కావచ్చు, మామూలు కావచ్చు, ఏదో ఒక రకంగా డబ్బుతో కొనివేసి సమ్మె ఆపించే ఒప్పందం చేసుకోవచ్చు అనేది అప్పటిదాకా నడుస్తూ వచ్చిన కార్యకలాపాలు. ఆ కార్యకలాపాలకు ఈ విప్లవ కార్యకలాపాలకు తేడా వుంది.[4]

రాజేశం సేటుతో ఇలా అంటాడు. "అబ్బోవాడు గసొంటి వాటికి వినేవాడు కాదు" శంకర్ వంటి ఉద్యమకారులను పనిపాట లేకుండా తిరుగుతున్నారని ప్రజలు అనుకునే వారు. అది ఒక ఉద్యమమని వారికి తెలియదు. ఉద్యమ కార్యకర్తగా ఎక్కువ ఎక్స్‌పోజర్ ఇచ్చుకున్నా మంచిది కాదని ఉద్యమకారులు అనుకునేవాళ్ళు. అలా ఉద్యమకారులు, ఉద్యమ కార్మికులు కలగలసి ఉండేవారు. ఇలా నాలుగులైన్ల సంభాషణలో సంభాషణ వెనుక, ఆ మాటల ఆంతర్యం వెనుక విస్తృతమైన సామాజిక చరిత్రను తెలియజేశారు.

సమ్మె ఒక చిన్న కారణంతో ప్రారంభం అయిన తర్వాత డిమాండ్ల చుట్టూ పెరిగిపోవడానికి కారణం కూడా యీ పని విధానమే.

రామక్క ఈ నవలలో కార్మిక నాయకురాలిగా ముందుకు వస్తుంది. ఆమె కష్టాల్లో రాటుదేలిన తల్లి. బొంబాయి బట్టల మిల్లులో కొడుకు పని చేయడం కోసం వెళ్ళి జీవితం అస్తవ్యస్తమై పోయిన కార్మికుడి తల్లి. బీడీలే ఆమె జీవన విధానం. ఆమెకు సమ్మె చేసిన రాత్రి నిదురపట్టదు.

సమ్మె మొదలైన తర్వాత ఉద్యమ జీవితంలో రెండవ అధ్యాయం రామక్కతో మొదలవుతుంది. రామక్కకు హఠాత్తుగా మెలకువ వచ్చింది. నిద్రలోంచి లేచి కళ్ళు నలుముకుంది. పక్కింటి రాజవ్వ ఏడుపు వినిపించింది. కడుపులో పేగులు తెగిపోయేటట్టుగా తెరలు తెరలుగా ఏడుస్తుంది రాజవ్వ. దాంతో రామక్కకు తల్లిపేగు కదిలి ఎప్పటివో జ్ఞాపకాలు, పెనిమిటి బతికి వున్నప్పటి జ్ఞాపకాలు, ఇలా కథ గతంలోకి వెళ్తుంది. భర్త చనిపోయాక కొడుకును పెంచే బరువు బాధ్యత రామక్కమీద పడింది. అప్పటి నుండి మొదలయ్యింది కార్మిక బతుకు. బీడీల తయారీ స్త్రీల ఉపాధిగా

మారి తెలంగాణ ప్రజల జీవనాధారంగా ఎలా మారిందో రామక్క కథలో చిత్రించారు.

రచయిత తల్లి లక్ష్మి రాజు కూడా తన పిల్లలను పెంచిపోషించడానికి బీడీలను జీవనాధారంగా చేసుకుంది. ఈ జీవిత పరిణామాన్ని రామక్క పాత్ర జీవితంగా చిత్రించారు. తాను పని చేసుకుంటూ వుంటే కొడుకు బడికి వెళ్ళాడో లేదో తెలియదు. ఆ కాలంలో స్కూళ్ళలో పిల్లలను కొట్టేవారు. దెబ్బలకు భయపడి పిల్లలు బడి ఎగ్గొట్టేవారు. ఇలా చాలామంది పిల్లలు చదువు మధ్యలోనే ఆపేసేవారు. ఏదో ఒక కూలిపనిలో సెటిలయ్యే వారు. అలాగే రామక్క కొడుకు కూడా చదువు మానేసి షావుకారి వద్ద జీతానికి వుంచితే చిన్నవాడిమీద దొంగతనం మోపారు. దాంతో ఆ అవమానం భరించలేక రామక్క కొడుకును కొడుతుంది. అలా దెబ్బలు తిన్న కొడుకు యీ బాధలు భరించలేక బొంబాయి పారిపోయాడు. ఈ ప్రాంతంలో ఎవరైనా తల్లిదండ్రుల మీద అలిగి పారిపోతే బొంబాయికే పోయి వుంటారని, బొంబాయిలో తమ ప్రాంతం వాళ్ళు ఉండే చోట వెతుకుతారు. అంతగా యీ ప్రాంతం నుండి బొంబాయికి వలసలు సాగేవి. బొంబాయి వారి జీవితాల్లో కలిసిపోయింది.[5]

పారిపోయిన రామక్క కొడుకు తిరిగిరాలేదు. ఈ రామక్క కొడుకు గురించిన జ్ఞాపకాలు రాస్తున్నప్పుడు ఎన్నోసార్లు రచయిత ఏడ్చేశారు. ఎందుకంటే ఆ పాత్ర రచయిత సొంత అన్నదే. అతడు 1974 సం॥లో చనిపోయారు. ఆయన చనిపోయిన క్రమందాకా సాగిన పరిణామాలు, సమాజం రచయిత అన్న జీవితాన్ని నాశనం చేయడానికి ఎలా పరిణామాలను సృష్టించాయో చారిత్రక భౌతికవాద కోణంలో అర్థం చేసుకున్నారు.

పారిశ్రామిక రంగం, పల్లెల్లోని అమాయకత్వం, స్కూళ్ళలోని టీచర్ల దండనలు, కష్టపడి పేదరికం నుండి కొడుకులను బయటికి తీసుకురావాలి అనే తల్లి ఆశను, అసూయతో చెడగొట్టే బంధువర్గం ఇవన్నీ కలిసి రచయిత అన్న జీవితాన్ని బలి తీసుకొన్నాయి. ముందే చెప్పినట్టు రామక్క పాత్రలో నాయకురాలి లక్షణాలు రచయిత తల్లివి కావు. మొదట తల్లిపాత్రను లచ్చిరాజు పాత్రలో చిత్రించారు. అయితే లచ్చిరాజుకు నారాయణ అనే ఒకే కొడుకు ఉన్నట్టు రాశారు. కానీరచయిత తల్లికి ముగ్గురు పిల్లలు. నవలను బీడీ కార్మికుల జీవన విధానాన్ని పరిచయం చేయడానికి పరిమితమై రాయాలనుకున్నారు. మల్టిపుల్ ఛాప్టర్‌ల ద్వారా యీ నవలను రాయలేదు.

రచయిత కన్యాశుల్కం నాటకాన్ని విస్తరించినట్టు 'బతుకుపోరు' నవలను రెండో ముద్రణలో విస్తరించాలనుకున్నారు.[6] కానీ రచయిత ఉద్యోగం వదలి విప్లవోద్యమంలోకి వెళ్ళిపోవడంతో అది జరగలేదు. నిజజీవితంలో లచ్చిరాజుకు



ముగ్గురు కొడుకులు. పెద్దకొడుకుని రామక్క కొడుకుగా యీ నవలలో చిత్రించారు. నారాయణ పాత్ర రచయితది కానప్పటికి ఇతను లచ్చిరాజు రెండవ కుమారుడు. లచ్చిరాజు మూడవ కుమారుడి పాత్ర నవలకు పెద్దగా అవసరం లేదు. రామక్క దుః ఖం లచ్చిరాజు అవ్వ దుఃఖం రెండూ ఒక్కటే. వారి జీవితాలు భిన్నంగా ఏమీ లేవు. ఇలా వాస్తవ జీవితం సామాజిక వాస్తవికతలో కథల్లో, నవలల్లో రూపాంతరం చెందుతూ వుంటుంది.

కథ ప్రారంభంలో ఉన్న లక్ష్మి పిల్లల సంఘటన రామక్క జీవితంలో కూడా రిపీట్ అవుతుంది. రామక్క ఊడుస్తుంటే కొడుకు "అవ్వ నేను ఊడుస్తనే" అని వచ్చేవాడు.

రామక్క "వద్దు బిడ్డా వద్దు" అనేది.

కొడుకు తల్లితో పాటే నిద్రలేచే వాడు. తల్లికి పనిలో సహకరించేవాడు. తల్లి చదువుకోమని చెప్పేది.[7]

ఆ కాలంలో పిల్లలు, తల్లిదండ్రులకు అన్ని పనుల్లో చేదోడు వాదోడుగా ఉండేవారు. తల్లిని గౌరవించేవారు. విద్యావిధానంలోనూ, ఉపాధ్యాయుల్లోనూ ఉన్న అనేక లోపాల వల్ల యీ పిల్లల్లో చాలా మంది చదువు పట్ల విముఖత పెంచుకొని చదువు మానేశారు.

రామక్క కొడుకు నర్సన్న పాత్ర 'బతుకుపోరు' నవలలో సమగ్రంగా లేదు. వీరి పాత్రను గురించి.. 23 ఏళ్ళ తర్వాత రాసిన 'చదువు' కథలో ఆ పాత్రను తిరిగి సృష్టించి న్యాయం చేసే ప్రయత్నం చేసినట్లుగా కనిపిస్తుంది. ఒక వ్యక్తికి సమాజం సహకరించి వుంటే చదువు మానేసినా ఎలా ఎదిగి వుండేవాడో, ఎలా ఎదిగే అవకాశం ఉండేదో? అనే విషయం 'చదువు' కథలో ఒక పాత్ర తెలియజేస్తుంది. నర్సన్న పాత్రకు ఇది మరో కోణం.[8]

ఇలా 'బతుకుపోరు' నవలలోని అన్నీ సజీవమైన పాత్రలే. సామాజిక పాత్రలే.

'బతుకుపోరు' నవల మూడవ ముద్రణలో యీ నవలలోని పాత్రలు ఆ తర్వాత ఎలా వున్నారో గోర్కీ 'అమ్మ' నవలలాగా రచయిత రాద్దామనుకున్నారు కానీ యీ నవలకన్నా ఆ పాత్రల పరిణామాలు ఎన్నో రెట్లు ఎక్కువ. సమతుల్యం చెడిపోతుంది అని అనిపించి రాయడం మానేశానని రచయిత తెలిపారు.[9]

ఉదాహరణకు లక్ష్మి మరిది ఎమ్‌బిబిఎస్ పూర్తయ్యాక లక్ష్మి కుటుంబంలో వచ్చే మార్పులతో చిత్రించే జీవితం దానికదే ఒక నవల అవుతుంది.

అలాగే నారాయణగానీ, శంకర్‌గానీ, విప్లవ కార్యకర్తగా పనిచేసే వారి జీవితాలు మరో నవల అవుతుంది.

శేఖర్ జీవితం అదొక కథ అవుతుంది.

ఒక ఫొటోలో బంధించిన మనుషుల చిత్రాలు అలాగే ఉండిపోతాయి కానీ వారి జీవితాలు ముందుకు సాగిపోతూనే ఉంటాయి. పాతఫొటోలను, కొత్తఫొటోలను, రెండు ఒక్కటే అని గుర్తుపట్టలేని విధంగా మారిపోతుంటాయి. అందువల్ల 'బతుకుపోరు' నవలలోవీరి గురించి సంక్షిప్తంగానైనా రచయిత ఇందులో చేర్చలేదు.

ఉద్యమకారులుగా రచయిత ఆలోచించిన తీరుకూడా రచనా శిల్పంలో అడుగడుగున కనపడుతుంది. నవల చివరి వాక్యాన్ని ఇలా రాశారు. "ఆ ఇద్దరు చీకటి కడుపులో చిచ్చురగిల్చే వెలుతురు బాణాల్లా ముందుకు సాగిపోతున్నారు" అని నవల ముగుస్తుంది.

కానీ యీ వాక్యానికన్నా పైన వాక్యం ఒకటుంది. దాంతో కూడా ముగించవచ్చు. అది అర్థవంతమైన ముగింపు కూడా. పైన ఉన్న వాక్యాన్ని చివరి వాక్యంగా చేర్చితే నవల ఇలా ముగుస్తుంది.

"గుమ్మంలోకి వచ్చి తమ కలలు ఎప్పుడు పండుతాయో అని ఆలోచిస్తూ వెళ్తున్న ఇద్దరిని చూస్తూ నిల్చుంది సుగుణ."[10]

ఈ వాక్యాలు మార్చలేదు. ఉన్న వాక్యాల్లోనే ఒక వాక్యం అటూఇటూ జరిపితే శిల్పంలో ఎంతోతేడా వస్తుంది.

కానీ ఉద్యమం చేయడమే అవసరం, దానికి భూమికను అందించడమే అవసరం అని అనుకోవడం వల్ల "వెలుతురు బాణాల్లా ముందుకు సాగిపోతున్నారని" రచయిత ముగించారనేది స్పష్టం.

జీవితాలను మెరుగుపరచుకోవటానికి ఉద్యమం చేయడమే తక్షణ అవసరమని ఆ కాలంలో రచయితలు, ఉద్యమకారులు భావించారు. ఆ ఆలోచనా దృక్పథంలో భాగంగానే యీ ముగింపు వచ్చింది. ఆ కాలంలో రాసిన నవలలకు అన్నింటికి ఇలాంటి ముగింపులే ఉంటాయి.

అప్పటి రచయిత దృక్పథం 'బతుకుపోరు' రచనా శిల్పాన్ని నిర్ణయించింది.



# బతుకుపోరు నవలలో పాత్రల చిత్రణ

"ఇతివృత్తమందలి పాత్రలలో రచయిత తాను సృష్టించబోయే పాత్రలకు ఆకృతిని, నిర్మాణాన్ని ఇచ్చే విధానాన్ని 'పాత్ర' అంటారు. దీన్నే పాత్ర సృష్టి, పాత్ర పోషణ అంటారు. రచయిత భావాలను, రచనా శిల్పాన్ని తెలుసుకోవడానికి రచయిత చిత్రించిన పాత్రలను పరిశీలించవలసి వుంది. రచనలో "కథా గమనమందలి వివిధ సన్నివేశములలో ఆయా పాత్రముల మనఃప్రవృత్తులలో గలుగు క్రమోన్మీలమును పూర్వాపద సందర్భముగా ప్రవచించి నిరూపించుట పాత్ర పోషణ."[11] అని పేర్కొన్నారు.

## లక్ష్మి

బతుకుపోరు నవలలో ముఖ్యపాత్ర లక్ష్మి. ఈ పాత్రకోణం నుంచే నవల మొత్తం సాగుతుంది. ఇది ప్రోటొగామిస్ట్ పాత్ర. ఏ పాత్ర కోణం నుంచి కథ నడుస్తుందో ఆ పాత్రను ప్రోటొగామిస్ట్ పాత్ర అని అంటారు.

లక్ష్మి బీడి ఫ్యాక్టరీలో పని చేసే కార్మికురాలు. స్త్రీలు ఉదయం లేచిన దగ్గర్నుంచి రాత్రి పడుకునే వరకు నిరంతరం కుటుంబంలో, సమాజంలో నిర్వర్తించే పాత్రను, చేసే శ్రమను లక్ష్మి కుటుంబం, జీవితం వ్యక్తపరుస్తుంది.

లక్ష్మి భర్త రాజయ్య దుకాణంలో గుమాస్తా. వీరికి ముగ్గురు సంతానం. పెద్దకొడుకు శ్రీనివాసు, తర్వాత అమ్మాయి సరస్వతి, చిన్న కొడుకు నాని. తల్లికి ఇంటిపనులలో పెద్ద కొడుకు శ్రీనివాసు సహాయం చేస్తుంటాడు. శ్రీను, సరస్వతిని బడికి పంపిన తర్వాత చిన్న కొడుకు నానికి పాలు ఇచ్చి, తాను అన్నం తిని పనికి వెల్తుంది. చాలీచాలని జీవితాలను మెరుగుపరచుకోవడానికి అహర్నిశలు శ్రమించే మనస్తత్వం లక్ష్మిది. కేవలం కుటుంబం గురించేగాక పొరుగువారు సంతోషంగా ఉండాలనే ఆరాటం.

సుగుణ, పెళ్ళిగురించి, కట్నకానుకల గురించిన చర్చ, సంభాషణ లక్ష్మి వ్యక్తిత్వాన్ని తెలుపుతాయి.

లక్ష్మి "ఓర్నీ! బీడీల కంపిన్ల నౌకర్లగ్గూడ గంతగంత కట్నాలు గావాల్నా! ఇంక నాల్గువేలు ఎక్కాపోస్తే సర్కారు నౌకరోడు దొరకడా"[12] అంటుంది. లక్ష్మి మాటల్లో ఈర్ష్య లేదు. అసూయలేదు. కోపం లేదు. ఇంకో రూపాయి ఎక్కువ పెడ్తే యింకా మంచి సరుకు దొరకదా అన్నట్టుగా చాలా సాదా, సీదాగా అంది.

లక్ష్మి తన కుటుంబ జీవితం గురించి బాధపడుతూ సుగుణతో "నువు సూత్తలేవ నా సంసారం. పోరగాన్లు, బొట్టెగాన్లు, వండుకునుడు, తినుడు, తానాలుజేసుడు, చేపిచ్చుడు, పోరగాన్లను బడికి పంపుడు అందరి బట్టలుతుకుడు, ఊడ్సుడు, అలుకుజల్లుడు, ముగ్గులేసుడు, ఆగ్గత్తిరిచ్చుడు, బీడీలు జేసుడు, పొద్దుగాల లేసి మొదలువెడ్తె రాత్రి దాక తీరనేతీరదాయె. రికాంలేని బతుకు. పని చేసి చేసి బొక్కలన్ని తెల్లవడవట్టె కాట్లె వడ్తెనే రికాం యీ బతుక్కు"[13] అని కళ్ళలోకి ఉబికిన కన్నీరు లోపలికే లాక్కుని కొంగుతో కళ్ళొత్తుకుంటూ బాధ పడింది.

లక్ష్మి నారాయణతో "బియ్యే జదివితివి. దుకాణం బెడ్తనంటె ఏ ఆసామి నమ్మడా! నమ్మకపోతే నీకు నా రెండు తులాల ఈ తీగ యిస్త కుదువవెట్టుకో! మల్ల ఎల్లినపుడు యిడిపిచ్చి యియ్యి....."[14] అనే మాటలతో లక్ష్మి ఉదార స్వభావం తెలుస్తుంది. సుగుణకు పెళ్ళి కుదురాలనే ఆరాటంలో నారాయణతో చొరవగా మాట్లాడుతుంది.

లక్ష్మికి అందరి పిల్లల్లా తన పిల్లల్ని కూడా ఎంతో బాగా ముస్తాబు చేయాలని మనసులో ఎంత వున్నా తీరని పనిలో అది తీరని కోరికైనందుకు బాధపడుతుంది. "పాపం పోరగాన్లు" అని తల్లి మనసు విలవిల్లాడింది. పెద్దకొడుకు శ్రీను చొక్కా చినిగిందని, కొత్త చొక్కా కుట్టించమని తల్లిని అడుగుతాడు. లక్ష్మి బాధపడుతూ ఈసారి జీతాలు ఇచ్చినపుడు కుట్టిస్తాను అంటూ కొడుక్కి సర్ది చెప్తుంది. లక్ష్మి లోకజ్ఞానం తెలిసిన స్త్రీ. మరిదిని తమ కొడుకుగా భావించి అరకొర సంపాదనతో ఎం.బి.బి.ఎస్. చదివిస్తుంది.

ఫ్యాక్టరీ బందు చేయాలని ప్రయత్నించిన వారిలో లక్ష్మి కూడా ముఖ్యమైన నాయకురాలు. లక్ష్మి బీడీ ఫ్యాక్టరీలలో పని చేసే కార్మికుల ఇంటికి వెళ్ళి వారికి బీడీ కార్మికుల సమస్యలను గురించి తెలియజేస్తుంది. అందరితో మన సమస్యలను మనమే పరిష్కరించుకుందాము అని, కార్మికులు అందరి ఆలోచనా విధానంలో మార్పులు తీసుకురావడానికి ప్రయత్నించింది.

రచయిత స్త్రీ కార్మిక కుటుంబాల గురించి, ఆయా కుటుంబాలకు సమాజంతో గల సంబంధాలు స్త్రీల దృష్టికోణంతో తెలంగాణా ప్రజాజీవన స్థితిగతులను యీ నవలలో చిత్రించారు.



### నారాయణ

బతుకుపోరు నవలలో ఒక ప్రముఖ పాత్ర నారాయణది. నారాయణ బి.ఎ. వరకు చదివాడు. బి.ఎ. ఫెయిలై ఏ ఉద్యోగం దొరకక బీడీ ఫ్యాక్టరీలో కార్మికుడుగా పనిచేస్తుంటాడు. ఫ్యాక్టరీలో పనిచేసేవారిలో ఎక్కువ చదివిన వ్యక్తి నారాయణ.

నారాయణ తల్లి, లచ్చిరాజవ్వకు ఒక్కగానొక్క కొడుకు. నారాయణకు చిన్నతంలోనే తండ్రి చనిపోయాడు. లచ్చిరాజవ్వ రెక్కలు ముక్కలు చేసుకుని బీడీలు చేసి నారాయణను చదివించింది. బీడీలు చేసి చేసి తల్లి అనారోగ్యం పాలైంది.

నారాయణ బీడీ ఫ్యాక్టరీలో పనిచేస్తూ పరీక్ష ఫీజుకు డబ్బులు కట్టాలని ఆలోచిస్తూ వుంటాడు. దాదా ఇంటికి వెళ్లేటపుడు జీతాలు తీసుకెళ్లండని ఆదేశిస్తాడు. నారాయణ రెండువందల ముప్పయి రూపాయలకు రెవెన్యూ స్టాంపుపై ఆక్సిటెన్సు రోలులో సంతకం పెట్టాడు. దాదా నూటయాభై రూపాయలు తీసి చేతికివ్వబోయాడు. నారాయణ అన్యాయాన్ని సహించలేక దాదాను ఎదిరించి మాట్లాడతాడు.

జీతం తక్కువిచ్చే దాదాను "మేం ఆదివారం పనిజేస్తే, పండుగలనాడు పనిజేత్తే, కమీషన్‌దార్లకు తంబాకు జోకితే, చెన్నీలు మోస్తే ఏమన్నా జీతం గిట్టఎక్కో యిత్తున్నవ" అని నిలదీస్తాడు. ఈ నవలలో యాజమాన్యంపై ఎదురు తిరిగిన మొదటివ్యక్తి నారాయణ.

శ్రమదోపిడీ గురించి "రాత్రనక పగలనక పదిహేనుమంది జేసేపని పదిమందిమే జెయ్యవడితిమి" అని దాదాను నిలదీసిన తీరుచూస్తే నారాయణకు గల తెగువ స్పష్టం అవుతుంది.[15]

నారాయణ ద్వారా బీడీ కంపెనీల్లో జరిగే శ్రమదోపిడీని అందరూ గుర్తించేలా చేశాడు రచయిత. వాళ్ళకు జరుగుతున్న అన్యాయాన్ని ప్రజలు ఎదురు తిరిగేలా నారాయణను స్ఫూర్తిగా నిలిపారు. దాదాను నిలదీయడంతో ఆపక నారాయణ "నేను తలుసుకుంటినంటె లేబరాఫీసరును తోల్కచ్చి నీ దొంగలెక్కలు ఓవర్‌టైం ముంగటేపిత్త. గప్పుడు తెలుస్తది. నువ్వురోజు పన్నెండుగంటలు పనిజేపిచ్చేది" అని మరింత తెగువతో అంటాడు. ప్రజలు వాళ్ళకు జరిగే అన్యాయాన్ని ఎదిరించడానికి నారాయణే స్ఫూర్తి. నారాయణ దాదా చేస్తున్న అన్యాయాన్ని ఎదిరించి దాదాను గళ్ళపట్టి కొట్టబోవడాన్ని బట్టి మార్పురావాలంటే ఇలాంటివే తప్పనిసరి అని అన్పిస్తాయి. ఈ తిరుగుబాటు తత్వంలో రచయిత జీవితంలో జరిగిన సంఘటననే చిత్రించారు.

నారాయణకు పెళ్లిజేయ్యాలని తల్లి పెళ్లిచూపులకు వెళ్లి సుగుణను చూసివస్తుంది. సుగుణ పేదకుటుంబానికి చెందిన సాధారణ యువతి. సుగుణ తండ్రి పక్షవాతంతో మంచానపడ్డాడు. సుగుణ అన్న కాలేజీలో చదువుతుంటాడు. సుగుణ అందగత్తె కాకపోయినా "వయసువస్తే వంకలన్నీ తీరుతాయి" అన్నట్టు సంసారపక్షంగా ఆకర్షణీయంగానే ఉంటుంది. ఈ సందర్భంగా నవలలో రచయిత పెళ్లి సంబంధాలు, తెలంగాణా సాంప్రదాయాల గురించి తెలియజేశారు.

నారాయణకు సుగుణ అంటే వ్యతిరేకత ఏమీ లేదు కాని నిరుద్యోగికి ఇప్పుడే పెళ్ళి ఎందుకని పెళ్ళి వాయిదా వేస్తాడు. అదేమాట లక్ష్మితో చెప్తాడు. నారాయణ బీడీకార్మికుల సమ్మెలో అందరితో కలిసి పనిచేశాడు. ఉద్యమం కోసం పోస్టర్లు రాసుకుని అతికించడం కోసం వెళ్ళడంతో నవల ముగుస్తుంది. ఇలా బతుకులోని పోరు వ్యక్తిగతం నుండి మొదలై సామాజికశక్తిగా సామూహికశక్తిగా పరిణామం చెందడం నారాయణ పాత్రలో చూడవచ్చు.

బీడీ కార్మికులు సమ్మె ఉధృతం చేస్తుంటే నారాయణ ఎర్రసిరాతో పోస్టర్లు రాస్తున్నాడు. లక్ష్మి నారాయణ 'లై' డబ్బా పట్టుకొని నడుస్తుంటే, నారాయణ పోస్టర్లు ఒక చేత్తో పట్టుకొని, రంగుడబ్బా మరోచేత పట్టుకొని అనుసరించాడు.

గుమ్మంలోకి వచ్చి 'తమ కలలు ఎప్పుడు పండుతాయో' అని ఆలోచిస్తూ వెళ్తున్న యిద్దర్నీ చూస్తూ నిల్చుంది సుగుణ.

నారాయణ చేతిలో ఎర్ర అక్షరాలున్న పోస్టర్లు చిరుగాలికి తరగలించడం సుగుణ చూసింది.

ఆ యిద్దరూ చీకటి కడుపులో చిచ్చురగిల్చే వెలుతురు బాణాల్లో ముందుకు సాగిపోతున్నారు.[16]

**సుగుణ**

సుగుణ పేద మధ్యతరగతి కుటుంబానికి చెందిన సాధారణ యువతి. సుగుణకు యింకా పెళ్లి కాలేదు. తల్లిదండ్రులు సుగుణను అయిదో తరగతో, ఆరో తరగతో చదివిన తర్వాత చదువు మాన్పించారు. సుగుణ బడికిపోతున్నప్పటి నుండే తల్లికి ఆసరాగా ఆకు కత్తిరించడం, బీడీలు దారం కట్టడంవంటి పనులు నేర్చుకుంది. చదువు మానేసిన తర్వాత బీడీకంపెనీలో చేరింది. సుగుణ కంపెనీలో ఇచ్చే జీతంలో కొంత తన చిల్లర ఖర్చుల కోసం ఉంచుకొని మిగిలిన డబ్బులు తల్లిదండ్రులకు ఇస్తుంది.



సుగుణ తల్లి బీడీఫ్యాక్టరీలో కార్మికురాలు. తండ్రి పక్షవాతంతో మంచానపడ్డాడు. సుగుణ అన్న కాలేజీలో చదువుతుంటాడు. సుగుణ పెళ్లి తల్లిదండ్రులకు గుండెలమీద కుంపటిలా ఉంది. పెళ్ళిచేసి ఎప్పుడు ఆ గుండెలమీంచి కుంపటి దించుకుందామా అనే చింతవారికి. సుగుణ బాధ, కష్టము అంటే ఏమిటో తెలియని పిల్లలా నవ్వుతూ మాట్లాడుతూ ఉంటుంది.

సుగుణను చూసి "సుగుణ మంచి అందగత్తె కాకపోయినా సంసారపక్షంగా ఆకర్షణీయంగానే ఉంటుంది. వయసువస్తే వంకలన్నీ తీరుతాయి అన్నట్టు సుగుణకు పెళ్లికూతురుకు ఉండవలసిన లక్షణాలన్నీ ఉన్నాయి. పెళ్ళెపుడు కుదురుతుందో" అని లక్ష్మి అనుకుంటుంది.

సుగుణను పెళ్లిచూపులు చూడటానికి వచ్చినవారు ఆరువేల కట్నం, ఒక సైకిలు, ఒక గడియారం కట్నకానుకలుగా ఇవ్వాలని కోరతారు. సుగుణ తల్లిదండ్రులు నారాయణ బుద్ధిమంతుడు అని తెలుసుకొని సుగుణను నారాయణకు ఇచ్చి వివాహం చేయాలనుకుంటారు.

నారాయణ బి.ఎ. ఫెయిలై ఏ ఉద్యోగం దొరకక బీడీ ఫ్యాక్టరీలో కార్మికుడిగా పనిచేస్తుంటాడు. తల్లి లచ్చిరాజవ్వకు ఒక్కగానొక్క కొడుకు. నారాయణ తండ్రి చిన్నతనంలోనే చనిపోయాడు. తల్లి బీడీలు చేసి నారాయణను చదివించింది. ఫ్యాక్టరీలో పనిచేసే కార్మికులలో ఎక్కువ చదివిన వ్యక్తి నారాయణ. అన్యాయాన్ని సహించే మనిషి కాదు నారాయణ. అందుకే జీతాలు ఇచ్చే సమయంలో జీతం కోసినపుడు దాదాను ఎదిరించిన సాహసవంతుడు. బీడీ కార్మికులకు జరుగుతున్న అన్యాయాన్ని ప్రజలు తెలుసుకొని తిరగబడేలా కార్మికులు అందరికి స్ఫూర్తిగా నిలిచాడు.

లక్ష్మి "మొన్న పెళ్లిచూపులు చూసిపోయినోల్లు ఏమన్నరు?" అని సుగుణను అడిగింది.

సుగుణ "పిల్లమంచిగనే ఉన్నది గని ఆరువేల కట్నం, ఒక సైకిలు, ఒక గడియారం గావాలె అని అన్నారట, నాయిన్న మునలోడైపాయె, కాళ్లెయ్యి వడిపాయె.... అన్న యింకా కాలేజీల్నే సదువవట్టె. అవ్వ, నేను బీడీలు జేత్తే తిండికే గాట్టే. ఏడున్నయి గన్ని పైసలు. నా దగ్గర ఎల్లయి అన్నడు నాయన్న..."[17] అంది.

సుగుణ మాటల్లో పెళ్లికూతురుకు వుండే సిగ్గు, భయం లేదు, దుఃఖం, సంతోషం లేదు. ఏదో వ్యవహారంలాగ ఏదో కుదరని బేరంలాగా ఉంది.

సుగుణ తల్లిదండ్రులు ఇంట్లో ముచ్చటించుకున్న విషయం గురించి "అన్నపు కర్సు, ఇయ్యపురాన్ల వాయనం, పదారుపండుగ, దీలెకట్నాలు అన్నీ గలిపి

ఆల్లుజెప్పినట్టుయింటె పన్నెండువేలదాక అయితయని నాయిన్న అన్నడు"[18] అని లక్ష్మీతో అంటుంది.

లక్ష్మి స్త్రీ సహజమైన బాధతో కోపంగా "పోరగాన్లకు డిమాండు బాగా పెరిగింది. ఏమిట్లకు అక్కరకు రానోడుగూడ వేలకువేలు అడుగవట్టె. "గుంటెడు జాగుండది గుడిసెకు కప్పుండదిగని వేలకువేలు కావాలె కట్నాలు! ఏడికెల్లి తెచ్చిపోత్తరనుకుంటరో, మరి ఆడు అంతగనం సంపాదించి ఎన్ని మిగిలిచ్చిండట? ఏమన్న కూసుండవెట్టి తినవెట్టడా గంతగనం కట్నం దీసుకోని?" అని నిష్ఠూరంగా మాట్లాడుతుంది.

సుగుణ లక్ష్మీతో కలిసి యిల్లిల్లు తిరిగి ఫ్యాక్టరీ కార్మికులను బందుచేయమని కోరుతూ తానుకూడా ఉద్యమంలో పాల్గొంటుంది.

రచయిత సుగుణ పాత్ర ద్వారా నేటి సమాజంలో ఆడపిల్లలు స్వశక్తిమీద ఆధారపడి బతుకుతున్నారని తెలియజెప్పాడు. అలాగే వరకట్నం నానాటికి ఎలా గుర్రమెక్కుతుందో వ్యక్తపరిచాడు.

**రామక్క**

ఈ నవలలో రామక్క మరో ముఖ్య పాత్రధారి. బీడీ ఫ్యాక్టరీలో పనిచేసే కార్మికురాలు. రామక్కకు భర్త మరణించాడు. అందువల్ల రామక్క కుటుంబ భారాన్ని మోయవలసి వస్తుంది. ఈమెకు ఒక్కగానొక్క కొడుకు. కొడుకును చదివించాలని బీడీ ఫ్యాక్టరీలో పనికి చేరుతుంది. కొడుక్కి చదువు రాకపోవటంతో దుకాణంలో నౌకరిగా చేరాడు. రామక్కకు షావుకారి తన కొడుకు దొంగతనం చేశాడని చెప్పడంతో రామక్క కోపంతో కొడుకుని కొడుతుంది. కొడుకు యీ బాధలు భరించలేక యిల్లు విడిచి వెళ్లిపోయాడు. రామక్క ఒంటరి జీవితాన్ని గడుపుతుంది. తన కొడుకు ఎప్పటికైనా తిరిగివస్తాడని ఎదురుచూస్తూ కాలం గడుపుతుంది.

రామక్క ఎంతో ధైర్యవంతురాలు. ఆమె బీడీకంపెలో ఆడవాళ్లందరికి నాయకురాలు లాంటిది. రామక్క బీడీ ఫ్యాక్టరీలో జీతాలు ఇచ్చే రోజు జీతం తీసుకోకుండా ఎదిరించి మాట్లాడుతుంది. ఏజెంటు రాజేశం పాతఫారం లెక్కలు చూస్తాడు. రామక్కతో పన్నెండువేల బీడీలకు ఎనుబది నాలుగు రూపాయలు లీవ్ విత్ వేజెస్, బోనస్ కలుపుకుని అక్విటెన్సు రోలుపై వేలిముద్ర వేయించుకుంటాడు. రామక్కకు పైసలు తగ్గించి ఇస్తాడు.

రామక్క "పగిలిపోయిన ఆకులు, దొడ్డు ఆకులు, సాధేచేసొగ్రాంకు వెయ్యి ఆకెల్లదని అన్నోడెవడు? అని మొల్దారం దెంప?" అని ఏజెంటుతో కోపంగా



మాట్లాడుతుంది.

రామక్క బీడీ కార్మికులందరితో "అరేయి పోరగాన్లార! ఎవలు పైసలు తీసుకోకుర్రి. యియ్యాల ఎవలు ఆకు నానపెట్టుకోకుండ్రి, రేపు కంపెనీ బందుపెట్టాలే, ఊకున్నాకొద్ది లాడైపోయిన్రు. బీడీ పట్టి ఉంటే దాదానే ఈడికత్తడు రేపు, ఎవలు జెయ్యొద్దు రేపు. రెక్కలన్నివోంగ తెల్లందాక కట్టపడి మందిబొందల మీద పెట్టుడెందుకె? బందుందాం రేపు. యింటికాడ ఏమన్న పనులుంటే జేసుకోన్రి. బియ్యం గియ్యం అన్ని చేసిపెట్టుకోన్రి. పైసలుంటే మంచిగ సీనిమ్మలకు గూడ వోన్రి. ఏందె ఒకరోజన్నా సెలవుండద్దా. రేపు సెలవనుకోన్రి, ఎల్లుండి సంగతి ఎనుకసీరి చూద్దాం" అంది.

ఒకరోజు రామక్కకు హఠాత్తుగా మెలకువ వచ్చింది. పారిపోయిన కొడుకు తిరిగిరాలేదు. నిద్రలోంచి లేచి కళ్లు నలుముకుంది. పక్కింటి రాజవ్వ ఏడుపు వినిపించింది. కడుపులో పేగులు తెగిపోయేటట్టుగా తెరలు తెరలుగా ఏడుస్తుంది రాజవ్వ. అప్పుడు రామక్కకు ఎప్పటివో జ్ఞాపకాలు గుర్తుకు వచ్చి బాధపడుతుంది.

రామక్క మాటకారితనం వల్లనే ఆడవాళ్ళందరు బీడీకంపెనీ యాజమాన్యంపై, ఏజెంట్లపై కూలీరేట్లు పెరగాలని, వసతులు, సౌకర్యాలు కావాలని సమ్మె చేయడానికి అందరు సమాయత్తమవుతారు. బీడీకార్మికులు అందరూ సమ్మెచేద్దామని నిర్ణయించుకొని అందరు కలిసి ఊరేగింపుగా ముందుకు కదులుతారు. రామక్క యిల్లిల్లూ తిరిగి కంపెనీ బందుపెట్టమని చెప్తుంది. బీడీకార్మికుల సభ ఉందని, ఊరేగింపు చేయాలని తమ సమస్యలను గురించి తెలియజేస్తూ మన సమస్యలను అట్టమీద రాసి చేతిలో పట్టుకోవాలని, పేపర్లు పంచాలని అందరికి చెప్పింది.

స్త్రీల జీవితం సంస్కృతి, ఆలోచనా విధానం, స్త్రీల భాష, అభివ్యక్తి, ఆశలు, ఆరాటాలు జీవితమంత వాస్తవికంగా చిత్రించిన నవల ఇది.

ఈ నవలలో రామక్క కొడుకు పాత్ర రచయిత సొంత అన్న పాత్ర. రచయిత అన్న 1974 సం॥లో చనిపోయారు. ఆయన చనిపోయిన క్రమందాకా సాగిన పరిణామాలు, సమాజం రచయిత అన్న జీవితాన్ని నాశనం చేయడానికి ఎలా ముందుకు వచ్చాయో చిత్రించారు.

**రాజయ్య**

రాజయ్య దుకాణంలో గుమాస్తా. రాజయ్య భార్య లక్ష్మి, బీడీ కంపెనీలో కార్మికురాలు. వీరికి ముగ్గురు పిల్లలు. పెద్దకొడుకు శ్రీనివాసు, రెండవ సంతానం సరస్వతి, చిన్నకొడుకు నాని.

రాజయ్య సేటు బాకీలు వసూలు చేసుకురమ్మన్నాడని తెల్లవారు జామునే నిద్రలేచి పక్క ఊరికి వెళ్తాడు. వసూళ్ళకు పోయి వచ్చిన రాజయ్య ముఖం పీక్కుపోయింది. చడీచప్పుడు చేయకుండా మంచంలో పడుకొన్నాడు. లక్ష్మి పళ్ళెం కడిగి అన్నం పెట్టింది. రాజయ్య తాను వసూలుకు వెళ్ళిన మాదాపురంలో జరిగిన సంఘటన గురించి లక్ష్మికి వివరిస్తాడు. రాజయ్య పెద్దవ్వ కొడుకు వెంకటరాజంను పోలీసులు కాల్చి చంపారు. వెంకటరాజం రైతుకూలి సంగాలు పెట్టి కూలీలు పెంచాలని పోరాటాలు చేపిస్తున్నాడని పోలీసులే చంపేశారని లక్ష్మికి చెప్పి బాధపడతాడు. రాజయ్యకు ఆ సంఘటన మళ్ళీ గుర్తుకు వచ్చి అన్నం మధ్యలోనే చెయ్యి కడిగి లేచాడు. రాజయ్య వసూలు చేసిన డబ్బులు సేటుకు అప్పజెప్పాలని మళ్ళీ దుకాణానికి వెళ్ళిపోతాడు.

రాజయ్య గుమాస్తాల సంగం ఎలక్షన్లు పెట్టుకున్నామని, తనను కోశాదికారిగా పెట్టుకున్నారని, తాము కూడా సమ్మె జేస్తాం అని లక్ష్మితో చెప్తాడు. రాత్రి లక్ష్మికి బీడీలకు దారం కడతాడు.

### శ్రీనివాసు

లక్ష్మి, రాజయ్య దంపతులకు శ్రీనివాసు పెద్దకొడుకు. ఉదయాన్నే నిద్రలేచి తల్లికి ఇంటిపనులలో సహాయం చేస్తుంటాడు. తల్లికి పనులు చేసినందుకు (కమిషన్) డబ్బులు తీసుకుంటాడు. తమ్ముడు నానిని ఎత్తుకొని ఆడిస్తుంటాడు. శ్రీనివాసు తల్లిని కొత్తచొక్కా కట్టించమంటే తల్లి బీడీ కంపెనీలో జీతం ఇస్తే కుట్టిస్తాను అని చెప్తుంది. శ్రీనివాసు కొత్త చొక్కా కుట్టించమని, రొట్టెలు, చాయ, బిస్కట్లు, ఎక్కాల పుస్తకం వంటివి కావాలని చిన్న చిన్న కోరికలు కోరుతూ వుంటాడు.

### సరస్వతి

రాజయ్య, లక్ష్మి దంపతులకు రెండవ సంతానం సరస్వతి. సరస్వతి అన్న శ్రీనివాసు చేసే పనులన్ని తాను కూడా చెయ్యాలని ఉత్సాహంగా వుంటుంది. తల్లి నువ్వు కూడా అన్న వయసు వచ్చాక చెద్దూగాన్లే అని సరస్వతికి నచ్చజెబుతుంది.

### నాని

లక్ష్మి, రాజయ్య దంపతులకు చివరి సంతానం నాని. పాలుతాగే వయస్సు. తల్లి బీడీ కంపెనీలో పనికిపోతే అన్న శ్రీనివాసు ఎత్తుకొని ఆడిస్తుంటాడు.



### రాజేశం– బీడీ కమిషన్ ఏజెంటు

బీడీ ఫ్యాక్టరీలో ఏజెంట్లు ప్రతినెల కార్మికులకు జీతాలు ఇస్తుంటారు. వీరు ఫ్యాక్టరీలో దాదా చెప్పిన విధంగా చేస్తుంటారు. ఏజెంట్లు దాదాల నుండి తంబాకు తీసుకువెళ్ళి కార్మికులకు బీడీలు తయారు చేయడానికి ఇస్తారు. ఏజెంటు కార్మికులు తీసుకువెళ్ళిన ఆకుకు ఎన్ని బీడీలు తయారు చేసుకొని వచ్చారో లెక్కపెట్టి తీసుకుంటారు. కార్మికులు తీసుకువచ్చిన బీడీలను బట్టి వారికి జీతాలు తగ్గించి ఇస్తుంటారు. హెడ్డాఫీసు దగ్గెర ఏజెంట్ల ఎవరి కుప్పదగ్గర వాళ్ళు కూర్చుని బీడీలు లెక్కపెట్టించి కట్టలు కట్టిస్తుంటారు.

ఏజెంటు రాజేశం బీడీ కంపెనీలోనే వెనుకవైపు వున్న గదిలోనే భార్యాపిల్లలతో కాపురం ఉంటాడు. తన కంపెనీలో రాజేశం కార్మికులు అందరికి జీతాలు ఇస్తుంటాడు. చివరకు రాజేశం కార్మికులకు జీతాలు తగ్గించి ఇవ్వడం అన్యాయమే అనుకున్నాడు. కోపాన్ని తగ్గించుకొని కార్మికులు అందరూ న్యాయంగానే బందు చేస్తున్నారు అనుకుంటాడు.

### సత్తెక్క

కమిషన్ ఏజెంటు రాజేశం భార్య సత్తెక్క. ఆమె కూడా బీడీలు చేస్తుంది. రాజేశం బీడీ కంపెనీలో జీతాలు తక్కువ ఇచ్చాడని కార్మికులు మాట్లాడుకునే మాటలు సత్తెక్క వింటుంది. అక్కడి కార్మికులతో "ఏంజెయ్యమంటవో లక్ష్మక్కా! ఆడ దేశమ్మీద మన సేటు బీడీ గుంజుత లేదట, ఈడు దాద తంబాకు తక్కోపోత్తాండట"...[19] విషయం వివరించినట్టుగా అంది సత్తెక్క.

### సేటు

బీడీ ఫ్యాక్టరీలో ప్రధానమైన వ్యక్తి సేటు. సేటు కింద దాదాలు పని చేస్తుంటారు. ఫ్యాక్టరీలో కార్మికులకు ఎంత జీతాలు ఇవ్వాలి? ఎప్పుడు ఇవ్వాలి? అన్నది సేటు నిర్ణయిస్తాడు.

### దాదా

బీడీ ఫ్యాక్టరీలో దాదా మేనేజరు. ముఖ్యమైన వ్యక్తి. దాదా కూడా హెడ్డాపీసులోనే వుంటాడు. దాదా కింద ఏజెంట్లు పని చేస్తుంటారు. సేటు చెప్పిన విధంగా దాదా ఏజెంట్లకు సలహాలు ఇస్తుంటాడు.

### లచ్చి రాజవ్వ

లచ్చి రాజవ్వకు నారాయణ ఒక్కగానొక్క కొడుకు. నారాయణ చిన్నతనంలోనే తండ్రి చనిపోయాడు. లచ్చిరాజవ్వ కొడుకును చదివించాలని బీడీ ఫ్యాక్టరీలో కార్మికురాలుగా పని చేస్తుంది. బీడీలు చేసి చేసి రెక్కలు ముక్కలు చేసుకొని అనారోగ్యం పాలైంది. కొడుక్కి పెళ్ళి చెయ్యాలని పెళ్ళి చూపులకు వెళ్ళి సుగుణను చూసి వస్తుంది.

### చాకలి మైసి

మైసి తన జీవన విధానం గురించి, కులవృత్తి గురించి లక్ష్మితో "ఏదో కుల కశిపి అని బుక్కెడంత అన్నం దొరుకుతదని గని ఏంగాలి పోయింది యిండ్ల? మీ ముట్టుబట్టలు, మైలబట్టలు ఉతికి పెయి ఎండిపాయె పొద్దుందాక ఎండుక ఎండిఎండి బొగ్గయితి. సోడనీల్లు మీద పడి ఎంటికలన్ని ఎర్రవడిపాయె, ఇద్దరు పోరగాన్లకె నన్ను ముసల్దాని తీరుగున్నవు అనవట్టిరి. ఏం కులకశిపో తియి" అందరి కంటే యీనం మా బతుకు" అని బాధ పడుతుంది.[20]

### శంకరి

ఫ్యాక్టరీ కార్మికులకు యూనియన్ లీడరు. కార్మికులు అందరూ జీతాలు తగ్గించి ఇచ్చినందుకు బందు చేయాలని అనుకుంటారు. అప్పుడు శంకరి కూడా బందు చేయడానికి అంగీకరిస్తూ కార్మికులందరితో మాట్లాడతాడు. కార్మికుల సమస్యల గురించి అందరికి తెలియజేస్తాడు. కార్మికుల ఆలోచనా విధానంలో మార్పులు తీసుకువచ్చి కంపెనీలు అన్నీ బందు చెయ్యాలని ప్రయత్నిస్తాడు. ఈ నిరుపేదల ఉద్యమానికి శంకరి ఎంతో సహకరిస్తాడు.

### లక్ష్మీనారాయణ

లక్ష్మీ నారాయణ బీడీ ఫ్యాక్టరీలో కార్మికుడు. కార్మికులంతా బందు చేయాలన్నప్పుడు నారాయణ చేసే పనులకు సహకరిస్తూ ఉద్యమంలో పాల్గొన్నాడు.

ఇలా నవల ఈ పాత్రలన్నిటినీ కలుపుకొని సజీవ దృశ్య కావ్యంలా ముందుకు సాగుతుంది. ప్రతిపాత్ర తన ప్రత్యేక వ్యక్తిత్వాన్ని స్వభావాన్ని కనపరుస్తుంది. పాత్ర చిత్రణ ఈ నవలలో ఎంతో ఉత్తమంగా సాగింది. ఆయా సన్నివేశాల్లో పాత్రలు ప్రవర్తించే తీరు ఆ పాత్రల స్వభావాలను స్పష్టం చేస్తాయి.

భార్యాభర్తలు ఇద్దరూ బీడీలు చేసే పాత్రలను సమ్మె సందర్భంగా చిత్రించారు. ఇద్దరూ భీడీల మీద ఆధారపడ్డప్పుడు వారి ఆలోచనా విధానంలో వుండే మార్పులను చక్కగా వ్యక్తం చేశారు.



## పాదసూచికలు

1. బి.ఎస్.రాములు గారితో సంభాషణ.
2. బతుకుపోరు నవల – మూడవ ముద్రణ, బి.ఎస్.రాములు; పుట : 50
3. బతుకుపోరు నవల – మూడవ ముద్రణ, బి.ఎస్.రాములు; పుట : 102
4. బతుకుపోరు నవల – మూడవ ముద్రణ, బి.ఎస్.రాములు; పుటలు : 102,103
5. బతుకుపోరు నవల – మూడవ ముద్రణ, బి.ఎస్.రాములు; పుట : 75
6. బి.ఎస్.రాములు గారితో సంభాషణ.
7. బతుకుపోరు నవల – మూడవ ముద్రణ, బి.ఎస్.రాములు; పుట : 77
8. స్మృతి కథల సంపుటి – బి.ఎస్.రాములు, 1998; పుట : 46
9. బి.ఎస్.రాములు గారితో సంభాషణ.
10. బతుకుపోరు నవల – మూడవ ముద్రణ, బి.ఎస్.రాములు; పుట : 109
11. జాతర నవల–సమగ్ర పరిశీలన, ఎమ్.శ్రీరాములు; పుట : 23
12. బి.ఎస్.రాములు 'బతుకుపోరు' నవల; పుట : 23
13. బి.ఎస్.రాములు – 'బతుకుపోరు' నవల; పుట : 25
14. బి.ఎస్.రాములు – 'బతుకుపోరు' నవల; పుట : 38
15. బతుకుపోరు నవల – మూడవ ముద్రణ, బి.ఎస్.రాములు; పుట : 35
16. బతుకుపోరు నవల – మూడవ ముద్రణ, బి.ఎస్.రాములు; పుట : 109
17. బతుకుపోరు నవల – మూడవ ముద్రణ, బి.ఎస్.రాములు; పుట : 23
18. బతుకుపోరు నవల – మూడవ ముద్రణ, బి.ఎస్.రాములు; పుట : 24
19. బి.యస్.రాములు – 'బతుకుపోరు' నవల, పుట : 45
20. బి.యస్.రాములు – 'బతుకుపోరు' నవల, పుట : 16

ఐదవ అధ్యాయం

# బతుకుపోరులో వాస్తవిక జీవిత చిత్రణ

బి.ఎస్.రాములుగారు రాసిన 'బతుకుపోరు' గ్రామీణ బహుజన శ్రామిక స్త్రీల వాస్తవ జీవితాలను చిత్రించిన నవల. తెలంగాణ భాషలో చేసిన రచన. 1982 సం॥లో వెలువడిన ఈ నవల బీడీ పరిశ్రమలో పని చేసే తెలంగాణ స్త్రీల జీవితాలను, సంస్కృతిని ఈ నవల చిత్రించింది. చాలీచాలని జీతాలతో కష్టాలు, సమస్యలు ఎదుర్కొంటూ, బతుకుపోరును ఈదుకునే పేదల వాస్తవ గాథా చిత్రణ యిది. నిర్దిష్టత ఒక విశ్వజనీన సత్యాన్ని ఆవిష్కరిస్తుందనే విషయానికి 'బతుకుపోరు' నవల తార్కాణం.[1]

## నవలలో కార్మిక స్త్రీలు

ప్రారంభం నుంచి చివరి దాకా పట్టుసడలకుండా సాగిన నవల ఇది. స్త్రీలు ఉదయం లేచిన దగ్గర నుండి రాత్రి పడుకునే వరకు నిరంతరం కుటుంబంలో, సమాజంలో నిర్వర్తించే పాత్రను, చేసే శ్రమను యీ నవల చిత్రించింది. ఈ నవల తెలంగాణ పల్లెలోని చిన్న కుటుంబ కథ యిది. లక్ష్మి కుటుంబంతో ప్రారంభమవుతుంది. లక్ష్మి, రాజయ్యలకు ముగ్గురు సంతానం. పెద్దకొడుకు శ్రీనివాసు, తర్వాత అమ్మాయి సరస్వతి, చిన్నకొడుకు నాని. భర్త రాజయ్య దుకాణంలో గుమాస్తాగా పనిచేస్తుంటాడు. బీడీ కార్మికురాలైన లక్ష్మి తెల్లవారుఝామున నిద్రలేచి ఇంటిపనులు, వంటపనులు పూర్తి చేసుకొని పెద్దకొడుకు శ్రీనుని, కూతురు సరస్వతిని తయారు చేసి బడికి పంపిస్తుంది. లక్ష్మి కూడా కాస్తంత అన్నం తిని బీడీకంపెనీకి వెళ్తుంది. బీడీల కంపెనీలో తోటి కార్మికులు, వారి జీవితం... సమాజంలో ఆ కుటుంబానికి ఉండే సంబంధాలు తద్వారా సామాజిక సంబంధాలు, స్త్రీల భాషలో, స్త్రీల సంస్కృతిలో భాగంగా తెలంగాణ ప్రజాజీవన స్థితిగతులను చిత్రిస్తుంది. జీవితంలోని అనురాగాలు,



ఆప్యాయతలు, ప్రేమలు, మానవీయ విలువలు, తోటి మనుషుల పట్ల ఆరాటం, తల్లి మనసుతో నవల ఆవిష్కరిస్తుంది.[2]

## నవలలో ఏకసూత్రత

"ఎన్ని కథలు రాశావని కాదు,
ఎట్లాంటి కథలు రాశావన్నా
తెలంగాణ మట్టిలోనుంచి
వ్యథలను కథలుగా మార్చడం నీకే సాధ్యమైంది
ప్రశాంత గోదావరి తీరాన పుట్టి
కల్లోలంలో వ్యక్తిత్వాన్ని నిలుపుకున్నావు"[3] – డా॥ ఎన్.గోపి

నవల ప్రారంభం నుంచి చివరి దాకా ఏకసూత్రత చెడకుండా నడుస్తుంది. నవల ప్రారంభంలో సమస్యను రచయిత అన్యాపదేశంగా పరిచయం చేసిన పద్ధతి తర్వాత ఆ సమస్య వెంట పాఠకులు నడవడానికి పునాది వేస్తుంది. "ఆ చిన్న యింట్లో గ్యాసునూనె గుడ్డిదీపం వెలుగుతోంది" అని చెప్పడంలో ఆగకుండా బీడీ కొరకులాగ వెలుగేమీ యివ్వడం లేదు అని అంటారు. అలాగే "నానిగాడికి నల్లికుట్టినట్టుంది. అటు నుండి యిటు పొర్లాడు. కళ్ళు మూసుకొని నిద్రలో పాలకై నోరు చాపి అమ్మ మీద చేయి వేయబోయాడు. చేతికి అమ్మ అందలేదు" అని చెప్పడంతో సరిపెట్టకుండా, చేయి పక్కనున్న బీడీల చేటలో పడింది" అని అంటాడు రచయిత. దీనివల్ల రెండు విధాల ప్రయోజనం చేకూరింది. స్త్రీల జీవితాల్లోకి బీడీల పరిశ్రమ ఎలా చొచ్చుకొని వచ్చిందో పాఠకులకు తెలియజెప్పడంతో పాటు నవల వస్తువును అనాలోచితంగా అన్యాపదేశంగా పరిచయం చేస్తున్నారు రచయిత. ఒక మంచి కావ్యానికి ఇది మంచి ప్రారంభం.[4]

దళిత, శ్రామిక స్త్రీలు గ్రామాల్లో పురుషులతో సమానంగా కాయకష్టం చేస్తారు. ఆ కాయకష్టం కాస్తా తెలంగాణలో వ్యవసాయరంగం నుంచి అసంఘటిత రంగమైన బీడీ పరిశ్రమలోకి మారింది. ఆర్థికంగా బాగుపడతామనే ఆశలు అడుగంటిపోతుండగా, శరీరాలను పీల్చిపిప్పిచేస్తున్న వైనాన్ని 'బతుకుపోరు' నవల ప్రతిభావంతంగా చిత్రించింది. ఇందులోని ప్రధానపాత్ర లక్ష్మి సాత్వికపాత్ర, లోకజ్ఞానమెరిగిన స్త్రీ. రామక్క, సత్తెక్క, సుగుణ ఒక్కోపాత్ర విలక్షతను సంతరించుకుంది. ఇవి మూసపాత్రలు కావు. సజీవ పాత్రలు. మన కళ్ళముందు కదలాడే తెలంగాణ పల్లె స్త్రీలు.

'బతుకుపోరు' నవల తెలంగాణ బహుజన శ్రామిక స్త్రీలు తమ కథలను వెతలను, పోరాటాలను నోరు తెరచి చెప్పకుండానే వారి మాటల ద్వారా చేష్టల ద్వారా మనకు తెలియజేస్తున్నారు. తమ ఆడబతుకులెంత కష్టమైనవో, తాము వివక్షకు ఎలా గురవుతున్నామో గ్రామీణ బహుజన స్త్రీలకు స్పష్టంగానే తెలుసు. ఏ పల్లె స్త్రీని పలకరించినా యీ విషయాలు మనకు అర్థమవుతాయి.

## పల్లె పరిణామం

బతుకుపోరు నవలలో గ్రామీణ బహుజన కులాల జీవితాలు తెలంగాణ గ్రామీణ జీవితం కళ్ళకు కట్టినట్లు కనిపిస్తుంది. "చాకలి మైసి బుక్కెడంత అన్నం దొరుకుతదని బట్టలు ఉతికి ఉతికి నాపెయి ఎండిపోయింది"(5) అని అందరికంటే హీనం మా బతుకులు అని తమ జీవిత సారాన్ని నాలుగు మాటల్లో చెప్తుంది. లక్ష్మి కొరకు శ్రీను, సరస్వతిల చదువులు రెండున్నర దశాబ్దాల క్రితం తెలంగాణలో బడులకు పోవడం ప్రారంభించిన అందరికి వర్తిస్తుంది. తెలంగాణలో తమ జీవితాలను తామే నిర్దేశించుకునే స్థితికి వచ్చారు.

లక్ష్మి ఇంట్లో ఆర్థిక పరిస్థితుల గురించి చూస్తే ప్రతిరోజు ఇంట్లో మామిడి తొక్కు వేసుకొని అన్నం తిని బడికి వెళ్ళాల్సి వచ్చేది. అటువంటి సమయాల్లో చిన్న చిన్న వాటికోసం పిల్లల ఆరాటం ఎలా ఉండేదో తలచుకుంటే ఆశ్చర్యం కలుగుతుంది. దుఃఖం గుండె గొంతుకలో కొట్టుకుంటుంది. పెద్దకొడుకు శ్రీను పావలాపైసలు ఇస్తేనే బడికిపోతాను అంటాడు. అందుకు సమాధానంగా లక్ష్మి బడికి పోకపోతే నాలాగా బీడీలు చెయ్యి పైసలు వస్తయి అని కొడుకు శ్రీనుతో అంటుంది.

## బీడీ కార్మికురాలిగా సుగుణ

సుగుణ లక్ష్మి పక్కింటి అమ్మాయి. అయిదో తరగతో, ఆరో తరగతో చదివిన తర్వాత తల్లిదండ్రులు చదువు మాన్పించారు. తల్లికి సహాయంగా బీడీ కంపెనీలో పని చేస్తుంది. తెలంగాణలో పెళ్ళి సంబంధాల తీరును నవల సహజాతి సహజంగా చిత్రీకరించింది. "సుగుణకు యింకా పెళ్ళి కాలేదు. పెళ్ళికి కట్న కానుకలు, పెట్టుపోతల దగ్గర పేచీ వస్తుంది. నిజానికి నవలలో కట్న కానుకలు, పెట్టిపోతల దగ్గర పేచీ పెట్టడానికి కారణం పెళ్ళిని వాయిదా వేయాలనే ఉద్దేశంతోనే. ఆ రోజుల్లో కట్నాలు ఏ విధంగా ఉండేవి అనేది ఆ విషయాలన్నింటిని సందర్భోచితంగా నవలలో రచయిత చెప్పారు. "పిల్ల మంచిగనే ఉందికానీ ఆరువేలు కట్నం, ఒక సైకిలు, ఒక గడియారం కావాలి అన్నారట" అని పెళ్ళికూతురు సుగుణ చెప్తుంది. ఆమె చెప్పే



తీరు అదేదో మాట్లాడాలని కాకుండా అతి సాధారణమైన వ్యవహారం లాగా చెప్పేయటం తెలంగాణ శ్రామిక గ్రామీణ జీవితానికి అద్దం పడుతుంది. సుగుణ చిన్నతనం నుండే చదువు మధ్యలో ఆపేసి బీడీలు చేయడంలో తల్లికి సహకరిస్తూ ఉంటుంది. సుగుణ అన్న మాత్రం కాలేజీలో చదువుతుంటాడు. ఆడపిల్లలు ఇలా చదువులకు దూరమైన తీరు ఈ నవలలో కనిపిస్తుంది.

తెలంగాణలో బతుకుతెరువు కోసం వలసలు 150 ఏళ్ళ క్రితమే ప్రారంభమయ్యాయి. బొంబాయి, భీవండి, షోలాపూర్, సూరత్‌లకు పనిపాట్లకోసం వలసలు పోయిన విషయాన్ని 'బతుకుపోరు' నవల చిత్రీకరిస్తుంది. అక్కడ పని చేసి బతుకులు బాగు చేసుకుందా మనుకున్న శ్రామికుల ఆశలు ఆశలుగానే మిగిలిపోయిన వైనం యీ నవలలో కనిపిస్తుంది.

లక్ష్మి సుగుణ కుటుంబం గురించి "వాళ్ళింట్లో పనిచేసేవాళ్లు యిద్దరు, తినేవాళ్ళు నలుగురు. సుగుణ కూడా కొంచెం మంచిగ బీడీలు జెయ్యబట్టి రెండేళ్ళవుతుంది. అంతకుముందు వాళ్ళ అమ్మ ఒక్కతే బీడీలు చేసేది. కొడుకు నీలాగే చదువుకుంటున్నాడు. తండ్రి బొంబాయిలో పనులకు పోయి పని చేసి చేసి కాలుచేయి పడిపోయింది"(6) అని నారాయణకు చెప్తుంది. సుగుణను ఎంతోకొంతకు ఒప్పుకొని పెళ్ళి చేసుకోవాలని నారాయణను ఒప్పించడానికి లక్ష్మి ఆ కుటుంబం పరిస్థితులను వివరిస్తుంది. నారాయణ డిగ్రీ ఫెయిలై బీడీ కంపెనీలోనే పని చేస్తూ వుంటాడు. నారాయణ తల్లి సుగుణను చూసి వచ్చి మంచిరోజు చూసుకొని ముహూర్తం పెట్టుకోవాలనుకుంటారు. ఇలా నవలలో జీవితంలోని అన్ని సంఘటనలకు, పరిణామాలకు ఒకదానికొకటి దగ్గర సంబంధం చూపిస్తూ తెలంగాణ గ్రామీణ పరిస్థితులను సమగ్రరూపంలో మనకు యీ నవల ద్వారా అందించారు.

## బీడీ పరిశ్రమ తీరు

బీడీలు తయారు చేయడం ద్వారా వచ్చే ఆదాయంలో తెలంగాణ శ్రామిక కుటుంబాలు తమ ఆర్థిక పరిస్థితిని మెరుగుపరుచుకుందామని అనుకున్నారు. కానీ బీడీ కంపెనీ యాజమాన్యంలో సేటు, దాదా, ఏజెంట్లు, ముఖ్యమైన వారు. కంపెనీలో కార్మికులకు కనీస సౌకర్యాలు ఉండవు. తంబాకు ఘాటువాసన వల్ల కార్మికులు అనారోగ్యంతో బాధపడుతూ ఉంటారు. కంపెనీలో ఏమూల చూసినా బీడీ కుప్పలు గంపల నిండా తంబాకు మూటలు.

బీడీ ఫ్యాక్టరీలో సేటు, దాదాలు, కార్మికులు వారి కష్టాలకు సరిపడే జీతాలు ఇవ్వకుండా కూలీలు తగ్గించి ఇస్తున్నారు. లక్ష్మి బీడీ కంపెనీకి వచ్చేసరికి కంపెనీలో

కార్మికులంతా జీతాలు వచ్చే రోజున అందరూ మాట్లాడుకుంటున్నారు. దాదా ఇంటికి వెళ్ళేటప్పుడు అందరూ జీతాలు తీసుకొని వెళ్ళండి అని ఆదేశించాడు. ఇక్కడ పని చేస్తున్న వారిలో ఎక్కువ చదివిన వ్యక్తి నారాయణ. దాదా నారాయణకు కూడా జీతం తగ్గించి ఇవ్వడంతో ఎక్కువ టైం పని చేపిస్తున్నావని లేబరాఫీసరుకు చెప్తాను అన్నాడు. ఇద్దరి మధ్య గొడవ పెరిగి దాదా నారాయణను చొక్కా పెట్టుకొని బయటకు నెట్టాడు. రాజేశం రామక్కకు కూడా పైసలు తగ్గించి ఇవ్వబోయాడు. రామక్క కార్మికులు అందరితో ఎవరూ పైసలు తీసుకోవద్దు. ఆకు నానపెట్టుకోవద్దు రేపు కంపెనీకి బందు చేద్దాము అని తన నిర్ణయాన్ని తెలియజేసింది.

## శ్రామిక స్త్రీల ఫెమినిజం

"తర్క శాస్త్రాలను తిరిగిరాసిన వాడు

తత్వవేత్తగా విస్తరించాడు"[7] – గూడ అంజయ్య

స్త్రీలు తల్లిగా, భార్యగా, కూతురిగా, సంఘజీవిగా, సమూహంలో ఒకరిగా, కుటుంబాన్ని ఇరుగుపొరుగు సంబంధాలను సామాజిక సంబంధాలను ఎంతచక్కగా నిర్వహిస్తారో స్త్రీలలోఉండే వ్యవహార దక్షత ఏమిటో లక్ష్మి, సుగుణ, రామక్క వంటి స్త్రీ పాత్రలు రుజువు చేస్తాయి. కంచ అయిలయ్య, "నేను హిందువును ఎట్లయిత" అనే పుస్తకంలో అగ్రవర్ణ స్త్రీలు వేరని, దళిత బహుజన స్త్రీలు వేరని దళిత, బహుజన కులాల కుటుంబాల్లో మాతృస్వామిక స్వభావం, తల్లి పెత్తనం, స్త్రీ పెత్తనం ఇప్పటికీ అనేక రూపాల్లో కనపడుతుందని పేర్కొన్నారు. ఈ నవలలో కూడా వాటిని ఆయన కన్నా ముందే రచయిత పసికట్టి వాటిని చిత్రించారు. కంచె అయిలయ్య కన్నా చాలా ముందు స్త్రీ వాదుల కన్నా చాలా ముందుగా శ్రామిక స్త్రీలు తమ జీవితానుభవంలో భాగంగా ఫెమినిస్టు దృక్పథాన్ని ఎలా సంతరించుకున్నారో లక్ష్మి సంభాషణలో రచయిత చిత్రించారు. ఇలా శ్రామిక స్త్రీలు ఫెమినిస్టుల దృక్పథంలో మధ్య తరగతి స్త్రీల కన్నా ఒకింత ముందున్నారని చెప్పవచ్చు. ఇది సహజమైన శైలిలో స్త్రీ, పురుష సంబంధాల మధ్య అసమానతలను తెలుపుతూ, నిలదీస్తూ లక్ష్మి తన భర్త రాజయ్యతో చేసిన సంభాషణ ద్వారా మనకు అర్థమవుతుంది. లక్ష్మి రాజయ్యతో "ఆడోల్లం చేసే పనిలో మీరు ఏపాటిపని చేస్తున్నరు?" అని ప్రశ్నిస్తూ "ఆడోల్లందరు ఒకసారి పదిహేను రోజులు పిల్లలను మొగనికి అప్పజెప్పి తల్లిగారింటికి పోతే తెలుస్తది" అని అంటుంది. ఆ మాట అనడానికి భర్తకి, ఆమెకి మధ్య పెద్ద సంభాషణే జరుగుతుంది.



వ్యవసాయం, చేనేత వంటి వృత్తులు సంప్రదాయకంగా, ప్రధాన జీవనాధారంగా ఉండేవి. ఇతర వృత్తులు ప్రవేశించి శ్రామికులకు, ఇతర ఆదాయ మార్గాలు చూపిన సందర్భానికి బీడీ పరిశ్రమ ఒక ఉదాహరణ. ఈ నూతన వృత్తులు తాము ఆర్థికంగా ఎదిగి, సామాజిక హోదాను పెంచుతోందనే ఆశ చూపాయి. తెలంగాణలోని అన్ని కులాల స్త్రీలు బీడీలు చేస్తూ జీవనం గడుపుతున్నారు. ఆ రకంగా తమ పిల్లలను చదివించుకోవాలనే కొత్త చైతన్యం కూడా దళిత, బహుజన కుటుంబాల్లో కలిగింది.

కష్టం రూపం మారినా మారని శ్రమదోపిడీని దాన్ని ఎదుర్కొనే వైనం యీ నవలలో కనిపిస్తుంది. స్త్రీలు అటు యజమానుల చేతుల్లోనే కాకుండా అదనంగా భర్తల చేతుల్లో కూడా అణచివేతకు, దోపిడీకి గురవుతున్న విషయాలను 'బతుకుపోరు' నవల సమర్థవంతంగా చిత్రీకరించింది.

## స్త్రీల చైతన్యం

స్త్రీల ఆరోగ్యాలు బీడీ పరిశ్రమల వల్ల ఎలా దెబ్బతింటున్నాయో మనకు లచ్చిరాజవ్వ యాతన చూస్తే అర్థమవుతుంది. ఆరోగ్యాన్ని బీడీ పరిశ్రమ పీల్చిపిప్పి చేస్తుంది. నీడపట్టుకు కూర్చుని చేసే పనేగదా అనుకుంటే ఎంతో కష్టపడాల్సి వచ్చేది. లక్ష్మి రామక్కతో ఏజెంటు రాజేశం రాత్రి ఇంటికి వచ్చి పైసలు ఇచ్చి వెళ్లాడని చెప్తుంది. రామక్క, లక్ష్మి, సుగుణ, అందరూ కంపెనీకి వచ్చారు. రాజేశం ఆకు నానపెట్టుకోలేదని కోపంతో అరిచాడు. రామక్క, రాజేశంల మధ్య గొడవ పెద్దదయ్యింది. కార్మిక లీడర్లు సుధాకర్ సముదాయించబోయారు. రామక్క, లక్ష్మి, సుగుణ, నిర్మల, అందరూ తిట్టుకుంటూ బీడీ ఆకులు కాళ్ళకింద తొక్కుకుంటూ బయటకు వచ్చారు. వీధిలో నడుస్తుంటే పెద్ద ఊరేగింపులా ఉంది. వీరిలో "ఒక పిల్లవాడు బీడీలోల్లు... అన్నాడు అంకురంమేస్తూ .... జిందాబాద్ అన్నారు మిగతాపిల్లలు. నారాయణ బీడీకార్మికుల సంఘం అంటే పిల్లలు జిందాబాద్ అన్నారు."[8] ఊరేగింపులా వచ్చి అందరూ రామక్క ఇంటిముందు ఆగారు. శంకరన్న చెప్పిన మాటలను కార్మికులంతా ఆసక్తిగా విన్నారు.

"బతుకుపోరునవలలోని సమస్య బీడీ పరిశ్రమలో పనిచేస్తున్న స్త్రీ కార్మికులదే అయినా దాన్ని పెనవేసుకుని గ్రామీణ ప్రాంతాల్లోని మానవ సంబంధాలను ఆ సంబంధాల మధ్య పనిచేసే శక్తులను, స్త్రీ పురుష సంబంధాలను, పని పరిస్థితులను కొత్త పరిశ్రమ సృష్టించిన కొత్త దోపిడీదారులను, దానివల్ల అంతరాలు మారే క్రమం అన్ని రకాల దోపిడీలను ఎదుర్కొనే స్త్రీల తెగువ సహజంగా నవలలో రూపుకట్టాయి."[9] బహు ముఖీనంగా యీ నవల సాగుతుంది. బీడీ పరిశ్రమ యజమానులపై స్త్రీ

కార్మికులు తిరగబడే తీరును సమర్థవంతంగా చిత్రించారు. ఎక్కడ కూడా ఏ మాత్రం అసహజత చోటుచేసుకోకపోవడమే యీ నవల గొప్పదనం.

లక్ష్మి, రామక్క, నారాయణ, సుగుణ, వెంకటక్క అందరూ యిల్లిల్లూ తిరిగి కంపెనీలు బందుపెట్టమని చెప్తున్నారు. లక్ష్మి సమస్యల గురించి బావులు పెరగాలి, అకుతుట్టి పోయిందని పైసలు తగ్గించకుండా ఇవ్వాలని, బోనసు పెరగాలి అని, అందుకు అందరం సమ్మె చెయ్యాలని చెప్తుంది. ఫ్యాక్టరీలో బందు గురించి సేటు దాదాను తిడతాడు. దాదా రాజేశంను పిలిపించి మాట్లాడతాడు. రాజేశం కార్మికులు ఆరేళ్లనుంచి పండగలకు, లేబర్ హాలిడేలకు బకాయిలు రావాలని కోరుతున్నారని చెప్తాడు. దాదా హైకోర్టులో కేసుపెట్టి స్టే తెచ్చారు గదా అన్నాడు. రాజేశం హైకోర్టు తీర్పు గురించి కార్మికులకు లేబర్ సెలవులకు బకాయిలు వస్తాయని, కంపెనీ నుండి వెల్లగొట్టిన కార్మికునికి తొంభై రోజుల కూలీ ఇవ్వాలని సమాచారాన్ని చెప్పాడు.

ఫ్యాక్టరీ కార్మికులంతా సమ్మెను ఉధృతం చేస్తున్నారు. సమాజంలో జరుగుతున్న అన్యాయాలు, అక్రమాలు, దోపిడీ తీరుతెన్నులు తెలిసిపోతుండడంతో అసంతృప్తి పేరుకుపోయిన స్థితి, ఆగ్రహం నివురుగప్పిన నిప్పులా రాజుకుంటున్నది. ఈ అసంతృప్తి, ఆగ్రహం కాలువలు కాలువలుగా ఉద్యమంలోకి పారుతున్నాయి. నారాయణ ఎక్కువ కంపెనీలు బందుపెడితే సేట్లు అంత ఎక్కువ భయపడి మనమాట వింటారు అన్నాడు. పక్కపల్లెల్లో ఉండే కంపెనీ కార్మికులు కూడా ఉద్యమంలో కలసిపోయారు. లక్ష్మినారాయణ 'లై' డబ్బాపట్టుకొని వెళ్తుంటే నారాయణ ఎర్రసిరాతో రాసిన పోస్టర్లు ఒక చేతిలో, రంగుడబ్బా, మరో చేతిలో పట్టుకొని అనుసరించాడు.

బీడీ పరిశ్రమలో కమీషన్ ఏజెంట్లు, దాదాలు, సేట్లు, ఎక్కడెక్కడ కార్మికులను, అందునా స్త్రీ కార్మికుల శ్రమను ఎలా దోచుకుంటున్నారో తెలుసుకున్నారు. "విప్లవోద్యమ పాదులు పడిన ఉత్తర తెలంగాణాలో ముఖ్యంగా కరీంనగర్ జిల్లాలో యీ దోపిడీ, దోపిడీ దుష్ఫలితాలు కలగడానికి ఎంతోకాలం పట్టలేదు. ఇలా లోలోన రగులుతున్న బీడీ కార్మికుల చైతన్య నిప్పుకణికలకు అద్దంపడుతుంది యీ బతుకుపోరు నవల."[10]

అప్పట్లో నవలా సాహిత్యంపై ఆశ చిగురింపజేసిన నవల 'బతుకుపోరు'. ఈ నవల వెలువడేనాటికి (1982) స్త్రీలను బీడీ పరిశ్రమ పీల్చిపిప్పి చేయడం మొదలై ఇరవైయేళ్ళకు పైనే అయ్యింది. బీడీ పరిశ్రమ స్త్రీలను, పిల్లలను తనలోకి లాక్కుంది. స్త్రీలు, బాల కార్మికుల శ్రమశక్తిని దోపిడీ చేయడం చాలా సులభం. 'బతుకుపోరు' నవల వెలువడేనాటికి కమీషన్ ఏజెంట్లు, దాదాలు, సేట్లు యీ దోపిడీని



నిరంతరాయంగా కొనసాగిస్తూ ఉన్నారు. విప్లవోద్యమ గాలులు ఉధృతంగా వీస్తున్నాయి. ఈ క్రమంలో గ్రామీణ ప్రజలు చైతన్యాన్ని సంతరించుకున్నారు. తమ హక్కులు వారికి క్రమంగా తెలిసివచ్చే పరిస్థితి నెలకొంది. ఆ చైతన్యం లోలోన రగులుతూనే ఉంది.

ఏ సౌకర్యాలు లేక దోపిడీకి గురవుతూ బీడీలు చేస్తున్న స్త్రీ కార్మికుల వెతలను చెబుతూనే వారు పోరాటానికి సిద్ధమయ్యే ఒక పరిణామక్రమాన్ని 'బతుకుపోరు' నవల చిత్రించింది. ఇందులో దళారీలు, వారిని గుర్తించటం, వారిని తిప్పికొట్టడమూ వుంది. పోరాటానికి ఉద్యక్తులయ్యే క్రమంలో నారాయణ, సుగుణల మధ్య వెల్లివిరిసిన ప్రేమను, వారు దాన్ని వ్యక్తం చేసుకున్న తీరును రచయిత అత్యంత ప్రతిభావంతంగా చిత్రించాడు. వారు విప్లవోద్యమం వైపు వెళ్తారన్న విషయాన్ని రచయిత చెప్పకుండానే పాఠకులకు ఆ విషయాన్ని స్ఫురింపచేస్తారు.

ఫ్యాక్టరీలలో పనిచేసే కార్మికులు ఎన్నో సమస్యలను ఎదుర్కొంటూ పేదరికంతో జీవితాలను గడుపుతున్నారు. వీరి ఆలోచనా విధానంలో మార్పులు తీసుకురావాలని లక్ష్మి, రామక్క, నారాయణ, శంకరి వంటివారు ఉద్యమించారు. ఫ్యాక్టరీ కార్మికుల చీకటి బతుకు జీవితాల్లో వెలుగు తీసుకురావాలని ముందుకు సాగిపోతున్నారు. అదే యీ బతుకుపోరు. నేటి స్త్రీవాద సాహిత్యం ఉనికిలోకి రావడానికి చాలాకాలం ముందే బతుకుపోరు నవల స్త్రీల జీవితాలను, సంస్కృతిని, ఆలోచనా విధానాన్ని కార్యదక్షతను, స్త్రీల అభివృద్ధిని, స్త్రీల భాషను వాస్తవికంగా చిత్రించిన నవల ఇది.

ప్రస్తుత సమాజంలో బీడీ ఫ్యాక్టరీలలో పనిచేసే కార్మికులు ఎన్నో సమస్యలను ఎదుర్కొంటున్నారు. ఈ కార్మికుల జీవితాల్లో మార్పులు తీసుకురావడానికి వీరి ఆలోచనా విధానంలో కూడా మార్పులు రావాలని రచయిత తెలియజేస్తున్నారు. బీడీ ఫ్యాక్టరీలో పనిచేసే కార్మికుడికి శ్రమకు తగిన కూలి డబ్బులు, బోనస్‌లు లేబర్ శెలవులకి బకాయిలు ఇవ్వాలని కోరుతూ, కార్మికుల అందరి జీవితాల్లో కొత్త వెలుగులు తీసుకురావాలని బతుకుపోరు నవల ద్వారా సమాజానికి రచయిత సందేశం ఇచ్చారు.

"హేతుజ్ఞాన పరిధిలో మానవతను చాటి చెప్పి
సమానతను దర్శించిన నవ సమాజ దార్శనికుడు"[11] – జె.ఎస్.రఘుపతిరావు

## తెలంగాణ సంస్కృతి – సంప్రదాయాలు

తెలంగాణ ప్రాంతంలో పెళ్లి సంస్కృతి, సంప్రదాయాల తీరును గురించి బతుకుపోరు నవలలో బి.ఎస్.రాములుగారు సహజసిద్ధంగా చిత్రీకరించారు.

సాధారణంగా సమాజంలో పెళ్ళీడు యువతీయువకుల గురించి, మాటలు, కట్నకానుకల విషయాలు స్పష్టం చేశారు.

సుగుణను అయిదో, ఆరో తరగతో చదివించి తల్లిదండ్రులు చదువు ఆపేయించారు. సుగుణ చిన్నతనం నుంచే బడికిపోతున్నప్పటి నుండే తల్లికి ఆసరాగా ఆకు కత్తిరించడం, బీడీలకు దారం కట్టడం చేసేది. చదువు ఆపేసిన తర్వాత బీడీఫ్యాక్టరీలో బీడీలు చేస్తోంది.

సుగుణకు ఇంకా పెళ్లికాలేదు. సుగుణకు పదిహేనురోజుల ఫారంకు ఎనభై రూపాయలు వస్తాయి. పదిహేను రూపాయలు తన చిల్లర ఖర్చులకు అంటే చిరుతిళ్లు, సినిమాలు, బట్టలకు ఉంచుకొని మిగతాపైసలు తల్లిదండ్రులకు ఇస్తుంది.

తల్లిదండ్రులకు సుగుణ గుండెలమీద కుంపటిలా ఉంది. పెళ్లిచేసి ఎప్పుడు ఆ గుండెల మీంచి కుంపటి దించుకుందామా అనే చింత వారికి. సుగుణ మంచి అందగత్తె కాకపోయినా సంసారపక్షంగా ఆకర్షణీయంగానే ఉంటుంది. వయసు వస్తే వంకలన్నీ తీరుతాయి అన్నట్టు సుగుణకు పెళ్లికూతురుకు ఉండవలసిన లక్షణాలన్నీ ఉన్నాయి.

సుగుణ తనకు పెళ్లిచూపులకు వచ్చి చూసిపోయినోల్ల గురించి లక్ష్మితో "పిల్ల మంచిగనే ఉన్నదిగని ఆరువేల కట్నం, ఒక సైకిలు, ఒక గడియారం కావాలె అని అన్నరట, నాయిన్న ముసలోడైపాయె, కాల్జెయ్యి వడిపాయె... అన్న యింకా కాలేజీల్నే సదువవట్టె. అవ్వ, నేను బీడీలు జేత్తే తిండికేగావట్టే. ఏడున్నయి గిన్ని పైసలు. నా దగ్గర ఎల్లయి అన్నడు నాయిన్న"(12)

సుగుణ మాటల్లో పెళ్లికూతురుకు ఉండే సిగ్గు, భయం లేదు, దుఃఖం, సంతోషం లేదు. ఏదో వ్యవహారంలాగ ఏదో కుదరని బేరంలాగా ఉంది.

సుగుణ మాటలు విని లక్ష్మి సాదాసీదాగా, "ఓర్నీ! బీడీల కంపిన్ల నౌకర్లగూడ గంత గంత కట్నాలు గావాల్నా! ఇంక నాల్గువేలు ఎక్కోపోస్తే సర్కారు నౌకరోడు దొరుకడా" అని "మరి నాయిన్నేడిదాక మొగ్గిండే" అని అడుగుతుంది.

సుగుణ "లగ్గంల మా అవ్వకు పెట్టిన గంటెపుత్తె. రెండు తులాల బంగారు గుండ్లు ఉన్నాయి. ఏది జేసినా గదాన్లకెల్లే! పైసలంటే గదే అమ్మాలే. బంగారం గావాలంటే గదే చిదగొట్టి తరుగుకలిపి రెండు తులాల తీగజేసి పిల్లకు వెద్దం గింతకంటె ఎక్కో ఎల్లది అన్నడు" అని ఆకు కత్తిరించుకుంటూ సమాధానం చెప్పింది.

లక్ష్మి "మరి చెవుల కమ్మలు, కాళ్లకు పట్ట గొలుసులు ఏం లేవ?" అంటే



సుగుణ "నాయిన్న బొంబాయిలున్నపుడు అవ్వకుకొన్న యెండి వొడ్డాలం ఉన్నది. దాంట్లకెల్లి కేటియెండివోంగ పట్టివున్నంత పట్టగొలుసులకు ఉంచుకొని మిగిలింది అమ్మి అచ్చిన పైసలతోటి బంగారం కొని యిపుడు పెట్టుకుంటున్న గీకమ్మలల్ల కలేసి ఎంతైతె గంత చేపిత్తడట" అంది.

లక్ష్మి "మరి యింకేందె రెండు తులాల తీగె, అద్దతులం కమ్మలు, ఈడికే అయిదువేలు, పట్టగొలుసులు, బట్టలు, సారె బిందె, తాంబూలం చెంబు, పళ్ళెం, అన్ని గలిసి అన్నపుకర్చు ఏడువేలకు పైన బలువనేవట్టె. యింకేం గావన్నట" లెక్కలు కట్టుతూ, బేరీజులూ వేస్తూ అంది.

సుగుణ నిస్సహాయంగా "పట్టగొలుసులు, కమ్మలు, బట్టలు, సారె, బిందె, తాంబూలం ఇవిగాక సైకిల్, గడియారం, ఆరువేలు గావన్నట" అని చెప్పింది.

సుగుణ తల్లిదండ్రులు ఇంట్లో ముచ్చటించుకొన్న విషయం గురించి" అన్నపుకర్చు ఇయ్యపురాన్ల వాయనం, పదారు పండుగ, దీలెకట్నాలు అన్ని గలిపి అల్లుజెపినట్టుయింటె పన్నెండు వేలదాక అయితయని నాయిన్న అన్నడు" అని లక్ష్మితో అంటుంది.

లక్ష్మి స్త్రీ సహజమైన బాధలో, కోపంగా "పోరగాన్లకు డిమాండు బాగ పెరిగింది. ఏమిట్లకు అక్కరకురానోడు గూడ వేలకు వేలు అడుగవట్టె. గుంటెడు జాగుండది గుడిసెకు కప్పుండదిగని వేలకువేలు కావాలె కట్నాలు! ఏడికెల్లి తెచ్చిపోత్తరనుకుంటరో, మరి ఆడు అంతగనం సంపాదించి ఎన్ని మిగిలిచ్చిండట? ఏమన్న కూసుండవెట్టి తినవెట్టడా గంతగనం కట్నం దీసుకోని?" అని నిష్ఠూరంగా మాట్లాడుతుంది.

సుగుణ వివాహం వారి ఆర్థికస్థోమత తక్కువ కారణంగానే వాయిదా పడింది?

**తెలంగాణాలో ఆనాటి స్త్రీలు నిర్వహించే పనులు**

బీడీ కార్మిక ఇండ్లలో స్త్రీలు ఉదయం నుండి రాత్రివరకు ఎప్పుడు తీరిక లేకుండా ఒక యంత్రంలా పనిచేసేవారు.

లక్ష్మి మాటల్లో : "బీడీల సాట ముందేసుకోంది సంసారమే ఎల్లదాయె పోరగాన్లు, బొట్టెగాన్లు, వండుకునుడు, తినుడు, తానాలు చేసుడు, చేపిచ్చుడు, పోరగాన్లను బడికి పంపుడు, బట్టలుతుకుడు, ఊడ్సుడు, అల్లుకు జల్లుడు, ముగ్గులేసుడు, ఆకు కత్తిరిచ్చుడు, బీడీలు జేసుడు, పోద్దుగాల లేసి మొదలువెడ్తే రాత్రి పదకొండు గొట్టేదాక తీరనే తీరదాయె. రికాంలేని బతుకు, పనిచేసి బొక్కలన్ని తెల్లవడవట్టే.

విశ్రాంతిగా కూర్చునేరోజే లేదు. మాట, ముచ్చట, సుఖం, దుఃఖం అన్ని పనిచేసుకుంటనే చెయ్యాలి" అని కళ్ళల్లోనె ఉబికిన కన్నీరు లోపలికే లాక్కుని కొంగుతో కళ్ళొత్తుకుంటూ తన బాధను తెలియజేసింది.

**ఆభరణాలు**

తీగె, కమ్మలు, పట్టగొలుసులు, వొడ్డాలం, బంగారుగుండ్లు, గాజులు, దుద్దులు, ఇవేకాక ఇంకా ఎన్నోరకాల ఆభరణాలుండేవి కానీ ఇవి మాత్రమే ఈ నవలలో చిత్రించబడ్డాయి.



## పాదసూచికలు

(1) కాసుల ప్రతాపరెడ్డి - బతుకుపోరు దృశ్య కావ్యం; నేటినిజం దినపత్రిక; తేది : 24-3-2005

(2) కాసుల ప్రతాపరెడ్డి - బతుకుపోరు దృశ్య కావ్యం; నేటినిజం దినపత్రిక; తేది : 24-3-2005

(3) 50వ జన్మదిన స్వర్ణోత్సవ సంచిక - బి.ఎస్.రాములు; డా॥ ఎన్.గోపి; పుట : 13

(4) ముదిగంటి సుజాతారెడ్డి గారితో సంభాషణలు.

(5) బతుకుపోరు - మూడవ ముద్రణ; బి.ఎస్.రాములు; పుట : 16

(6) బతుకుపోరు - మూడవ ముద్రణ; బి.ఎస్.రాములు; పుట : 38

(7) 50వ జన్మదిన స్వర్ణోత్సవ సంచిక - బి.ఎస్.రాములు, గూడ అంజయ్య; పుట : 16

(8) బతుకుపోరు - మూడవ ముద్రణ; బి.ఎస్.రాములు; పుట : 85

(9) ముదిగంటి సుజాతారెడ్డి గారితో సంభాషణలు.

(10) వనమాల చంద్రశేఖర్ గారితో సంభాషణలు.

(11) బతుకుపోరు-మూడవ ముద్రణ; ఎస్.రాములు; జె.ఎస్.రఘుపతిరావు; పుట: 27

(12) బతుకుపోరు నవల - మూడవ ముద్రణ; బి.ఎస్.రాములు; పుట : 23





# బతుకుపోరు-రచనా శిల్పం

### రచనా శిల్పం అంటే ఏమిటి?

"కొందరు శిల్పం అంటే శైలీ అంటారు, కొందరు శిల్పం అంటే పోకడ అంటారు. కొందరు కుశలత్వం అంటారు. కొందరు నిపుణత్వం అంటారు. ఆంగ్లంలో శిల్పం అంటే 'టెక్నిక్' అని అర్థం... ఏది ఎప్పుడు చెప్పాలనేదే శిల్పం అంటారొకరు. కథ నడపడంలో, పాత్ర చిత్రణలో సంఘటన సృష్టించడంలో, సంఘర్షణ చూపించడంలో సన్నివేశాన్ని నడపటంలో సంభాషణలు రచించడంలో, నేపథ్యంలో కూడా శిల్పాన్ని చూపిస్తారు. అంటే ఆ దృశ్యానికి సరిపడా వాతావరణాన్ని సృష్టించడంలో, ఆ దృశ్యానికి సరిపోయిన సహజ ధ్వనిని, కృత్రిమ ధ్వనిని కల్పించడంలో కూడా శిల్పం ఉంటుంది. అన్నింటినీ మించి అభినయ శిల్పం కూడా తోడవుతుంది. శీర్షికను పెట్టడంలో, పాత్రలకు నామకరణం చెయ్యటంలో, ప్రతీకల్ని ప్రదర్శించడంలో శిల్పాన్ని చూడాలి. ఇవన్నీ కలబోసి సాధించేదే కథన శిల్పం." [1]

శిల్పం 11 భాగాలుగా చెప్పవచ్చు. "1) కథాశిల్పం, 2) పాత్రచిత్రణ శిల్పం, 3) సంఘటనా శిల్పం, 4) సంఘర్షణ శిల్పం, 5) సన్నివేశ కల్పనా శిల్పం, 6) సంభాషణ రచనా శిల్పం, 7) నేపథ్య శిల్పం, 8) అభినయ శిల్పం, 9) శీర్షికా శిల్పం, 10) నామకరణ శిల్పం, 11) ప్రతీకాత్మక శిల్పం [1]

### బతుకుపోరు కథా నిర్మాణం

'బతుకుపోరు' కథా నిర్మాణం మొదటి భాగం అంతా లక్ష్మి దినచర్యలో భాగంగా సాగుతుంది. రెండవ భాగం లక్ష్మి కన్నా ఎంతో ముందునుండి బీడీ చేసి వృద్ధులైన రామక్క కుటుంబ విచ్ఛిన్నత సామాజిక నేపథ్యం నుంచి మొదలవుతుంది. సమ్మెలో ఎదురయ్యే చర్చలు, సన్నివేశాలు, సమ్మెకాలంలో ప్రవర్తించే స్వభావాలు, అలా ప్రవర్తించడానికి గల భౌతిక పునాది కథా కథనంలో భాగంగా సాగుతుంది. ఇలా కథా నిర్మాణం ఒక కుటుంబం ఉదయం నిద్రలేవడం నుండి ప్రారంభమై బీడీ

కార్మిక కుటుంబ జీవనాన్ని చిత్రిస్తుంది. క్రమంగా ఒక్కొక్క కుటుంబం అనేక కుటుంబాలుగా సామాజిక, సామూహిక జీవనంగా ఐక్యత పొంది తమ సమస్యల కోసం కలసికట్టుగా ఉద్యమించే శక్తిగా రూపొందుతారు.

"వైయక్తిక జీవితం విసిగి వేసారి సామూహికతను సంతరించుకుంటుంది. ఎప్పటికైనా బాధలు పడే వారందరిది ఒకే ఆశయంగా మలుపు తిరుగుతుంది. సేటుమీద తిరగబడ్డ నారాయణ, సుగుణ వెల్తురు కిరణాల్లా ఎర్రరంగులో రాసిన పోస్టర్లు అంటించడానికి వెళ్ళడంతో ముగుస్తుంది నవల. ఇట్లా బతుకునీ, అందులో బాధల్నీ వాటితో పాటు పోరాటాన్నీ రాములు 'బతుకుపోరు' మన కళ్ళకు కట్టినట్లుగా చూపుతుంది"[2]

## జీవితంలోంచి నవలలోకి నడిచి వచ్చిన పాత్రలు

బతుకుపోరు నవలలోని కొన్ని పాత్రలు జీవితంలో ఎదురైతే వీళ్ళు ఫలానా పాత్ర అని గుర్తు పట్టేంత స్పష్టంగా పాత్ర చిత్రీకరణ చేశారు. సుప్రసిద్ధ ఫ్రెంచి రచయిత ఎమిలీజోలా రాసిన 'భూమి' నవలలోని పాత్రలు ఫలానా వారు అని ఆ కాలంలో ఆ ఊరి వాళ్ళంతా చర్చించుకున్నారు. అలాగే రష్యా రచయిత మాగ్జిమ్ గోర్కి రాసిన 'అమ్మ' నవలలోని పాత్రలు ఫలానా ఫలానా వాళ్ళు అని రష్యా ప్రజలు పోల్చుకున్నారు. 'బతుకుపోరు' నవలలోని పాత్రలను కూడా ఇలా స్పష్టంగా ఆ ప్రాంతంలో పోల్చుకుంటారు. "డా॥ దాశరథి రంగాచార్య ఈ నవలలోని పాత్రలు తనకు ఎదురైనట్లు ఆ పాత్రలు తనకు కథ చెప్తున్నట్లు ఇలా రాశారు :

"కొత్త తాటాకు కప్పుకింద, పుట్టమన్నూ, ఎర్రమన్నూ అలికిన అరుగుమీద, ఈతాకుల చాపమీద పడుకొని, తాటాకు, విసనకర్రతో విసురుకుంటున్నాను. ఈలోగా అడుగుల సవ్వడి. లక్ష్మి, సత్తెమ్మ, రామక్క, లచ్చిరాజు, సుగుణ, సావిత్రి, నారాయణ, రాజేశం, రాజయ్య, శ్రీనివాస్ తునికిపళ్ళు తెచ్చి చుట్టూ కూర్చున్నారు. తునికిపళ్ళు తింటూ నాకందిస్తూ చెపుతున్నారు బతుకుపోరు. సుగుణ ఛాయ్ చేస్తానని లోపలికెళ్ళింది. అగ్గిపెట్టె నాదగ్గరుందని అనుసరించాడు నారాయణ. సమ్మె చేస్తున్నాం అని రామక్క చెపుతున్నప్పుడు సుగుణ, నారాయణ గులాబి బుగ్గల్తో ఇత్తడి గ్లాసుల్లో ఛాయ్ తెచ్చిన్రు. శక్కర్ లేదు బెల్లమేసినం ఏమనుకోకున్రి అని. "మీ చూపులే బాగున్నాయ్ చాయెట్ల బాగుందది" అని అందుకుంది లక్ష్మి.

బతుకుపోరు నేను చదవలేదు వాళ్ళు చెప్పిందే విన్నా."[2/2]



తెలంగాణ పల్లె సొంతం నవలలో కాపురం పెట్టింది. కదలనంటున్నది. కందిలి, ఎక్క, బావి, పొట్టుపొయ్యి తిష్టవేశాయి. అందం ఆకురాలిన చెట్టుకు కూడా ఉంటుంది. అనుభవించడం అందరికీ చేతకాదు.

పల్లె పట్టుల జీవితం దిశమొలతో దిగంబరంగా కనిపించింది.

తెలంగాణ పల్లె పాత్రలు తప్ప అంత నిష్కపటంగా అంత అమాయకంగా అంత ఆవేశంగా అంత ఉద్రేకంగా అంత ఉద్విగ్నంగా ఉండలేవు. ఇది తెలంగాణ విశిష్టత. ఇదే తెలంగాణ బలహీనత.

మన బతుకుపోరులో మట్టి, పెండ, చెమట, తంబాకు వాసనలు గుబాళిస్తున్నాయి. పరిమళం, బీడీ ఆకుకు, వేప పూతకూ ఉంది. ఆస్వాదించడం రావాలి.

బతుకుపోరు చలిమంట సెగలా, చల్లని వెన్నెలలా, గ్రీష్మతాపంలా సహజంగా ఉంది. ఇందులో అసహజమూ అవాస్తవం లేదు.

వాళ్ళు కదుల్తే మనం వాళ్ళను అనుసరించాల్సిందే అన్నాను 'జనపదం'లో. ఇక్కడ రామక్క కదిలింది. లక్ష్మి కదిలింది. కావలసింది కదలడమే.

ఆ తరువాత వాళ్ళే నేతలు. శ్రామికులు నేతలు కావాలనేదే మన విశ్వాసం. ఆ తరువాత అంతా సంగ్రామమే వచ్చేది.

చీకటి కడుపులో చిచ్చు రగిల్చే వెలుతురు."[3] అన్నారు దాశరథి రంగాచార్య.

## నవలలో సన్నివేశాలు, సంఘటనల చిత్రణ

బతుకుపోరు నవలలోని అనేక సన్నివేశాలు, సంఘటనలు సబ్బని లక్ష్మీ నారాయణగారు అన్నట్లు ఫ్రేములు ఫ్రేములుగా కళ్ళముందు కదలాడతాయి. ఆయన ఇలా అంటారు. "బి.ఎస్.రాములుగారి 'బతుకుపోరు' నవల బీడీ కార్మికుల సజీవ చిత్రణ. ముఖ్యంగా స్త్రీ పాత్రలు ప్రధానంగా గల నవల. ఈ నవల చదువుతుంటే కళ్ళకు కట్టినట్లు ఫ్రేములు ఫ్రేములుగా పాత్రలు మన కళ్ళముందు కదలాడుతుంటాయి. ఎందుకంటే రచయితకు ఆ పాత్రల యెడల, సన్నివేశాల యెడల పూర్తి అవగాహన ఉంది. అందుకే బి.ఎస్.రాములుగారు నవలను అంత సజీవంగా మలచగలిగారు. ఇందులో వాడిన భాష సజీవమైన తెలంగాణ భాష."

"సాహిత్య శైలిని అధ్యయనం చేయడం మన దేశంలోనూ, పాశ్చాత్యా దేశాల్లోనూ చాలా శతాబ్దాలుగా జరుగుతోంది. వాక్యపదీయం, ధ్వన్యా లోకం, వక్రోక్తి జీవితం లాంటి గ్రంథాలు శైలిని అధ్యయనం చేయడంలో గొప్ప విజయాలను సాధించాయి.

కానీ శైలి శాస్త్రం మాత్రం ఈ శతాబ్దంలోనే పుట్టింది. ఈలోగానే అభివృద్ధి చెందుతోంది. ఈ శాస్త్రాన్ని ఆంగ్లంలో స్టయిలిస్టిక్స్ అంటారు. శైలి శాస్త్రం ఈనాడు సాహిత్య విమర్శలో ఒక ప్రధాన అంగంగా మారిపోయింది.[4]

నవలా శిల్పం గురించి నవలను పరిశీలించాల్సిన తీరు తెన్నుల గురించి రాల్‌ఫాక్స్ 1937లో 'నవల ప్రజలు' అనే గ్రంథం రాశారు. మొదలి నాగభూషణ శర్మ నవలా వికాసం చర్చించారు. సి.ఆనందరామం నవలా విమర్శ రీతులను చక్కగా తెలిపారు. డా॥ ముదిగంటి సుజాతారెడ్డి 'నవలానుశీలనం' అనే గ్రంథాన్ని వెలువరించారు. అందులో ప్రాచీన కావ్యాల రసధ్వని సిద్ధాంతాల చర్చను కూడా అన్వయించారు. అయితే అన్ని కళల సంగమమైన సినిమా గురించి పరుచూరి గోపాలకృష్ణ రాసిన సాహిత్య గ్రంథం, సాహిత్య విమర్శ రీతులు ఏవి. కాలేజి సెమినార్ గ్రంథం అనేక విషయాలను అప్‌డేట్ చేశాయి. ఒక చక్కని ఆర్ట్ సినిమాలాగా 'బతుకుపోరు' నవల భాసిస్తుంది.

లక్ష్మి ఉదయం లేచినప్పటి నుంచి జరిగే సంఘటనలతో తెలంగాణ బీడీ కార్మికుల కుటుంబం పరిచయమవుతుంది. కరుణ రసాత్మకంగా కథనం సాగుతుంది. మాసిన బట్టల కోసం చాకలిమైసి ఇంటికి వచ్చినపుడు ఆమె మాటల్లో, ఆమె జీవిత సారాంశాన్ని కథా నిర్మాణానికి ఉపకథలాగా సహజంగా అల్లుకుపోయింది.

"ఏదో కుల కశిపి అని బుక్కెడంత అన్నం దొరుకుతదని గని ఏంగాలి పేయింది యింట్ల? మీ ముట్టుబట్టలు, మైలబట్టలు ఉతికి ఉతికి పెయి ఎండుకుపాయె. పొద్దుందాక ఎండకు ఎండి ఎండి ఉండి బొగ్గైతి. సోడనీల్లు మీదపడి ఎంటికెలన్ని ఎర్రవడిపాయె. ఇద్దరు పోరగాన్లకె నన్ను ముసల్దాని తీరుగున్నవు అనవట్టిరి. ఏం కుల కశిపో తియి. అందరికంటె యీనం మా బతుకు" అని అంటూ విడి చేసిన చీరల్ని మడతవేస్తూ ముల్లె గట్టింది. మైసికి బ్రతుకుమీద ఎందుకో విసుగనిపించినట్టుగా ఉంది. మైసి గొంతు గట్టిగా నొక్కి మొదటిలా అరవలేకపోయింది"[5]

పని పాటలు చేసుకొని బతికే వాల్ల పిల్లలకు తల్లి స్నానం చేయించడం కూడా కుదరదు. పిల్లలే ఎవరికి వారు తోచిన విధంగా స్నానం చేస్తారు. నెత్తి నూనె ముక్కవాసన వేస్తుందని కొడుకు తల్లిని తలంటు స్నానం చేయించమని అడుగుతాడు. తల్లి ఆదివారంకు వాయిదా వేస్తూ బుజ్జగిస్తుంది. ఇలా కుటుంబ సంబంధాలు, మానవ సంబంధాలు, సామాజిక సంబంధాలు, నిత్యజీవితంలో ఒకే సమయంలో ఎలా కొనసాగుతాయో, బడికిపోవడం, చాకలి మైసి బట్టలకు పోవడం, పిల్లలు స్నానం చేయించమని అడగడం, పొరుగింటి సుగుణ బీడీ ఆకు కత్తిరించుకోవడం కోసం



లక్ష్మి ఇంటికి రావడం, సుగుణ పెళ్ళి చూపులు తర్వాత ఎక్కడిదాకా వచ్చిందని అడగడం ఆ సందర్భంగా పెళ్ళి సంస్కృతి చర్చ జరగడం, బీడీల దారం రీలుకు చుట్టి ఇవ్వడం, చిన్నవాడికి స్నానం చేయించి పాలు ఇచ్చి కొద్దిసేపు మేనువాల్చాలని అనుకుంటుంది. ఇది ఇంట్లో ఇంటివద్దకే వచ్చిన సామాజిక జీవితం.

ఆ వెంటనే లక్ష్మి ఇలా ఒరిగిందో లేదో ఉదయం బట్టల బాకీల వసూలుకు వెళ్ళిన రాజయ్య సైకిలు గంట మోగించడం, అతని మొఖం పీక్కుపోయి ఉండటం. ఏంది గట్ల వున్నవు? అని అడిగితే మాదాపురం పోయిన ఆడ మా పెద్దవ్వ బిడ్డ కొడుకు వెంకట రాజంను పోలీసోల్లు కాల్చి చంపిన్రు, అని అనడంతో కథా నిర్మాణంలో భాగంగా అంతర్లీనంగా ప్రభుత్వం, విప్లవ కార్యకర్తల ఎన్‌కౌంటర్లు జరుగుతున్న క్రమం చిత్రించబడింది. 1980లో జరిగిన దత్తాసామంత్ నాయకత్వంలోని బట్టలమిల్లు సమ్మెవల్ల ఇంటికి వచ్చిచేరిన అంకం నారాయణ, వాసం గజేందర్‌లను పోలీసులు హోటల్‌లో పట్టుకొని కాల్చివేసిన చారిత్రక సంఘటన పువ్వులో పువ్వులా కథనంలో ఇమిడిపోయింది. చనిపోయిన మేనల్లుడి ముఖం గుర్తుకు వచ్చి రాజయ్య అన్నంలోనే చేయి కడిగి లేచాడు. బయటి ప్రపంచం కుటుంబంలోకి ఎలా వస్తుందో యీ కథా నిర్వహణలో చక్కగా ఒడిసిపట్టుకున్నారు.

అటు తర్వాత రాజయ్య బట్టలషాపుకు వెళ్తాడు. పిల్లలు బడి నుండి వస్తారు. బడినుండి వచ్చి నాన్న కొత్త అంగి బట్టలు తెచ్చిండా? అని అడుగుతారు. లక్ష్మి వారితో వాదన ఇష్టం లేక ఇంకా తండ్రి ఊరి నుంచి రాలేదని చెప్తుంది. ఇలా కుటుంబం పిల్లల సన్నివేశం వస్తుంది.

సుగుణ ఇంటికి వెళ్ళి పెళ్ళి సంబంధం ఎలాగైనా ఖాయం చేయించాలనుకొని పసివాన్ని చూస్తూ ఉండమని లక్ష్మి శ్రీనుకు చెప్పి బయలుదేరుతుంది. వెల్తున్నది పెళ్ళి సంబంధం ఖాయం చేయడానికి. దారిలో పెళ్ళి పిల్లవాడే ఎదురవుతాడు. బీడీ కంపెనీలో దాదా అని పిలిచే మేనేజరుతో పోట్లాట పెట్టుకొని వికలమైన మనసుతో వెల్తున్న నారాయణను లక్ష్మి సుగుణ సంబంధాన్ని ఎందుకు వద్దన్నావని నవ్వుతూ నిలదీస్తుంది. నిరుద్యోగికి ఇప్పుడే పెళ్ళి ఎందుకు అని తగరాని (గొంతెమ్మ కోరికలు) కోరికలు కోరితే వాల్లే ఊరుకుంటారని అలా చెప్పినట్లు జవాబు ఇస్తాడు నారాయణ. ఈ సందర్భంగా ఆడవాల్లు, మగవాల్లు సమానంగా పని చేస్తున్నారని కట్నం కోరడం తప్పని లక్ష్మి వాదిస్తుంది. ఇలా యీ సన్నివేశ చిత్రణల ద్వారా జీవితంలో ఒక ప్రధాన ఘట్టమైన పెళ్ళి గురించి తెలంగాణ పేద, మధ్య తరగతి తీరు తెన్నుల గురించి చెప్పడం, కథా కథన నిర్మాణాన్ని తెలుపుతుంది.

నారాయణ తల్లి లచ్చిరాజవ్వ గురించి లక్ష్మి చెప్పిన మాటలో రచయిత కంఠస్వరం కూడా చూడవచ్చు. "పాపం మీ అవ్వ ఏం సుకపడ్డదోయి! నువ్వు పాలు మరవకముందే మీ నాయిన్న వోయిండట. గప్పట్నుంచి మీ అవ్వ కండ్లల్ల వత్తులేసుకొని బీడీలు జేసుకుంట నిన్ను సాదుకత్తాంది. మాకు మీ అవ్వనే గాదోయి బీడీలు నేర్పింది"[6] అని రెండు వాక్యాల్లో దశాబ్దాల బీడీ కార్మిక జీవితాన్ని పిల్లల భవిష్యత్తు మీద ఆశలు పెట్టుకొనే తల్లుల గురించి చిత్రించారు. ఆమె రచయిత బి.ఎస్.రాములు తల్లి మాత్రమే కాదు. అందరి తల్లి కూడా.

కథా నిర్మాణంలో యదార్థ జీవితాలను ఎలా చిత్రించారో నిజ జీవితంతో పోల్చి చూస్తే కథా నిర్మాణ నైపుణ్యం తెలుస్తుంది. బి.ఎస్.రాములు తన తల్లి పాత్రను మూడు స్త్రీ పాత్రలుగా భాగించాడు. చిన్న పిల్లలుగా ఉన్నపుడు బి.ఎస్.రాములు తల్లి ఎలా ఉండేదో లక్ష్మికి పిల్లల పట్ల ఉన్న ఆశ ద్వారా చిత్రించారు. లక్ష్మికి కూడా ముగ్గురు పిల్లలు. రచయిత తల్లికి కూడా ముగ్గురు పిల్లలు. ఆ తర్వాత వయసు పెరిగి ఎంతో కష్టపడి చదివించిన కొడుకు నిరుద్యోగిగా మిగిలిపోగా అకాల వృద్ధాప్యం ఆమెను ఆవహించిన తీరును నారాయణ తల్లి లచ్చిరాజవ్వ పాత్రలో నారాయణ మీద ఆశల రూపంలో చిత్రించారు. సామాజిక హింస వల్ల కొడుకును పోగొట్టుకున్న రచయిత తల్లి ఆవేదనను రామక్క పాత్రలో చిత్రించారు. ఇలా ఒకే పాత్రను కథా కథన నిర్మాణంలో బీడీ కార్మికుల జీవితాల్లో అనేక దశలను చిత్రించడానికి మూడు పాత్రల్లో చిత్రించారు. ఇలా యదార్థ జీవితం కథా వస్తువు నిర్మాణంలో ఒదిగిపోయింది.

లక్ష్మి బీడీ కంపెనీలోకి బీడీలు చేయడానికి వెళ్ళినపుడు బీడీ కంపెనీ పరిసరాలను, మిగతా కార్మికుల వ్యక్తిత్వాలను చక్కగా చిత్రించారు. ఇలా అందరిలో ఒకరిగా లక్ష్మి మారిపోతుంది. అనగా ఒకే మాటలో చెప్పాలంటే బీడీ కంపెనీకి వచ్చేదాకా ఇంటివద్ద అందరి జీవితాలు సుమారు ఒకేరకంగా ఎలా వుంటాయో నమూనాగా లక్ష్మి కుటుంబాన్ని చిత్రించారు. ఇలా మొత్తం బీడీ కార్మిక కుటుంబాలను చిత్రించిన ఫలితాన్ని సాధించారు.

బీడీ కార్మికులకు భవిష్యత్ పట్ల ఆశలు వున్నాయి. పిల్లలను ఆశాజ్యోతుల్లా చూస్తుంటారు. అలా ఎదుగుతున్నారు అనడానికి నిదర్శనంగా లక్ష్మి మరిది డాక్టరు కోర్సు చదువుతున్నాడని చెప్పకుండానే సూచిస్తారు. తల్లి, చెల్లెలు బీడీలు చేసి అన్నలను, తమ్ముల్లను చదివించిన సంఘటనలు యీ ప్రాంతంలో కోకొల్లలు.

బీడీ కంపెనీ పని చేసే తీరు కథా కథనంలో సహజంగా వర్ణిస్తారు. కాసుల ప్రతాపరెడ్డి "శ్రామిక బహుజన స్త్రీల దృశ్యకావ్యం బతుకుపోరు" అని అందుకే అన్నారు.



కథా నిర్మాణంలో సామాజిక పరిణామాన్ని ఇలా ప్రతీకాత్మకంగా చిత్రించారు. కాసుల ప్రతాపరెడ్డి ఇలా విశ్లేషించారు.

"మాదాపురం వోయిన. ఆడ మా పెద్దవ్వ బిడ్డ కొడుకు వెంకటరాజంను కాల్చి సంపిన్రు" అని రాజయ్య భార్య లక్ష్మితో చెప్పిన సందర్భం, అంతకుముందు వారిరువురి మధ్య జరిగిన సంభాషణ ఆ సంఘటన తీవ్రతను చెబుతుంది. తెలంగాణ నిత్యగాయాల నదిగా మారిన క్రమానికి తొట్టతొలి ఆనవాలు ఇది. అనూహ్యమైన, బాధాకరమైన విషయాన్ని విన్నప్పుడు ఏమవుతుంది. చేతిలో పని ఆగిపోతుంది. అలా లక్ష్మి చేతిలోని బీడీ ఆకు కత్తించే 'కత్తెర టకటక ఆగిపోయింది.[7] "తెలంగాణ ప్రాంతంలో విప్లవోద్యమం జరుగుతున్న కాలంలో "బతుకుపోరు" నవల వచ్చింది. ప్రారంభమైన ఎన్‌కౌంటర్లలో మొట్టమొదటిది ఏదో చెప్పడం కూడా కష్టమే. కానీ తెలంగాణ ప్రాంతం వారికి అది ఇప్పటికీ సలుపుతున్న గాయం.

"సమగ్ర ఇతివృత్తంలో ఎత్తుగడ, వికాసం, ముగింపు వుంటాయి. సంఘటనల మధ్య క్రమబద్ధత, పాత్రల మధ్య సరైన సంబంధం వల్ల ఇతివృత్తలో ఐక్యత సిద్ధిస్తుంది. భావస్ఫోరకమైన ముగింపు వుంటుంది." [8]

బతుకుపోరు నవల ప్రారంభంలోనే కుటుంబాన్ని చక్కగా సన్నివేశాల ద్వారా వారి స్వభావ చిత్రణ ద్వారా పరిచయం చేస్తారు. పాత్రల స్వభావ వైవిధ్యాన్ని, వ్యక్తిత్వాన్ని రూపుకట్టించారు.

## లక్ష్మి బాల్యజ్ఞాపకాలు

"లక్ష్మికి గత స్మృతులు జ్ఞప్తికి వచ్చాయి. తను అప్పుడు పెళ్ళికాని పిల్ల. యిప్పటి సుగుణలా నవ్వుతూ, తుళ్ళుతూ ఏ చింతా బాధ్యతా లేని కాలం. తల్లిచాటు పిల్ల, ఎంతెగిరినా తరిగిపోని ఉత్సాహం. మైదాకుతో ఓ రోజు, పెండగుల్లలతో ఓరోజు, దారం కట్టడానికి ఓరోజు, ఏ బాధ్యతా లేదు. ఏ బాధా లేదు. తల్లి ఎంత చెప్పినా అలా విని యిలా వదిలేసి తన ఆట తనకే. తన స్నేహితులు తను. మళ్ళీ చిన్నపిల్లనైపోతే ఎంత బాగుండుననుకుంది లక్ష్మి ఒక క్షణం."[9]

కథా నిర్మాణంలో బీడీ కార్మికుల జీవితాలు క్రమంగా ఎలా శిధిలమవుతాయో రచయిత చిత్రించారు. ఆ సందర్భంగా బీడీ కార్మికుల జ్ఞాపకాలు చిత్రించి ఆ జీవితం ఎంత హాయిగా వుండేదో గుర్తు చేస్తాడు. ఇక్కడ మానసిక చిత్రణ చూడవచ్చు.

## బీడీ కార్మికుల వృద్ధాప్యం

బి.ఎస్.రాములు తన తల్లి వృద్ధాప్యాన్ని గురించి ఇలా లచ్చిరాజవ్వ మాటల్లో వ్యక్తం చేశారు.

"నీడపట్టుకు కూసుండి చేసుడేగదా అనుకొన్న తొల్తల. కూసుండి కూసుండి నడుమువాయె, దారం సూసి సూసి కండ్లు వాయె, తంబాకు ఘాటు వశపడక పాన్ అలవాటు జేసుకుంటె పండ్లు పాడైపాయె, పుప్పి పండ్లయిపాయె, పండ్లు ఊసిపోయేసరికి ముసల్దాని తరీకైతి. ఈ బీడీలు జేసి సంపాదించింది లేదాయె, బంగ్లాలు గట్టింది లేదాయె, ఉత్తగపానం తెర్లయిపాయె."

"నీడపట్టుకు ఉండచ్చు. పొద్దుందాక తెల్లందాక జేసుకుంటె యింత కూలన్న ఎక్కో గిడుతుందని సూసుకుంటె పానం తెర్లయిపాయె. నా తోటిది పోసాని. అది బీడీలు నేర్చుకుంటె దానికి అంటలే. దాని పెద్దనేలుకు చిన్నప్పుడు జెట్ట పుట్టిండె. యేలు సక్కగ అంగకపోవు. అదిగదె యెవుసపు పనికి, కయికిలికి పోతాంది. ఎట్లుందె అది యిపుడు నీ తీర్గ గట్టిగ పిడుక కున్నెవోలె! వయిసుల నాకంటే రెండేండ్లు పెద్ద అది" అంటూ వాపోయింది లచ్చిరాజు."[10]

## మారుతున్న మానవ సంబంధాల పట్ల భయం

మారుతున్న సమాజంలో ఏర్పడిన మానవ సంబంధాలు ఎలా స్వార్థపూరిత మవుతాయో అన్న భయం లక్ష్మి మరిది డాక్టరు అయ్యాక "తన పిల్లల్ని చదివిస్తడో లేదో?" అనే మాటల ద్వారా వ్యక్తం చేస్తారు. లక్ష్మి లచ్చిరాజుతో మాట్లాడి నారాయణకు సుగుణతో సంబంధం ఒప్పిస్తుంది. బీడీ కార్మికులు కులాతీతంగా, మతాతీతంగా వరసలు పెట్టి పిలుచుకుంటారు. పండగలకు పిలుచుకుంటారు. కార్మికులందరు కలిసి చిట్టీలు వేసుకుంటారు. అవసరమైన వారికి ఇస్తుంటారు. స్వశక్తి సంఘాల కన్నా ముందునుండి స్వయంగా బీడీ కార్మికులు పరస్పరం సహకారంతో ఒకటిగా వుంటారు. ఎవరికి కష్టం వచ్చినా అందరు కలిసి ఆదుకుంటారు.[11] ఇలా వారిలో సామాజిక మానవీయ సంబంధాలు, సంఘటిత శక్తి ఎంతో ఆదర్శవంతంగా ఉంటుంది.

బీడీ ఆకు ఎక్కువ ఖర్చు చేశారని కూలీడబ్బులు తగ్గించి ఇవ్వడాన్ని వ్యతిరేకించడంతో రెండవ పోరాటానికి బీజాలు పడతాయి. మొదటి పోరాటం నారాయణ చేశాడు. అది వ్యక్తిగతమైనది. ఓడిపోయింది. రెండవ పోరాటం సమిష్టిపోరాటం ఇది ఓడిపోదు. గెలుస్తుంది. అందుకు చిత్తశుద్ధి గల నాయకత్వం



రామక్క, శంకర్ పాత్రల ద్వారా చిత్రించారు. కథ ముగింపులో నారాయణ, సుగుణ, లక్ష్మి, రామక్క అందరూ కలిసి సమ్మెను ఉధృతం చేయడానికి తలా ఒకపని చేస్తుంటారు. నారాయణ చేతిలో సమ్మె పోస్టర్లు ఉంటాయి. ఇలా కథా నిర్మాణం జీవిత చిత్రణ నుంచి సమస్యల నుంచి సామాజిక ఉద్యమాలుగా కదలడంగా సాగుతుంది. ఆ కాలంలో వెలువడిన ఉద్యమ కథలు, నవలలు అన్నీ సుమారు ఇలాంటి ముగింపులతోనే వచ్చాయి. ఉద్యమాలు చేయడమే ఆనాడు ప్రధానంగా భావించారు. ఇలా కథా నిర్మాణం జీవితం నుండి పోరాటంలోకి సాగుతూ వుంటుంది. పోరాటం నుండి తిరిగి జీవితాన్ని గెలుచుకోవడం కోసమే. ఈ రెండవ అంశాన్ని ఆనాటి ఉద్యమ నవలలు వదిలివేశాయి. అయితే ఈ నవలలో ఒక ప్రత్యేకత ఉంది. "యీ నవలలో బి.ఎస్.రాములు అనేక విషయాలు చిత్రీకరించాడు. వ్యక్తులు, విప్లవకారులు అయినా కాకపోయినా వాళ్ళమధ్య మానవ సంబంధాలుంటాయి. ఈ నవల రాసేనాటికి మానవ సంబంధాల చిత్రణ విప్లవ సాహిత్యంలో రెండవ స్థానంలోనే ఉంది. ఆ కాలంలో రాములు ఈ సమాజ సంబంధాల చిత్రణని ప్రధానంగా తీసుకొని వాటిద్వారా ఉద్యమ పురోగతిని చిత్రించాడు. నిజానికి ఆచరణలో విప్లవకారుల క్రమం కూడా అదే. తోటి జనంతో మానవ సంబంధాలే లేకపోతే ఒక వ్యాపారి, రైతు తన సరుకుని అమ్ముకోలేనపుడు విప్లవ ప్రయోజనాన్ని ఆశించేవాళ్లు వాటిని నిర్లక్ష్యం చేయజాలరు. విప్లవ సాహిత్య కారులు అసలే నిర్లక్ష్యం చేయకూడదు.[12] అదే యీ నవలను విప్లవ నవలగా కాకుండా సామాజిక నవలగా, ఉత్పత్తి సంబంధాలు చిత్రించిన నవలగా సామాజిక, ఆర్థిక, చరిత్రలను చిత్రించిన నవలగా వర్గీకరించడం జరుగుతున్నది.

1991లో రెండవ ముద్రణకు ముందుమాట రాస్తూ 1982లో మొదటి ముద్రణ వెలువడినప్పుడు నవలను కొందరు నిర్లక్ష్యం చేసిన ఆనాటి ధోరణుల గురించి కె.రామ్మోహనరాజు ఇలా గుర్తు చేశారు. "ఈ మధ్య ఆధునిక సాహిత్యంలో స్త్రీ సమస్య వస్తువుగా సాహిత్య సృష్టి జరుగుతూ ఉంది. కాని సామాజిక సమస్యలు వాటి పరిష్కారాల్ని ఉత్పత్తి సంబంధాల రీత్యా విశ్లేషిస్తూ స్త్రీ సమస్య పరిష్కారం సామాజిక సమస్య పరిష్కారంలో మాత్రమే ఉందనే సత్యాన్ని ఈ నవల ఆనాడే చిత్రించింది. ఇది ఈ నవల రాసే నాటికి అభివృద్ధికర అంశం. ఈ కోణాన్ని సమీక్షలు పట్టించుకోనేలేదు."[13] బతుకుపోరు రెండవ ముద్రణను నేటి ఆంధ్రజ్యోతి దినపత్రిక సంపాదకులు కె.రామచంద్రమూర్తి, సీనియర్ జర్నలిస్టు అంబటి సురేంద్రరాజు గారలు కరీంనగర్ జిల్లా పరిషత్ హాలులో ఆవిష్కరించారు.

'బతుకుపోరు' నవలలో సామాజిక చరిత్ర ఉంది. కుటుంబ సంబంధాలు వున్నాయి. ఉత్పత్తి సంబంధాలు వున్నాయి. స్త్రీల సమస్య వుంది. పిల్లల సమస్య వుంది. వృద్ధుల సమస్య వుంది. మానవ సంబంధాల తీరుతెన్నులు వున్నాయి. మానవ స్వభావ చిత్రణ ఉంది. నవలలో అంతర్లీనంగా సామాజిక చరిత్ర వుంది. తెలంగాణ సంస్కృతి వుంది. మనో విశ్లేషణ వుంది. నిరుద్యోగ సమస్య వుంది. ప్రకృతి వర్ణన వుంది. స్త్రీ, పురుష సంబంధాలు వున్నాయి. ఉత్పత్తి సంబంధాల్లో భాగంగా నిర్దేశితమవుతున్న మానవ సంబంధాలు ఉన్నాయి. ఇలా దాశరథి రంగాచార్య వంటివారు 'తెలంగాణ పల్లె సొంతం నవలలో కాపురం పెట్టింది" అన్నారు. వీటన్నిటి రీత్యాచూస్తే యీ నవల సమకాలీన చారిత్రక, ఆర్థిక, సామాజిక, ఉత్పత్తి సంబంధాల, స్త్రీ కార్మిక జీవితాల నవల.

### ఇతివృత్త నిర్వహణ

తెల్లవారురఝామున నిద్రనుంచి లేచే సన్నివేశాలను, సంఘటనలను, సంభాషణలను చిత్రించడంతో 'బతుకుపోరు' నవల ప్రారంభమవుతుంది. "నిశ్శబ్దంలో ప్రకృతి ప్రశాంతంగా విశ్రమిస్తుంది" అని నవల మొదలవుతుంది. ఎందుకు విశ్రమిస్తుంది? అని తానే ప్రశ్న వేసుకొని తెల్లవారితే మళ్ళీ సత్తువతో పనులు చేసుకోవడానికి లోకం విరామంగా నిద్రిస్తున్నది" అని అంటారు.. ఆ తర్వాత ఇల్లు, ఇంట్లోని గ్యాసు నూనె గుడ్డిదీపం గురించి ఎవరెవరు ఆ యింట్లో ఎలా పడుకొని వున్నారో వారు నిద్రలేచే క్రమం ఎలా ఉంటుందో సహజంగా చిత్రించారు.

### నవలలో మొదటి సంభాషణ

"ఔ" అని భర్త రాజయ్యను లక్ష్మి పలకరిస్తుంది.

"ఔ" అని పిలవడం తెలంగాణలో "ఏమండి మిమ్మల్నే" అనిపిలవడంతో సమానం.

భార్యా, భర్తలు తెలంగాణలో, గ్రామీణ ప్రాంతాలలో పేర్లు పెట్టి పిలుచుకోరు. కోస్తా, ఆంధ్ర భాషలో ఏమండి, మిమ్మల్నే అని పిలుస్తారు. తెలంగాణ భాషలో "ఔ", "ఔనే", "విన్నవ, విన్నావె, అని, ఉన్నవ అని పలకరింపుగా పిలుస్తారు. ఇప్పటికి గ్రామీణ ప్రాంతాల్లో అలాగే పిలుచుకుంటారు. మధ్యతరగతి వాళ్ళు మాత్రం ఇప్పుడు భార్యను భర్త పేరుపెట్టి పిలుస్తున్నారు. కానీ భార్య భర్తను పేరుపెట్టి పిలవడం ఇంకా ఎక్కువ మందికి అలవాటు కాలేదు. ఇలా మొదటి సంభాషణలోనే తెలంగాణ భాష, సంస్కృతిని, పలుకుబడిని స్పష్టం చేశారు రచయిత.



### వ్యక్తి పోరాటానికి, సమిష్టి పోరాటానికి మధ్య తేడా

ఈ నవలలో నారాయణ బీడీ కంపెనీ మేనేజరైన దాదా మీదికి తిరుగుబాటు చేశాడు. కాని అతనికి ఎవరూ సపోర్టు చేయలేకపోయేసరికి ఏమీ చేయలేకపోయాడు. ఆయన చేసింది తప్పేమీ కాదు. ఆయనది న్యాయ పోరాటమే కాని ఒంటరి పోరాటమయ్యింది. కావుననే నిలబడలేకపోయింది. రాజేశం బీడీ కంపెనీలో బీడీలు చుట్టే మహిళలందరికి డబ్బులు కోతపెడితే నష్టమే అని అందరికి తెలిసినా వీరికి నాయకురాలిగా రామక్క నిలబడింది. వీరి ఉద్యమ నిర్మాత రామక్క. ఈమెతో అందరూ కలిసి ఉద్యమించడం వల్ల తక్కువ సమయంలోనే ఎక్కువ ఉధృతమైంది. ఇదివ్యక్తి పోరాటం కాదు. వర్గపోరాటం. సంఘటిత పోరాటం, సమిష్టి పోరాటమైనందునే మనగల్గింది. వ్యష్టిగా సాధించలేనిదాన్ని సమిష్టిగా సాధించవచ్చు అని అర్థమవుతుంది.

ఈ నవలలో సామాజిక చరిత్రతో పాటు ఆర్థిక చరిత్ర ఉంది. మనం ఏం పని చేయాలన్నా ఆర్థికంగా నిలదొక్కుకుని ఉండాలి. సుగుణ అనే అమ్మాయి వివాహం వారి ఆర్థిక స్తోమత తక్కువ కారణంగానే వాయిదా పడింది. దోపిడీదారులు శ్రామిక శక్తిని ఎలా పీల్చి పిప్పి చేస్తున్నారో లాభమొస్తే ఏం లేదు. నష్టమొస్తే మాత్రం వారి కార్మికులను ఎలా శ్రమదోపిడీ చేస్తున్నారో రాజేశం లాంటి పాత్రల్లో ప్రత్యక్షంగా చూపించారు.

ఈ నవల ఆద్యంతం ప్రాంతీయ భాషతో పాటు పాత్రోచిత భాషను ప్రవేశ పెట్టడం ద్వారా, నవల ఇతివృత్తానికి భాషతోడు కావడం వల్ల బంగారానికి తావి అబ్బినట్లయింది. దాదా మహారాష్ట్రీయుడు కావడం వల్ల హిందీలోను మిగతా కార్మికులందరు తెలంగాణ తల్లి భాషను మాట్లాడటం నవల యొక్క అదనపు విశిష్టత.

### బతుకుపోరు నవలలో స్త్రీల వ్యవహార దక్షత

"ప్రేమ రూపంలో స్త్రీలు తల్లిగా, భార్యగా, కూతురిగా, సంఘజీవిగా, సమూహంలో ఒకరిగా కుటుంబాన్ని ఇరుగు పొరుగు సంబంధాలను సామాజిక సంబంధాలను ఎంత చక్కగా నిర్వహిస్తారో స్త్రీలలో ఉండే వ్యవహార దక్షత ఏమిటో లక్ష్మి, సుగుణ, రామక్క వంటి స్త్రీ పాత్రలు రుజువు చేస్తాయి. స్త్రీల ప్రత్యేక పనివిధానం మనం చూడవచ్చు."

### పేదల జీవితంలో ఆనందాలు కూడా ఉంటాయి

జీవితంలో కష్టాలే కాదు. ఆనందాలు ఉంటాయి. పేద దళిత, బహుజన శ్రామిక ప్రజానీకానికీ కళారూపాలున్నాయి. ఆటలున్నాయి. పిల్లలకు తీరొక్క ఆటలున్నాయి.

"రాత్రి ఎనిమిదిన్నర కావస్తోంది. రోడ్‌మీద వీధి దీపాలు మినుకు మినుకుమంటూ తమ ఉనికిని గుర్తు చేస్తున్నాయి. ఆ దీపాల వెలుగుకు తమ నీడలు పడుతున్న చోటును దయ్యం అని నవ్వుతూ నీడల్ని తొక్కే ప్రయత్నం చేస్తూ నీడ వెంట పరుగెడుతోంది సరస్వతి. కొంతదూరం పరుగెత్తే సరికి ముందున్న దీపాల వెలుగుకు నీడ మాయమై వెనక్కుపోతోంది నీడ. "అగో దెయ్యం దెంకపాయె" అని సంతోషంగా అంటున్న సరస్వతి మాట పూర్తికాకముందే ఆ స్తంభాల్ని వాళ్ళు దాటడం మళ్ళీ ఆ నీడలు చిన్నవి పెద్దవిగా మారడం 'అగో మల్లచ్చె' అంటూ సరస్వతి గంతులేస్తూ నడవడం చేస్తోంది"[14] అని వర్ణిస్తారు. ఇది రచయిత సునిశిత పరిశీలనకు, అటువంటి సంఘటనలకు జీవితానికి మధ్య గల సన్నిహిత సంబంధానికి అద్దంపడుతుంది

## స్త్రీల సమగ్ర జీవిత చిత్రణ

"ప్రత్యేకించి స్త్రీ పాత్ర చిత్రణ విషయానికి వస్తే సమాజంలో, కుటుంబ వ్యవస్థలో అత్యంత ప్రముఖ స్థానాన్ని ఆక్రమించిన స్త్రీ ఎన్నో రకాలుగా వర్ణించబడింది. సమాజంలో వస్తున్న సామాజిక, ఆర్థిక రాజకీయ మార్పులకనుగుణంగా స్త్రీని వర్ణించారు రచయితలు. ముఖ్యంగా పారిశ్రామిక విప్లవం తర్వాత సమాజంలో కుటుంబ జీవనంలో స్త్రీ నిర్వహించవలసిన పాత్రలో ఎంతో మార్పు రావడం గమనించదగిన విషయం."[15] అయితే ఉత్పత్తి సంబంధాల్లో క్రియాశీలంగా పాల్గొనే స్త్రీల గురించి తెలుగు నవలల్లో 'బతుకుపోరు' కన్నా ముందు చిత్రించిన నవలలు చాలా తక్కువ. గ్రామీణ వ్యవసాయ స్త్రీలను చిత్రించారు గానీ కార్మిక స్త్రీలను ప్రధానం చేసి చిత్రించిన నవలలు దాదాపు లేవు. ఈ విషయంలో 'బతుకుపోరు' మొదటి నవల అని చెప్పవచ్చు.

ఈ నవలలో ప్రధాన పాత్రలు అన్నీ స్త్రీ పాత్రలే. లక్ష్మి, రామక్క, లచ్చిరాజు, సుగుణ సత్తెక్క, హనుమక్క, రామక్క, నిర్మల మొదలైన పాత్రల మధ్య స్పష్టమైన వైవిధ్యం ఎవరి వ్యక్తిత్వం వాళ్ళు స్పష్టం చేస్తారు. ఈ పాత్రలు అన్నీ ఆత్మగౌరవం గల స్వీయ సంస్కృతి, స్వీయ చైతన్యం గల పాత్రలే. భవిష్యత్తు మరింత బాగా వుండాలనీ ఆశించే పాత్రలే. అందుకే భవిష్యత్ జీవితం కోసం అనేక పాత్రలు కృషి చేస్తాయి. మాతృత్వంతో పాటు స్త్రీలల్లోని ఆర్ధ్రత, కరుణ, ఉదారగుణం, స్పందించే హృదయం, వాత్సల్యం యీ పాత్రల్లో స్పష్టంగా కనపడతాయి. ఒక విధంగా లక్ష్మి, రామక్క 'బతుకుపోరు' నవలలో ముఖ్య పాత్రలు.

లక్ష్మి మాటల్లోనే "నువ్వు సూత్తలేవ నా సంసారం. పోరగాన్లు, బొట్టెగాన్లు పండుకునుడు, తినుడు, తానాలు చేసుడు, చేపిచ్చుడు పోరగాన్ల బడికి పంపుడు,



అందరి బట్టలుతుకుడు. ఊడ్సుడు, అలుకుడు, సల్లుడు, ముగ్గులేసుడు, కత్తిరిచ్చుడు, బీడీలు చేసుడు, పొద్దగాలలేసి మొదలు పెడితే రాత్రి పదకొండు గొట్టె దాక తీరనే తీరదాయే రికాంలేని ఈ బతుక్కి" అంటే జీవితంలోనూ పొద్దుగూకులూ శ్రమతోనూ కార్మిక స్త్రీ ఎంత విసిగిపోతుందో, ఎట్లాంటి బతుకు బతుకుతుందో అర్థమవుతుంది.

ఈ రకంగా సూర్యుడికంటే ముందు లేసి అర్ధరాత్రి దాకా రెక్కలు ముక్కలు చేసుకున్నా తీరని బతుకులు వాళ్ళవి. అందునా కంపెనీలలో దుర్భరమైన వాతావరణం, పొగాకు, రోగాలు, నొప్పులు బతుకంతా ఇరుగ్గా వాళ్ళు బతుకులు వెల్లమారుస్తారు. యాంత్రికత ఏదో, వ్యక్తిగతం అవసరం ఏదో తెలుసుకోలేనంత యాంత్రికత వాళ్ల బతుకుల్నిండా వుంది. బతుకులో తీరుబడిలేక కొడుకుని పట్టించుకోక పోగొట్టుకుని దుఃఖించే రామక్క నవల్లో ఒక సజీవ పాత్ర."[16]

## పాత్రల పేర్లలో సహజత్వం

ఈ నవలలోని పాత్రల పేర్లన్ని అత్యంత సహజమైనవి. ఉత్తర తెలంగాణ ప్రాంతంలో గ్రామీణులలో ఉండే పాత్రలే ఇవి. ప్రకృతి వర్ణన, రూపవర్ణన, పాత్రల మనోగత వర్ణన పాత్రల వ్యక్తిత్వ సృజనకు అనువుగా యీ నవలలో చిత్రించారు.

## నవలలో సంభాషణ శైలి

ఈ నవలలో సంభాషణ శైలి చాలా చక్కని సంవిధానంలో కొనసాగుతుంది. పాత్రల్లో సంస్కరణాభిలాష, విప్లవాభిలాష కొనసాగుతుంది. ఈ నవలలో తెలంగాణ నుడికారం విస్తృతంగా కనపడుతుంది. సంభాషణను ఆశ్రయించుకున్న సన్నివేశాలు యీ నవలలో అనేకం వున్నాయి. ప్రజలే నాయకులుగా ఎదిగే క్రమం కూడా ఇందులో చూడవచ్చు. భాషను ఆత్మీయంగా గలగల పారే సెలయేరుగా సంగీతాత్మకంగా తీర్చిదిద్దిన సంభాషణలు సహజత్వానికి మూలశక్తిగా నిలిచాయి. తెలంగాణ భాషలోనే ఒక సంగీతం, లయ, కొనసాగుతూ వుంటుంది. తెలంగాణ ప్రజల సంభాషణ ఒక పాటలాగా లయాత్మకంగా సాగుతుంది. ఔచిత్యాన్ని దృష్టిలో వుంచుకొని సందర్భానుసారంగా సామెతలు, నుడికారాలు ఉపయోగించి పాఠకులకు తెలంగాణ భాష సంపదను గుర్తు చేస్తారు.

రచయిత కథనం కుతూహలం కలిగిస్తూ ముందుకు సాగుతుంది. నిరలంకారంగా, నిర్మలంగా సాగే జీవితం తనంతతానే కథన కుతూహలాన్ని పాఠకులలో కలిగిస్తుంది. కథా నిర్మాణ శిల్పంలో కథతో సంబంధంలేని పాత్రలు ఇందులో లేవు. అన్ని పాత్రలు కథా నిర్మాణానికి అవసరమైనవే.

## బతుకుపోరు - నవలా శిల్పం

జీవనదిలా ప్రవహించే జీవితాన్ని జీవితంగా జీవించడమే ఇందులోని నవలా శిల్పం. ప్రత్యేకమైన కథా నిర్మాణం లేకపోవడం అనేది మౌఖిక సాంప్రదాయానికి చెందిన శిల్పం. పాఠకులకు పాత్రలు చిరపరిచితమవుతాయి. ఆత్మీయమవుతాయి. తమలో భాగంగా పాఠకులు భావిస్తారు. ఈ నవలను బీడీ కంపెనీల్లో చదివి వినిపించారు. టేపుచేసి టేప్‌రికార్డర్ ద్వారా వినిపించారు. బీడీ కార్మికులు యీ నవలతో తాదాత్మ్యం చెందారు. తమ జీవితాలను ఇంత చక్కగా చిత్రించవచ్చా? అని ఆశ్చర్యపోయారు, అభినందించారు. తమ జీవితాలకు సాహిత్య గౌరవం లభించడం వారిని ఎక్కువ ఆనందానికి గురి చేసింది. వారిలో ఉత్తేజాన్ని నింపింది.

ఈ నవల రాసే క్రమంలో అనేకమంది బీడీ కార్మికులు, రచయితలు, ఉద్యమ కార్యకర్తలు, పాలుపంచుకున్నారు. ఇలా యీ నవల సమిష్టి కృషిలో భాగంగా రూపొందిన నవలా శిల్పం. తద్వారా జీవితంలోని అనేక కోణాలు యీ నవలలో చిత్రించడం సాధ్యపడింది.

## నవలాశైలిలో రచయిత లక్ష్యం కూడా నిక్షిప్తమై ఉంటుంది

"రచనోద్దేశ్యం అనేది రచయిత నవలలో కథ ద్వారా సామాన్యీకరించిన జీవిత సత్యంగా అర్థం చేసుకోవలసి వుంటుంది. అన్ని రకాల నవలల్లోనూ ఒక పాత్ర ద్వారా కానీ, ప్రకృతిలోనూ, సంఘంలోనూ వుండే మానవ సంబంధాల ద్వారా కానీ రచనోద్దేశ్యం వెల్లడి కావచ్చు. అది ఒకనీతి వాక్యంలాగానో, ఒక జాతీయంలాగానో ఒక గంభీరమైన స్ఫూర్తిలాగానో, ఒక పాఠంలాగానో వుండదు. అది ప్రధానంగా కథలోని జీవిత సారంలాగా కనిపిస్తుంది."[17]

## రచయిత ప్రతినిధి పాత్రలు లక్ష్మి - నారాయణ

లక్ష్మి పాత్ర రచయిత చెప్పాల్సిన విషయాన్ని ముందుకు తీసుకువెళ్ళే పాత్ర. మిగిలిన పాత్రలను లక్ష్మీ పాత్ర నడిపిస్తూ ఉంటుంది. లేదా లక్ష్మి పాత్రకు ఎదురైన పాత్రలుగా ముందుకు సాగుతూ వుంటుంది. ఈ పాత్ర లక్ష్యం, వ్యక్తిత్వం స్పష్టం. లక్ష్మి ఒక బృందాన్ని నిర్మాణం చేయగలదు. తన కుటుంబం గురించే కాక సమాజంలోని మిగిలిన కుటుంబాల సమస్యలను కూడా పరిష్కరించడానికి చొరవ చూపుతుంది. చదువు విలువ తెలిసిన చైతన్యవంతమైన స్త్రీగా లక్ష్మి తన కొడుకును చదువుకోమంటుంది. మరిదిని ఎమ్‌బిబిఎస్ చదివించడానికి కష్టపడుతూ డబ్బులు పంపిస్తూ వుంటుంది. లక్ష్మి పాత్ర నవలలో బలమైన పాత్ర, ప్రధాన పాత్ర.



ప్రతిపాత్రకు ఈ నవలలో సొంత వ్యక్తిత్వం ఉంటుంది. చిన్న పాత్రఅయినా ఆ పాత్ర వల్ల ప్రయోజనం ఉంటుంది. రామక్క తాను చేయాల్సిన పనిని నిబద్ధతతో చేస్తుంది. తన చుట్టూతా వున్న కార్మికులతో చేయిస్తుంది. నారాయణ చదువు కొనసాగించలేక కార్మికుడిగా వుండడం తెలంగాణ నిరుద్యోగాన్ని తెలుపుతుంది.

సాధారణమైన నవలల్లో రెండు రకాల పాత్రల ఉంటాయి. నవల ప్రారంభం నుంచి చివరి దాకా ఒకేరకంగా మార్పులేని పాత్రలను ఫ్లాట్ క్యారెక్టర్ అంటారు. వాటినే మూసపాత్రలు అంటారు. డిటెక్టివ్ నవలల్లో డిటెక్టివ్ సర్వజ్ఞుడు. జేమ్స్‌బాండ్ ఒక మూసపాత్ర. అలా కాకుండా నవల పరిణామంలో పాత్రలు ఎదగడం పరిణామం చెందడం జరిగే పాత్రలను రౌండ్ క్యారెక్టర్స్ అంటారు. పరిణామ వికాసాలు పొందే పాత్రలు ఇవి.[18] ఈ నవలలో పాత్రలు పరిణామం చెందుతూ వుంటాయి. వ్యక్తి చైతన్యం నుంచి సామాజిక చైతన్యంలోకి పరివర్తన చెందుతుంటాయి.

## రచయిత ఆదర్శానికి ప్రతినిధులైన పాత్రలు

ప్రతి నవలలో సామాజిక రచయితలు తాము చెప్పదలచుకున్న వాటికి అనువుగా కొన్ని పాత్రల కంఠ స్వరానికి వెనుక వుంటారు. వాటికి రచయిత రచనా ఉద్దేశానికి ప్రతినిధులైన పాత్రత ఇస్తారు. బతుకుపోరు నవలలో లక్ష్మి, నారాయణ, లచ్చిరాజు, సుగుణ, శంకర్, రామక్క, రచయిత చెప్పదలచుకున్న రచనా ఉద్దేశానికి ఆయా సందర్భాల్లో ప్రతినిధి పాత్రలుగా వుంటాయి. స్వయంగా రచయితే నారాయణ లక్ష్మిరాజు పాత్రలో కనిపిస్తారు. రచయిత తల్లిపాత్ర మొదటే చెప్పినట్టుగా లక్ష్మి, లచ్చిరాజు, రామక్క మూడు పాత్రల్లో కనిపిస్తుంది. ఇలా యదార్థ జీవితం నవలగా రూపొందింది.

## బతుకుపోరు నవలలోని భాషా నుడికారాలు - సంస్కృతి

"మాట్లాడేటప్పుడు గాని, రాసేటప్పుడుగాని భాషాభివ్యక్తిలో కనబడే తీరును శైలి అంటాం. విస్తృతమైన భాషావ్యవస్థలో శైలి, భాష అన్నవి అంతర్భాగాలు, రచయిత వ్యక్తిత్వమూ, అతడు వెలిబుచ్చే భావాలు అనే రెండు అంశాల సమ్మేళనమే శైలి."[19]

రచయిత కథకు, ఇతివృత్తానికి, పాత్ర చిత్రణకు, శిల్పానికి, భాషకు, పాత్రోచిత సంభాషణకు, సామాజిక చరిత్రకు, మానవ సంబంధాలకు ఎంత ప్రాధాన్యతనిచ్చారో అంత ప్రాధాన్యతతో తెలంగాణ పలుకుబడులు, జాతీయాలు, సామెతలు, నుడికారాలు, లోకోక్తులు కూడా సందర్భానుగుణంగా ప్రయోగించారు. దీనివల్ల రచనకు సహజత్వం అబ్బింది.

# బతుకుపోరు నవలలో భాషా విశేషాలు

నేటి వ్యవహారంలో తెలంగాణ భాషా స్వరూపాన్ని జాగ్రత్తగా పరిశీలించినట్లయితే భాషా పరమైన అంశాలనెన్నింటినో మనం తెలుసుకోవచ్చు. గ్రామీణుల పలుకుబడిలో అనేక గ్రాంథిక రూపాలు, కొద్ది భేదంతోనూ, బేధ రహితంగానూ ఇప్పటికి సజీవంగా వాడుతూ వుండటం భాషాదృష్టిగల పండితులు గమనించవచ్చు. బతుకుపోరు నవలలో రచయిత ప్రయోగించిన తెలుగు పలుకుబళ్ళు, సామెతలు, జంటపదాలు, మాండలిక పదాలు, అన్యదేశ్యాలు, వాక్యబంధాలు, కొన్ని యిలా వున్నాయి.

**బతుకుపోరు నవలలోని మాండలిక పదాలు - అర్థాలు**

1 తెత్తివి = తెచ్చావు (పుట : 11)

2 జెల్దివోవాలె = తొందరగా వెళ్ళాలి (పుట : 11)

3 చాయ = టీ (పుట : 11)

4 కొత్తంగి = కొత్త చొక్కా (పుట : 12)

5 ఎగవెడ్తవు = ఎగ్గొట్టడం (పుట : 13)

6 గీగిన్నెలు = ఈ గిన్నెలు (పుట : 13)

7 మంజన్ = పళ్ళపొడి (పుట : 15)

8 రంజన్ = మంచినీళ్లకాగు (పుట : 45)

9 తోల్కపోరా = తీసుకొని పోరా (పుట : 15)

10 బడికి యాల్లయితాంది = బడికివేళ అవుతుంది (పుట : 15)

11 బూరుగుడబ్బా = బూరుగు చెక్కలతో చేసిన డబ్బా (పుట : 15)

12 కుల కశిపి = కులవృత్తి (పుట : 16)

13 పెయి ఎండుక పాయె = శరీరం ఎండుకుపోయింది (పుట : 16)

14 ఉమ్మ గీలుతాందే = అన్నంలో చెమ్మ పూర్తిగా ఇగిరేదాకా పొయ్యిమీద వుంచడం (పుట : 16)

15 ఎక్కిరిత్తాన్రు = ఎక్కిరిస్తున్నారు (పుట : 17)

16 ఫోంటిన్ = పెన్ను

17 గుంజుకుంటె = లాక్కోవడం (పుట : 20)

18 అక్కరొకొస్తాయి = అవసరానికి ఉపయోగపడతాయి (పుట : 22)

19 రికాంలేని బతుకు = తీరికలేని బతుకు (పుట : 25)

20 తక్కొవోత్తడు = తక్కువపోస్తాడు (పుట : 25)

21 అమీన్‌గాడు = ఎస్సై (పుట : 28)

22 ఔ = ఏమండి (పుట : 10)

23 త్రిజోరి = ట్రెజరి (పుట : 30)

24 లై = గోధుమ పిండిని ఉడికించి అతికించడానికి వాడే గుజ్జు (పుట : 31)

25 గరీబోన్ని = పేదవాన్ని (పుట : 33)

27 దావుకాన్ల = ఆసుపత్రి (పుట : 33)

28 పొన్న (పంతం) = పోటీపడడం (పుట : 42)

29 సీనీమ్మ టాకీసు = సినిమా టాకీసు (పుట : 44)

30 జాగ = స్థలం (పుట : 46)

31 అచ్చినవు = వచ్చినవు (పుట : 53)

32 కాంటముల్లు = త్రాసులోని మధ్యముల్లు (పుట : 54)

33 తోల్కచ్చుకోడే = తీసుకొచ్చుకోడు (పుట : 55)

34 దుకాణం = షాపు (పుట : 56)

35 ఉసికెల = ఇసుకలో (పుట : 56)

36 ఆకుకాంట = ఆకుతూచే త్రాసు (పుట : 57)

37 ఆకుబారదాన్ = ఆకు తట్టుసంచి (పుట : 57)

38 ఆక్విటెన్సురోలు = జీతం తీసుకొని సంతకం జేసే రిజిస్టరు (పుట : 57)

39 దొడ్డు ఆకులు = లావుగా ఉన్న ఆకులు (పుట : 57)

40 డాగ్ = మరక

41 యింటాన్రా = వింటున్నారా (పుట: 60)

42 సాయిమాను వైపు = ఇంటివెనుక చూరు వంచిన గదివైపు (పుట : 60)

43 ముస్గుతర్ = మునుగుతారు (పుట : 61)

44 బిజిలి = పెట్రోమాక్సులైటు (పుట : 64)

45 యిజ్జతుదీసి = పరువుతీసి (పుట : 70)

46 సందుగు = పెట్టె (పుట : 76)

47 కచరా = తుక్కు (పుట : 79)

48 బొంద పెట్టవడితివి = స్మశానంలో పాతిపెట్టవడితివి (పుట : 80)

49 లంగతనం = పనిలేకుండా తిరుగుతూ చిన్న చిన్న మోసాలు చెయ్యడం (పుట:81)

50 కారిగాళ్ళు = కార్మికులు (పుట : 84)

51 లగ్గాలంట పోయి = పెళ్లిలంటూ వెళ్ళి (పుట : 88)

52 సవాయి ఆకు = రోజు చేసే బీడీల కన్నా ఎక్కువ బీడీలు చెయ్యడానికి ఆకు తీసుకోవడం (పుట : 92)

53 ఎగిర్తం బట్టియ్యకు = తొందర పెట్టకు (పుట : 92)

**జంట పదాలు**

1 అటు ఇటు (పుట : 11)

2 బుడబుడ (పుట : 18)

3 పోవాలె పోవాలె (పుట : 18)

**అన్యదేశ్య భాషా పదాలు**

1 తీన్‌పావుసేరు (750 బీడీలు) – పాంచ్‌సౌ (500; (పుట : 45)

2 సాఢే ఛె సౌగ్రాం (650 గ్రా) – (పుట : 57)

3 నేనే మీ సేఠ్‌ది తొమ్మిది వందల్ నౌ సౌరూప్యాకోసిన (పుట : 61)
నేనే మీ సేటుకి 900 రూ. కోత విధించాను.

4 క్యాబోల్తీవునీ = ఆమె ఏమంటుంది (పుట : 61)

5 తోనహీ నికల్తీ క్యా = అయితే వెల్లదా (పుట : 61)

6 పాన్‌టేలా అంట వెట్టే = కిల్లీ కొట్టు పెట్టాడు (పుట : 95)

7 అచ్ఛాసాబ్ = మంచిది అయ్యా (పుట : 99)

8 మాఫ్ కరోసాబ్ = క్షమించండి సార్ (పుట : 99)

9 సేటు ఫోన్ కర్‌కే గాలియా దియారే = సేటు ఫోన్ చేసి తిట్టాడు (పుట : 99)

10 చాటన్ = చెడిపోయిన బీడీలు తీసెయడం (పుట : 11)

11 చెన్నీ = బీడీలు బట్టీలో పెట్టడానికి పెట్టే ఇనుప జాలి పెట్టె (పుట : 11)

**సామెతలు-నుడికారాలు-పలుకుబడులు**

1 అదుగో పోరి సరిస్తె దయ్యమొదలాలె (పుట : 12)

2 దీనింట్ల పీనుగెల్ల (పుట : 64)

3 పుణ్యం కొద్ది పురుషుడు, భాగ్యం కొద్ది బిడ్డలు (పుట : 76)

4 చేతులు కాలినంక ఆకులకు ఉరికినట్టు (పుట : 77)

5 నువ్వుఛస్తే చచ్చినవుగాని మమ్ములను పక్కలేసుకొని చస్తున్నవు (పుట : 100)

6 ముంగటున్నది ముసల్ల పండుగ (పుట : 84)

7 మునిగిముతమై పోతాగ్రా

**వాక్యబంధాలు – నిర్దేశక వాక్యాలు**

1 కొత్తంగి పట్టిస్తాన్నడు (పుట : 12)

2 పెండదీస్కరారా! ఎవరన్న దీస్కపోతర్ర (పుట : 12)

3 కందిల్ ముట్టించాడు (పుట : 66)

**ప్రశ్నార్థక వాక్యాలు**

1 ఛీ! ఛీ! నిద్రగూడ సరిగపోనియ్యరు ఏంది? (పుట : 10)

2 కొంచెం పాలుదెచ్చి చాయ వెట్టిత్తవా? (పుట : 11)

3 నాకు అయిదు పైసలన్న యియ్యవ? (పుట : 13)

4 ఎక్కాలు ఎట్ల యాజ్జేయాలె?

5 ఈడెపుడు పండాలే ? (పుట : 21)

6 ఏమాయనే సుగుణా? (పుట : 23)

7 తిన్నావే? (పుట : 25)

8 ఏంది గట్లున్నవ్ ? పోలీసులకు గంత పగెందుకు? (పుట : 27)

9 కొంచెం ఒరుగుతేంది? (పుట : 28)

10 పైసలచ్చినయ ? (పుట : 56)

11 బాగనే లొల్లయిందా? (పుట : 70)

12 యిల్లంత జాజిరి జాజిరి జెయ్యలేద? (పుట : 71)

13 కావురం గిట్టవట్టిందా?

14 ఒక యిల్లంటుకున్నాక పక్కిల్లు అంటుకోదా? (పుట : 100)

15 యింటాౖన్రా = వింటున్నారా (పుట : 60)

**ఆశ్చర్యార్థ వాక్యాలు**

1 బిడ్డా! మరి నన్ను యాది చేసిండా!.... రామక్క (పుట : 76)

2 అయ్యో! పొయిమీద బియ్యమేమాయెనో!... లక్ష్మి (పుట:16)

3 అబ్బో!నకరాలు నా దగ్గర సాగయి (పుట : 19)

4 ఆహా! ఆ రంపం పోయింది ఈ రంపం మొదలెట్టినవా ? (పుట : 19)

5 అవ్వల్లా! ఎంత రంపం పోయె మల్లా ఒంటిగంట దాకా – లక్ష్మి (పుట: 21)

**మనస్తత్వాన్ని ధ్వనించే వాక్యబంధాలు**

1 మరిది మీదికి దృష్టి పోయింది. ఏందో తాను వద్దన్నా పెనిమిటి, మరిది డాక్టరు కోర్సు సదిపియ్యాలె అంటడు (పుట : 50)

2 మా ఆడోల్ల కష్టాలు మీకేమెరుక, ఊడ్సుకునుడు అలుకు జల్లుకునుడు తొమ్మిది నెల్లు కడుపుల మోసి అయిదేండ్లు దాక కంటిపాప తీర్గ కాపాడుడు (పుట:71)



**కొన్ని సామెతలు**

1. సదువు సారెడు – బలుపాలు దోసెడు (పుట:19)
2. గంజిలో ఈగెను తీసేసినట్లు (పుట: 58)
3. వయసు వస్తే వంకలన్నీ తీరుతాయి (పుట: 22)
4. తలకు వాసిన వెంట్రుక ఏ రేవులో పోతే ఏంది (పుట: 76)
5. లోకం తోటి లొటలొట (పుట: 85)
6. పడేటోల్లుంటే చచ్చేదాక తంతరు (పుట: 84)

ఇలాంటి తెలంగాణ సామెతల్ని, పలుకుబడుల్ని ఎన్నో రికార్డు చేశారు. కొన్ని మాత్రమే ఇవి.

**తెలంగాణ భాషా పదాలు**

తెలంగాణ మాండలిక పదాలు కూడా విభిన్న రూపాల్లో ఒక ప్రత్యేక శైలిని సంతరించుకున్నాయి. ఈ పదాలతోనే భాష ఇంపునిస్తుంది. వాటిలో కూడా కొన్ని ఉదాహరణకు.

**తెలంగాణ పదాలు**

శుక్రవారం – సుక్రారం

ఆదివారం – అయితారం

తెలుసు – ఏర్పాటు

పచ్చడి – తొక్కు

పెన్ను – పోంటిన్/కలం

చొక్కా – అంగీ

శరీరం – పెయ్యి

లగ్నం – లగ్గం

చిన్నమ్మ – సిన్ని

వీరు – యీళ్ళు

పారిపోవుట – దెంకపోవుట

స్నేహం – సోపతి

పాచి ఆకు – పాశాకు

ప్రాణం – పాణం

గ్లాసు – గిలాస

చీర – సీరె

పిల్లలు – పోరగాండ్లు

ఇలాంటి పదాలు ఎన్నో మనకు గోచరిస్తుంటాయి. ఏదేమైనా తెలంగాణ నేపథ్యంలో, తెలంగాణ భాషలో, తెలంగాణ నవలగా బతుకుపోరు ఎంతో పేరెన్నికగన్నది. (ఎమ్.లలిత)

## తెలంగాణ భాషలో స్త్రీల భాష ప్రత్యేకత

తెలంగాణ భాష ఎంత ఆత్మీయంగా ఉంటుందో బతుకుపోరు నవలలో చూడవచ్చు. "యీ నవలలో తెలంగాణ ప్రజల భాష మాండలికం ప్రవేశ పెట్టడం బాగుంది. బి.ఎస్.రాములు గారు గొప్ప నవల రాసి ధన్యులయ్యారని చెప్పవచ్చు. (అల్లం నారాయణ)

స్త్రీల భాష ఏ వర్గంలోనైనా, ఏ కులంలోనైనా, ఏ సామాజిక శ్రేణిలోనైనా ప్రత్యేకంగా ఉంటుంది. ఈ స్త్రీ భాషను, స్త్రీ హావభావాలు, చేష్టలు అక్షరరూపంలో మనకు యీ నవలలో కన్పిస్తాయి. అందువల్ల యీ నవల ఒక సృజనాత్మక వచన రచనగా మనముందు ఉన్నది. ఒక దృశ్యకావ్యం చూస్తున్న అనుభూతిని నవల కల్పిస్తుంది. భాష ఒక సృజనాత్మక రచనను కళాత్మకంగా తీర్చిదిద్దితే ఏ విధమైన ప్రయోజనకారిగా మారుతుందో ఈ బతుకుపోరు నవలను చదివితే అర్థమవుతుంది. ఇందులో వాడిన శ్రామిక బహుజనుల భాషవల్ల కృత్రిమత్వాన్ని ఏమాత్రం లేకుండా మరింత సహజత్వాన్ని సంతరించుకుంటుంది. తెలంగాణ స్త్రీల అనుభవాల నుంచి రూపుదిద్దుకొని వారి నాలుకల మీద ఆడే సజీవ భాషను రచయిత సమర్థవంతంగా ఉపయోగించుకున్నారు. ఉదా.కు

1. "లక్ష్మక్కా ఆకయిందా" అంటూ పొరుగింటి అమ్మాయి సుగుణ...
2. "ఏమాయెనే సుగుణా? మొన్న చూసిపోయినోల్లు ఏమన్నరు? ఏమన్న చెప్పంపిన్రా?" అడిగింది లక్ష్మి
3. "మరి నాయన్నేడిదాక మొగ్గిండే" .... లక్ష్మి
4. "తిన్నావె?" ... లక్ష్మి



5. "ఔ! ఏమాయె లెవ్వవు"... లక్ష్మి
6. "ఏమోయ్ పిలగా! ఎటో పోతున్నవు" .... లక్ష్మి
7. "పాపం! మీ అవ్వ ఏం సుకపడ్డదోయి!" .... లక్ష్మి
8. అంతా నీ ఇష్టమేగాదోయ్"... లక్ష్మి
9. "యిగోయే నీ తంబాకు సాట" .... సుగుణ
10. "పెద్దోడెన్నోదే" .... భూలక్ష్మి
11. "ఔనో గీ ఎదురుంగ కొత్త బంగ్ల కిరాయికు అడుగతనని గదనో ఏమైందో" .. లక్ష్మి
12. "రాజేశన్న ఎటువోయిండు సత్తెక్కా"
13. "మేం ఎన్ని బంగ్లాలు గడ్తిమో రామక్కా" ... సత్తెక్క
14. "అంటే? ఏం లాభం లేకనే నడిపిత్తున్నారో?" .... రామక్క

## లక్ష్మి ఇంట్లో ఉన్న సామాను – బీడీ కార్మికుల జీవితాల్లోని పదాలు

| | |
|---|---|
| గ్యాసునూనె | గుడ్డిదీపం |
| చాప | నులకమంచం |
| నల్లి | బీడీల చాట |
| గాజులు | సైకిలు |
| బీడీ ఆకు కట్టలు | కత్తెర |
| పళ్ళు తోముకునే బొగ్గు | పాలు |
| చాయపత్తి | బావి |
| కట్టెపొట్లు | యినుపపొయ్యి |
| గిన్నెలు, పళ్ళేలు | పెండ |
| అల్లుకుజల్లుడు | ఆకుగుల్ల |
| సీపిరి | బొక్కెన |
| ఎక్కాల పుస్తకం | యిల్లు, అరుగు, వాకిలి |
| ముగ్గులు | మంజన్ |
| శక్కెరడబ్బా | వడపోత జాలి |

బిస్కెట్లు
పప్పు
బూరుగుడబ్బా (విడిచిన బట్టలు వేసుకొనేది)
సబ్బులు
బియ్యం
తువ్వాల
పెరుగు
బలపం
బీడీల దారం
జాకెట్టు బట్టలు, చీరెలు
గంటె పుత్తె
రెండు తులాల తీగ
కాళ్ళకు పట్ట గొలుసులు
సారె
తాంబూలం
పళ్లెం
తంబాకు
పేగులు
ఆకుబొంత
అంగిబట్ట
సింతపండు తొక్కు
క్యారియర్లు
త్రిజోరి
ఫ్యాను
సేల్ నోట్‌బుక్
డాల్ గంప

కూరగాయలు
మాసిన బొంతలు
బట్టల సోడా
అన్నం
చన్నీళ్ళు
మామిడికాయ తొక్కు
పుస్తకాలు
ఫోంటిన్, పెన్ను, పత్తి
పొట్టెదారం
చిరుతిండ్లు
బంగారు గుండ్లు
చెవుల కమ్మలు
ఎండి వడ్డానం
బిందె
చెంబు
సైకిల్, గడియారం
దారంకట్ట
బింగిరి
సైకిల్ గంట
టిఫిన్
రొట్టెలు
పాలు
టేబులు
రిజిస్టర్‌లు
గంప
చెన్నీ



బీడీల ప్యాకింగ్
లేబుళ్ళు
బట్టి
ఫిల్టర్ సిగరెట్లు
దవాఖానా

బీడీల ఛాటన్
ట్రాన్స్‌పోర్టు
గ్లాసు
రెవెన్యూ స్టాంపు

**ఈ నవలలో క్రియావాచకాలు**

1. నానిగాడికి నల్లికుట్టినట్టుంది
2. ఒత్తిగిలి పడుకుంది
3. నిద్రమత్తు కొంచెం వదిలింది
4. పెనిమిటి మంచంవైపు చూసింది
5. లక్ష్మి ఊపింది
6. బీడీ ఆకు కట్టలు ముందేసుకొని కూర్చొంది
7. ఆకును చిటుక్కుమంటూ కత్తిరిస్తుంది
8. విసుక్కుంటూ నానిని సంకనేసుకొని బయలుదేరింది లక్ష్మి

**తెలంగాణ భాషా పదాలు**

1. "మబ్బుల్నే ఊరికోతాంటివి గద! లెవ్వవూ"
2. తెత్తివి
3. అటు యిటు
4. "కొంచెం పాలుదెచ్చి చాయ వెట్టిత్తవ"
5. "ఛీ! ఛీ దరిద్రప్పోరడు!! ఓ గంటన్న సక్కగ నిద్రపోడు"
6. జెల్దివోవాలె
7. చాయ
8. కొత్తంగి పట్టిత్తాన్నడు
9. పగటీలి వరకత్తడు
10. 'అగో! పోరి సరిస్తె దయ్యమొదలాలె"
11. పెండదీస్కరారా! ఎవలన్న దీస్క పోతద్ర

12. ఎగవెద్దవు
13. గీగిన్నెలు
14. నాకు అయిదు పైసలన్న యియ్యవ?
15. మంజన్, పళ్ళపొడి
16. దోల్కపోరా
17. బడికి యాల్లయితాంది
18. బూరుగు డబ్బా
19. కుల కశిపి – కులవృత్తి
20. పెయి ఎండకపాయె
21. ఉమ్మగీలుతాందే
22. ఎక్కిరిత్తాన్రు పక్కపోంటోల్లు
23. బుడబుడ, పోవాలె పోవాలె
24. ఫోంటిన్, ఫోంటిన్ పత్తి
25. నాకేం ఏర్పాటుర?
26. పత్తి విరిగిపోయింది
27. గుంజుకుంటె
28. ఎక్కాలు ఎట్ల యాజ్జేయాలె
29. ఈడెపుడు పండాలె
30. అక్కరకస్తయి
31. ఏమాయెనే సుగుణా.
32. రికాంలేని బతుకు
33. వండుకొనుడు, తినుడు తానాలు జేసుడు, చేపిచ్చుడు ఆగ్గత్తిరుచ్చుడు, బీడీలు జేసుడు (పుట:25)
34. తిన్నావే.
35. తక్కోవోత్తడు
36. ఏంది గట్లున్నవ్. పోలీసులకు గంత పగెందుకు?(పుట:27)
37. అమీన్‌గాడు (పుట:28)
38. కొంచెం ఒరుగుతేంది?
39. 'ఔ" = ఏమండి
40. బొక్కలయితయి ఎండిపోయి కడుగరాదు
41. త్రిజోరి. టేబుల్ పక్కన త్రిజోరి వుంది



42. ఛాటన్, చెన్నీ, డాల్‌గంప
43. మొగుడు జచ్చిన ముండోలె ఏంది ఆ నల్లమొఖపు యేశం
44. 'లై'
45. గరీబోన్ని
46. దావుకాన్ల
47. ఊరుగాలి ఒకడేడిస్తే... బీడీల్ని క్రమ పద్ధతిలో 'పేంచు'లు తిప్పి
48. పొన్న (పంతం)
49. సీనిమ్మ టాకీసు
50. రంజన్ = మట్టికుండ, కాగు
51. తీన్‌పావుసేరు – పాంచ్‌సౌ
52. జాగ
53. ఫికర్ జెయ్యకున్రి
54. అచ్చినవు
55. కాంటముల్లు
56. తోల్కచ్చుకోడే
57. దుకాణం
58. ఉసికెల
59. పైసలచ్చినయ
60. ఆకుకాంట, ఆకు బారదాన్, ఆక్విటెన్సురోలు
61. దొడ్డు ఆకులు, సాఢేఛే సౌగ్రాం, మొల్దారందెంప
62. వారెయ్యిన్రా
63. ఎనుకసీరి చూద్దాం
64. తింటున్న అరటిపండు చేతుల్నుండి గుంజుకొని
65. డాగ్ (మరకలు)
66. నక్కెత్తుల్ని నెమరువేసుకుంటూ (60వ పేజి)
67. తోల్కరాను (60వ పేజి)
68. యింటాన్రా
69. సాయిమానువైపు
70. బూరుగుచెక్క డబ్బా
71. ఈఫారంల
72. నేనే మీ సేర్‌ది తొమ్మిది వందల్ నౌసౌరూప్యా కోసి

73. మున్గుతర్
74. గుండె దిటవు చేసికొని
75. క్యాబోట్రీ వునీ
76. తోనహీ నికల్తీక్యా
77. ఏక్‌బార్ పత్తాకాటీసో జబ్ సామ్నే బైఠ్‌కే దేఖో క్యానికల్తీ క్యాహై సమఝ్‌మే
 ఆయేగా హిందీ పదాలు చాలా వున్నాయి
78. మొగపుటుక పుట్టి గాజులు తొడుక్కోరాదు
79. యీని దౌడలు దగ్గరవడ్డయి
80. ఈసడించింది
81. ఎంబడి వోయిందుగద కుక్కోలె
82. సాయిమాన్ల కూర్చుండి
83. దీనింట్ల పీనుగెల్ల
84. బిజిలీ (పెట్రోమాక్సులైటు)
85. పునుక్కుంటూ
86. కందిల్ ముట్టించాడు
87. గోసపుచ్చుకోవడ్డివి
88. బాగనే లొల్లయిందా
89. దాదా యిజ్జతుదీసి
90. యిల్లంత జాజిరి జాజిరి జెయ్యలేద
91. నాఖదర్ ఏముంచితివె
92. రికాం లేకండా
93. పుణ్యంకొద్ది పురుషుడు, భాగ్యం కొద్ది బిడ్డలు
94. సందుగు
95. చేతులు కాలినంక ఆకులకు ఉరికినట్టు
96. 'కచరా' బీడీలను
97. బొంద పెట్టవడితివి
98. లంగతనం
99. కాపురం గిట్టవట్టిందా
100. ఔనయ్యో పడేటోల్లుంటే చచ్చేదాక తంతరు (ఆడవాళ్ల కాళ్లదుమ్ము ఆకాశంలోకి
 అలంకారం)
101. కారిగాళ్ళు



102. ముంగటున్నది ముసల్లపండుగ
103. లగ్గాలంట
104. కంపాసు బాక్సు
105. సవాయి ఆకు
106. ఎగిర్తంబట్టి
107. పులిమీద పడ్డట్టు అచ్చి సమ్మె జెయ్యమంటే
108. పాన్‌టేలా అంటవెట్టే
109. ఈడన్నదాంట్ల ఈసమెత్తు అవద్దం లేదు
110. వెంట్రుకలు ఊడిన బట్టతలలా
111. 'అచ్చాసాబ్' 'మాఫ్‌కరోసాబ్'
112. 'సేటు ఫోన్‌కరకే గాలియాదియారే'
113. నువ్వు ఛస్తే చచ్చావుగాని మమ్ములను పక్కలేసుకొని చస్తున్నావు
114. ఒక యిల్లంటుకున్నంక పక్కిల్లు అంటుకోదా?
115. మళ్ళీ ఎకాయెకిన గిరాకీ పెరిగిందట
116. యిజ్జతు వోతది

గత పదిహేను ఇరవై ఏళ్ళ నుండి తెలుగులో స్త్రీవాద కవిత్వమని, సాహిత్యమని బలంగా వచ్చింది. 'నేటి స్త్రీవాద సాహిత్యం వస్తున్న రోజులకు చాలా ముందుగా స్త్రీల జీవితం సంస్కృతి ఆలోచనా విధానం, స్త్రీల భాష, అభివ్యక్తి, ఆశలు, ఆరాటాలు జీవితమంత వాస్తవికంగా చిత్రించిన నవల ఇది. మానవ సంబంధాల్ని, ఉత్పత్తి సంబంధాల్ని సమన్వయిస్తూ తెలంగాణ ప్రజల జీవితాన్ని చిత్రించిన నవల' అని కీర్తించబడింది."[22]

**బతుకుపోరు నవలలో ప్రకృతికి, సన్నివేశానికి సంబంధం కలిపే వర్ణనలు**

ఈ నవలలో రచయిత ప్రకృతిని సందర్భానుసారంగా నవలలోని విషయాలతో పోల్చడం జరిగింది. మచ్చుకు కొన్ని

1. సమ్మెలా ఎండ తీవ్రమవుతోంది. తీక్షణంగా సూర్యుడు నిప్పులు కక్కుతున్నాడు. వాతావరణం చల్లగానే ఉంది కదా అని ఎండలో తిరుగుతున్న జనం ఆ తీక్షణతకు భయపడ్డట్టుగా నడక స్పీడు పెంచారు. (సమ్మె ఉధృతమై వేగం పెంచారు.)

2. సమ్మె ఉదయభానుడి లేత కిరణాల స్థాయి నుండి తీక్షణం స్థాయికి, భరించలేని ఎండ స్థాయికి చేరుకుంది.

3. తునికి ఆకు పైన ఎండిపోయి ఎర్రబడ్డ కప్పు ఆకులా తూర్పు ఆకాశం ఎర్రబడుతోంది. తునికి ఆకు మీద నారల్లా సూర్యకిరణాలు పైపైకి జాలు వారుతున్నాయి.

4. కార్మికుల ఆకలి కడుపులా ఎప్పుడూ ఎర్రగా మండే బీడీల బట్టి సమ్మె వల్ల చల్లారింది.

5. ఉదయం ఎనిమిదిన్నర సమయానికి ఎన్ని అంశాలను చిత్రీకరించారో చూద్దాం. బజార్ల బార్లా తెరిచేవేళ, బళ్ళోకి పిల్లలు వెళ్ళటానికి తొందరపడుతున్నవేళ, కూరగాయల అంగడి జోరుగా సాగుతున్న వేళ, జనం ప్రైవేటు దినచర్యను ముగించుకొని పబ్లిక్ దినచర్యకు ఉపక్రమిస్తున్న వేళ... అని ఇలా పలు కోణాల్లో చూపించారు."[23]

జానపద సాహిత్యంలో 'లక్ష్మణదేవర నవ్వు' లాగా ఎవరికి ఏ విధంగా అనుకుంటే ఆ విధంగా అర్థమయ్యే అంశాలు చాలా ఈ నవలలో కనిపిస్తాయి. ఉదాకు.

కార్మికులందరూ పైకం తీసుకోవడం మానేస్తే....

1. ఖాతాల వసూలుకు వచ్చిన టీహోటల్ రంగయ్య తెగబాధపడుతూ కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళాడు.

2. గంటకు పది పైసల చొప్పున బీడీలకు దారం కట్టే పిల్లలు డబ్బు వస్తే ఏమైనా కొనుక్కోవచ్చునని ఆశతో ఉన్నారు.

3. అడపాదడపా చీరలు, కనుములు తెచ్చే బట్టల ఆసామి రామస్వామి పైసల వసూళ్ళకు వచ్చి నీరసంగా వెళ్ళిపోయాడు.

4. కోడళ్ళు పైసలు బాగా దాచుకొని యిస్తారనుకొనే నమ్మని అత్తలు మొత్తం పైసలు తామే తీసుకుపోదామని వచ్చిన వాళ్ళు ముక్కుతూ మూల్గుతూ వెళ్ళిపోయారు.

5. కంపెనీ ఒక రోజు సెలవుంటే రెండు రోజులు పెయ్యంగక బీడీలు చెయ్యరని, 2, 3 రోజులు బందుంటే వారం రోజుల దాకా బీడీ ఎదగదని నెత్తి పట్టుకున్నాడు రాజేశం.

ఇలాంటి అంశమే మరొకటి.

ఆజానుబాహుడుగా, ఎర్రగా, అందంగా, నీటుగా ఉన్న దాదా తెల్లటి పైజమా ధరించి రాజేశం కంపెనీకి రాగానే కార్మికులందరూ భయంతో వచ్చిన గౌరవంతో



ఉలిక్కిపడి అడ్డదిడ్డంగా కూర్చున్న వాళ్ళు సర్దుకుని కూర్చున్నారు.

1. నిర్మల గబగబా డాగ్ వచ్చిన ఆకును దాదా చూడకుండా పేలికలో దాచేసుకుంది.

2. బీడీలు ఆపేసి ఆకుకట్ట కత్తిరిస్తున్న సుగుణ ఆకుకట్టను గుల్లలో కుక్కి బుద్ధిగా బీడీల చాట ముందేసుకుంది ఏం తెలియనట్లు.

3. పిల్లలు దారం కట్టటం ఆపేసి ఒక్కో బీడీ తాల్చడం నేర్చుకున్న వాళ్ళు ఆపేసి దారం కడుతున్నారు. కొత్తగా దారం కట్టడం నేర్చుకునే పిల్లలు అక్కన్నుంచి తుర్రుమని పరుగెత్తారు.

4. తంబాకు ఉన్న చాట్లో బూడిద పోసిన కొబ్బరి బుర్ర టకీమని తీసి దాదాకు కనబడకుండా దాచేసుకున్నారు.

5. చిన్న పిల్లల ఏడ్పులు ఆగిపోయాయి. లేక తల్లులు బలవంతాన పాలిస్తూ ఏడ్పు ఆపేయించినట్టున్నారు.

6. దాదా అంటే కార్మికులకు పోలీసును చూసినట్టు భయం ఎవరికి వారే గుసగుసగా దాదా! దాదా! అనుకొంటున్నారు.

ఇలాంటి సన్నివేశాలను కుదర్చడంలో రచయిత నైపుణ్యం తేటతెల్లమవుతుంది.

రాత్రిపూట వీధి దీపాలు మినుకు మినుకు మంటున్నాయి. ఆ దీపాల వెలుగుకు తమ నీడలు చూసి దయ్యం, దయ్యం అని నవ్వుతూ నీడని (దయ్యాన్ని) తొక్కే ప్రయత్నం చేస్తూ నీడ వెంట పరుగెత్తింది సరస్వతి అనే అమ్మాయి. కొంతదూరం పరుగెత్తే సరికి ముందున్న దీపాల వెలుగుకు నీడ మాయమై వెనక్కు వస్తుంది. అప్పుడు అగో దయ్యం దెంకపాయె అని ముందుకు నడవగానే నీడ మళ్ళీ రాగానే అగో దయ్యం మల్లొచ్చే అనడం.

ఇలాంటి అంశాలను గమనించడం సన్నివేశ పరంగా వాటిని సరియైన సందర్భంలో రూపొందించడం రచయితకు వెన్నతో పెట్టిన విద్య.

"నాకు సాతనైత లేదు సచ్చిన పీన్గు తీర్గ పండాలనిపిత్తాంది. నిద్రత్తాంది. సప్పుడుజేక పడుకో" అని దీనంగా వేడుకుంది లక్ష్మి. మంచంలోంచి చాపలోకొచ్చి లక్ష్మి పక్కన చేరాడు రాజయ్య. మీద చెయ్యి వేశాడు. 'యియ్యాల్లద్దు. సాతనైతలేదు....." దీనంగా వేడుకుంది లక్ష్మి.

## బతుకుపోరులోని కుటుంబాలు

బతుకుపోరులో లక్ష్మి రాజయ్యల కుటుంబం వివరంగా వర్ణించబడింది. ఇంకా అయిదారు కుటుంబాలు, వారి జీవితాలు ఈనవలలో చిత్రించబడ్డాయి. 1) లక్ష్మి - రాజయ్యల కుటుంబం, 2) నారాయణ–లచ్చిరాజవ్వ కుటుంబం, 3)సుగుణ కుటుంబం 4) టేకేదార్‌రాజేశం - సత్తక్కల కుటుంం, 5) రామక్క కుటుంబం, 6) లచ్చిందేవి - రంగయ్యల కుటుంబం.

లచ్చిందేవి, రంగయ్యలు భార్యభర్తలిద్దరు బీడీలు చేసి బతుకుతుంటారు. ఇద్దరూ ఒకే పనిలో ఉండడం వల్ల సమ్మె వల్ల బతకడం కష్టమని సమ్మెను తొలుత వ్యతిరేకిస్తారు. తర్వాత అందరితో కలిసి సమ్మె చేస్తారు.

"ఈ నవలను బి.ఎస్.రాములు ప్రచురించ తలపెట్టినప్పుడు అంత ఉత్సాహకరమైన పరిస్థితిని ఎదుర్కొనలేదు. అంత మాత్రాన ఊరుకుంటే అతని పేరు బి.ఎస్.రాములెలా అవుతుంది? ఇది మొదటి ముద్రణ అయ్యే కాలంలో (1982) వ్యాపార సాహిత్యంలో 'తులసిదళం' లాంటివీ, విప్లవ సాహిత్యంలో 'కొలిమంటుకున్నది' లాంటివి డామినేట్ చేస్తున్నాయి. అంటే ఈ నవలకి గొప్ప కాంపిటీషనన్న మాట. అయినా వెనుదీయకుండా ముద్రించిన రాములు తదనంతర కాలంలో తగిన స్థానాన్నే సంపాదించుకున్న విషయం యిప్పుడు కళ్ళముందు ఉంది."[24] అన్నారు కె. రామ్మోహన్‌రాజు.

"1982లో 'బతుకుపోరు' నవల తొలి ముద్రణ వెలువడినప్పుడు రచయిత బి.ఎస్.రాములును గోర్కీ, లూనస్‌లతో పోల్చారు. వారి మాటల్లోని ఔచిత్యం ఈ నవల చదివితే మనకు అర్థమవుతుంది. సామాజిక ఉత్పత్తి సంబంధాల్లో మానవ సంబంధాల చిత్రణ చేసిన సామాజిక నవలలు తెలుగులో చాలా తక్కువ. మానవ సంబంధాలను, సమన్వయిస్తూ తెలంగాణ ప్రజల జీవితాన్ని స్త్రీల దృక్కోణం నుంచి, చైతన్యం నుంచి, సంస్కృతి నుంచి, సామాజిక సంబంధాల నుంచి, తెలంగాణ ప్రజల జీవితాన్ని చిత్రించిన నవల బతుకుపోరు. అందుకే 'తెలంగాణ పల్లె సొంతం నవలలో కాపురం పెట్టింది. కదలనంటున్నది. కందిలి, ఎక్క, బాయి, పొట్టుపొయ్యి తిష్టవేశాయి. అందం ఆకురాలిన చెట్టుకు కూడా ఉంటుంది. అనుభవించడం అందరికీ చేతకాదు. బతుకుపోరులో పల్లెపట్టుల జీవితం దిశమొలలతో దిగంబరంగా కనిపించింది. తెలంగాణ పల్లె పాత్రలు తప్ప అంత అమాయకంగా, అంత ఆవేశంగా, అంత ఉద్రేకంగా, అంత ఉద్విగ్నంగా ఉండలేవు. ఇది తెలంగాణ విశిష్టత, ఇదే



తెలంగాణ బలహీనత" అని ప్రముఖ సాహితీవేత్త దాశరథి రంగాచార్య అన్నారు.

శైలీ సౌకుమార్యం ఏమాత్రం దెబ్బతినకుండా ఔచిత్యంతో సందర్భానుసారంగా తెలంగాణ భాషాపద నుడికారాలు, ప్రయోగాలు చేశారు. కార్మికుల జీవితాన్ని 'బతుకుపోరు' నవలలో చాలా సహజంగా రచయిత బి.ఎస్.రాములు చిత్రీకరించారు.

"విస్తృత అధ్యయనశీలిగా, సామాజిక కార్యకర్తగా, సాహితీవేత్తగా తనకంటూ గొప్ప ముద్ర వేసుకున్న బి.ఎస్.రాములు గారి కలం నుండి వెలువడిన గొప్ప నవల 'బతుకుపోరు"[25]

గత పదిహేనుళ్ళుగా బీడీ కార్మికులు తమ సమస్యల కోసం ఆర్థిక పోరాటాలు చేస్తున్నా యితర రంగాల్లోని కార్మికుల సమస్యల స్థాయిలో అందరి దృష్టిని తమవైపు తిప్పుకుని వార్తాపత్రికల్లో చర్చనీయాంశం అవుతున్నది ఇటీవలి కాలం నించే. బహుశా స్త్రీ కార్మికులు కావడం వల్లనే యింతకాలం దాకా వార్తల్లో నిర్లక్ష్యం చేయబడ్డారేమో...? బీడీ పరిశ్రమలో దాదాపుగా నూటికి తొంభైమంది స్త్రీలే!"[26]

నేటి స్త్రీవాద సాహిత్యం ఉనికిలోకి రావడానికి చాలా కాలం ముందే బతుకుపోరు నవల స్త్రీల జీవితాలను, సంస్కృతిని, ఆలోచనా విధానాన్ని, కార్యదక్షతను, స్త్రీల అభివ్యక్తిని, స్త్రీల భాషను వాస్తవికంగా చిత్రించిన నవల ఇది. తెలంగాణలోని స్త్రీల ఆరాటాలను, పోరాటాలను స్త్రీవాద ఉద్యమ కారులు రికార్డు చేస్తే చాలు, అంతకన్నా ఎక్కువ ఏమీ అవసరం లేదని 'బతుకుపోరు' నవల చదివిన తర్వాత అనిపించింది.

'బతుకుపోరు' నవల తెలుగు ఉద్యమ నవలకు ఒక మంచి నమూనా. 1980 దశకంలో గల తెలంగాణలోని వాస్తవిక పరిస్థితిని సృజనాత్మకంగా వ్యక్తీకరించింది. ఇందులో రచయిత అభిప్రాయాలకు, విశ్వాసాలకు ఎక్కడా తావులేదు. అప్పటి పరిస్థితిని చిత్రిక కట్టి పాఠకుల ముందుంచుతుంది. ముందే చెప్పినట్టు శ్రామిక బహుజన స్త్రీల దృశ్య కావ్యం 'బతుకుపోరు'. సామాజిక జీవిత చిత్రణ దృష్ట్యా, సృజనాత్మక రచన కళాసౌందర్యం దృష్ట్యా ఇది ఎల్లకాలం సాహిత్యంలో నిలిచిపోయే రచన."[27]



## పాదసూచికలు

1 తెలుగు సినిమా సాహిత్యం; కథ-కథనం-శిల్పం; డా॥ పరుచూరి గోపాలకృష్ణ; (పుటలు :192 - 195)
2 బతుకుపోరు - మూడవ ముద్రణ; అల్లం నారాయణ - ముందుమాట; (పుట :7)
2/2 బతుకుపోరు నవల - బి.ఎస్.రాములు, రెండవ ముద్రణ; ముందుమాట డా॥ దాశరథి రంగాచార్య ; (పుట :5)
3 బతుకుపోరు నవల - మూడవ ముద్రణ; బి.ఎస్.రాములు ; (పుట :109)
4 నవలా శిల్పం - వల్లంపాటి వెంకటసుబ్బయ్య; (పుట :80)
5 బతుకుపోరు నవల; (పుట :16)
6 బతుకుపోరు నవల; (పుట :36)
7 బతుకుపోరు నవల - మూడవ ముద్రణ; బి.ఎస్.రాములు; (పుట :27)
8 ఐ.వి.ఎస్. అచ్యుతవల్లి నవలా సాహిత్యం; డా॥ కె.బి.లక్ష్మి; (పుట :18)
9 బతుకుపోరు; (పుట :48)
10 బతుకుపోరు; (పుట :49)
11 వనమాల చంద్రశేఖర్ గారితో సంభాషణలు
12 బతుకుపోరు రెండవ ముద్రణ, కె.రామ్మోహనరాజు; (పుట :10)
13 బతుకుపోరు రెండవ ముద్రణ; (పుట :11)
14 బతుకుపోరు నవల - మూడవ ముద్రణ; బి.ఎస్.రాములు; (పుట :66)
15 ఐ.వి.ఎస్. అచ్యుతవల్లి నవలా సాహిత్యం; కె.బి.లక్ష్మి; (పుట :118)
16 అల్లం నారాయణ; బతుకుపోరు నవల (పుటలు :7,8)
17 కాత్యాయిని విద్మహే - తెలుగువచన విదయం; (పుట :273)
18 నవలా శిల్పం - వల్లంపాటి వెంకటసుబ్బయ్య
19 ఐ.వి.ఎస్. అచ్యుతవల్లి నవలా సాహిత్యం; కె.బి.లక్ష్మి; పేజి : 152
20 బతుకుపోరు నవలలోని మాండలిక పదాలు.
21 నవలలోని సామెతలు - నుడికారాలు - పలుకుబడులు.
22 సబ్బని లక్ష్మీనారాయణ - మూసి మాసపత్రిక-2005
23 ఎర్రోజు రాజమౌళి; అముద్రిత వ్యాసం
24 కె.రామ్మోహనరాజు, బతుకుపోరు రెండవ ముద్రణ,1991; (పుట :7).
26 సబ్బని లక్ష్మీనారాయణ, మూసిమాసపత్రిక-2005
27 బతుకుపోరు ; (పుట :110)
28 కాసుల ప్రతాపరెడ్డి, నేటినిజం దినపత్రిక 24-3-2005



## ముగింపు

తెలంగాణ ఉద్యమ నవలల్లో బతుకుపోరు విశిష్టమైనది. బి.ఎస్. రాములుగారు రాసిన 'బతుకుపోరు' నవల గ్రామీణ బహుజన శ్రామిక స్త్రీల వాస్తవజీవితాలను చిత్రించిన నవల ఇది.

దళిత, శ్రామిక స్త్రీలు గ్రామాల్లో పురుషులతో సమానంగా కాయకష్టం చేస్తారు. ఆ కాయకష్టంకాస్తా తెలంగాణలో వ్యవసాయం నుంచి బీడీ పరిశ్రమలోకి మారింది. ఆర్థికంగా బాగుపడతామనే ఆశలు అడుగంటి పోతుండగా శరీరాలను పీల్చిపిప్పిచేస్తున్న వైనాన్ని 'బతుకుపోరు' నవల ప్రతిభావంతంగా చిత్రించింది. ఇందులోని ప్రధానపాత్ర లక్ష్మి. సాత్వికపాత్ర. లోకజ్ఞనమెరిగిన స్త్రీ. రామక్క, సత్తెక్క, సుగుణ ఒక్కోపాత్ర ఒక విలక్షతను సంతరించుకుంది. ఇవి మూసపాత్రలు కావు. సజీవ పాత్రలు. మన కళ్ళముందు కదలాడే తెలంగాణ పల్లె స్త్రీలు.

'బతుకుపోరు' నవల తెలంగాణ బహుజన శ్రామికస్త్రీలు తమ కథలను తమ వెతలను, తమ పోరాటాలను నోరుతెరచి చెప్పకుండానే వారి మాటల ద్వారా, చేష్టల ద్వారా మనకు తెలియజేస్తున్నారు. ఆడబతుకులెంత కష్టమైనవో, తాము వివక్షకు ఎలా గురువుతున్నామో, గ్రామీణ బహుజన స్త్రీలకు స్పష్టంగానే తెలుసు. ఏ పల్లె స్త్రీని పలకరించినా యీ విషయాలు మనకు స్పష్టంగా అర్థమౌతాయి.

బతుకుపోరు నవలలో గ్రామీణ బహుజన కులాల జీవితాలు, తెలంగాణ గ్రామీణ జీవితం కళ్ళకు కట్టినట్లు కనిపిస్తుంది. చాకలి మైసి బుక్కెడంత అన్నం దొరకుతుందని బట్టలు ఉతికి ఉతికి నాపెయి ఎండిపోయింది. అందరి కంటే హీనం మాబతుకులు అని తమ జీవిత సారాన్ని నాలుగు మాటల్లో చెప్తుంది. లక్ష్మి కొడుకు శ్రీను, సరస్వతిల చదువులు రెండున్నర దశాబ్దాల క్రితం తెలంగాణలో బడులకు పోవటం ప్రారంభించిన అందరికి వర్తిస్తుంది.

తెలంగాణలో, భాష.సంస్కృతి, ప్రజల అలవాట్లు, శ్రామిక స్త్రీల జీవన విధానం మొ॥లు విషయాలు ఈ పరిశోధనలో ప్రస్తుటం అయ్యాయి. బతుకుపోరు నవలను ముందే చెప్పినట్టు **"శ్రామికవర్గ, స్త్రీవాద, సామాజిక, సామ్యవాద, వాస్తవికతావాద క్లాసిక్ నవల"**. తెలంగాణ భాషలో చేసిన రచన. గొప్ప రచన విశ్వజనీన సత్యాన్ని ఆవిష్కరిస్తుందనే విషయానికి 'బతుకుపోరు' నవల తార్కాణం.

ఈ పరిశోధన కవుల, రచయితల, మేధావుల ప్రశంశలకు పాత్రమవుతుందని అశిస్తున్నాను.

# ఉపయుక్త గ్రంథసూచి


అయిలయ్య బన్న - తెలంగాణా సాహిత్య సాంస్కృతిక చైతన్యం
ఎల్లారెడ్డి కర్రె - 17 సెప్టెంబర్, 1948.
గోపాలకృష్ణ పరుచూరి - తెలుగు సినిమా సాహిత్యం - కథ - కథనం - శిల్పం
చెరబండరాజు - చెరబండరాజు నవలలు,2003
జయధీర్ తిరుమలరావు - పొది - సంభాషణలు - అక్షరచిత్రాలు, 2003.
జితేంద్రబాబు కె - తెలంగాణలో చైతన్యం రగిలించిన నిజాం రాష్ట్రాంధ్ర మహాసభాలు, ప్రథమాభాగం.
నర్సింహారెడ్డి డి., సురేష్ పి - చేనేతను ముంచుతున్న నూలు సమస్య, 2004.
నారోగొనే వి.జి. ఆర్ - సత్యశోధక సమాజ్ కార్మిక ఉద్యమాలకు పుట్టినిల్లు.
ప్లెహనోవ్. జి.వి. - కళలు, సాంఘిక జీవితం
ప్రతాపరెడ్డి కాసుల - ఎల్లమ్మ కథల సంపుటి, 2006
-- - తెలుగు నవల - వ్యాపారధోరణి, 1990.
రంగాచార్య దాశరథి - రచనలు, 11వ సంపుటి
రంగారెడ్డి కె.వి. - స్వీయచరిత్ర, 2003.
రాములు. బి. ఎస్ - బతుకుపోరు నవల, మొదటి ముద్రణ, 1982.
బతుకుపోరు నవల,రెండవ ముద్రణ, 1991.
బతుకుపోరు నవల,మూడవ ముద్రణ, 2005.
-- - కథలబడి, 1998
-- - సాహిత్య చరిత్రను కొత్తచూపుతో తిరగరాయాలి
-- - బహుజనతత్వం, 2003
-- - 50 ఏళ్ల కథాతీరు తెన్నులు, 2003.
-- - తేనెటీగలు, 2004
-- - 50వ జన్మదిన స్వర్ణోత్సవ సంచిక, 2005.
-- - స్మృతి కథల సంపుటి, 1998.
రామ్మోహన రావు కడియాల - తెలుగు పసిడి - వ్యాస సంకలనం, 2006.
రవీందర్ దుర్గం - కరీంనగర్, నిజామాబాద్ జిల్లాలు డైరక్టరీ.
వరవరరావు - తెలంగాణ విమోచనోద్యమం - తెలుగు నవల, 2007.
వెంకట సుబ్బయ్య, వల్లంపాటి - నవలాశిల్పం, 1989.
విద్యేశ్వరి డి. - భారతీయ భాషల్లో నవలా ప్రక్రియ, 1998.
లక్ష్మణ చక్రవర్తి సి.హెచ్ - ఆధునిక సాహిత్య విమర్శనారీతులు, 2004.
లక్ష్మి కె.బి. - ఐ.వి.యస్. అచ్యుతవల్లి నవలా సాహిత్యం, 2007.
సరోజని రేగాని - నిజాం బ్రిటీష్ సంబంధాలు
సదాశివ్ కర్రె - బి.ఎస్ - రాములు కథలు - ఒక పరిశీలన, 2007.
స్వామి. బి.వి.ఎన్ - శతవసంతాలు కరీంనగర్, 2006.
శ్రీనివాస్ సంగిశెట్టి - షబ్నవీస్, తెలంగాణ పత్రికా రంగచరిత్ర.
శ్రీరాములు ఎం. - జాతర నవల - సమగ్ర పరిశీలన, 2005.






# బి.ఎస్.రాములు గారితో ఇంటర్వ్యూ

**1) బతుకుపోరు నవల రాసిననాటి సామాజిక, ఆర్థిక, స్థితిగతులు ఏమిటి?**

1981 చివరిలో బతుకుపోరు నవల రాయడం ప్రారంభించాను. కరీంనగర్ జిల్లా హుజూరాబాదు నుండి వేములవాడకు 1980 సెప్టెంబరులో ఉద్యోగరీత్యా బదిలీ అయ్యాను. వేములవాడ, సిరిసిల్ల జగిత్యాల ఈ మూడు తాలూకా కేంద్రాలలో నిరంతరం సంబంధాల్లో ఉండేవాడిని. విప్లవ రచయిత సంఘం సభ్యుడిగా అనేకమంది యువరచయితలను, సాహిత్య అభిమానులను, కలిసేవాడిని, కూడగట్టేవాడిని, గోష్ఠులు నిర్వహించేవాన్ని. వేములవాడ కన్నా సిరిసిల్లయే అందుకు ఎక్కువ అనువుగా ఉండేది. ట్రెజరీ కేంద్రం సిరిసిల్లలో ఉండటం వల్ల ఎక్కువ మంది సిరిసిల్లలో కలిసే అవకాశం ఉండేది.

వేములవాడలో కుటుంబంతో కాకుండా ఒక్కడినే ఇల్లు కిరాయి తీసుకొని వుండేవాణ్ణి. జగిత్యాలలో మా మామ చెన్ననారాయణ, శ్యామల, పిల్లలు ఉంటూ మిషన్‌కాంపౌండ్ ప్రాంతంలో ఇంటి నిర్మాణాన్ని చూసుకున్నారు. ఆ ఇంటిపనికి సాయంగా నేను కూడా వీలైనప్పుడు జగిత్యాలకు వెళ్ళేవాడిని. సిరిసిల్ల జగిత్యాల వెళ్ళకుండా వేములవాడలో ఉన్న రోజుల్లో దొరికిన సమయంలో 'పాలు' కథ రాశాను. అదే సమయంలో 'బతుకుపోరు' నవల కూడా రాశాను. ఒక సన్నకారు రైతు ఇంట్లో బర్రెల కొట్టం పక్కగదిలో నేను కిరాయికి ఉండేవాన్ని. వారి ఇంట్లో మరో కుటుంబం కూడా కిరాయికి ఉండేది. వాళ్ళు బీడీలు చేసే వాళ్ళు. 'బతుకుపోరు' నవలలోని లక్ష్మి మాతృక ఆమే. అయితే లక్ష్మి పాత్ర ఆమెకు సంబంధించినది కాదు. ఆమె ఒక స్ఫూర్తి మాత్రమే. ఆ తర్వాత నాకు తెలిసిన జగిత్యాల చుట్టూతాగల పల్లెప్రజల జీవితాల నుంచి గ్రహించినదే నవలలో రాశాను.

బతుకుపోరు నవల రాసే నాటి సామాజిక, ఆర్థిక స్థితిగతులు వివరంగా చెప్పాలంటే అదీ ఒక పుస్తకం అవుతుంది. ప్రజల సమస్యలను తీసుకొని విప్లవ కార్యకర్తలు అనేక రంగాల్లో ఉద్యమాలు చేస్తున్న కాలంలో దున్నే వారిదే భూమి అనే నినాదంతో వ్యవసాయ విప్లవం ఇరుసుగా నూతన ప్రజాస్వామ్య విప్లవం చేయాలని భావిస్తున్న కాలంలో 1978లో జగిత్యాల జైత్రయాత్ర జరిగింది. ఆ తర్వాత వెంటనే జగిత్యాల, సిరిసిల్లతాలుకాలను కల్లోలిత ప్రాంతాలుగా ప్రకటించారు. అపుడునేను విప్లవ రచయితల సంఘం, పౌరహక్కుల సంఘం, అంబేద్కర్ సంఘాలు యీ మూడింటిలో క్రియాశీలంగా పనిచేసేవాడిని. బీడీ కార్మికుల సమస్యలను తీసుకొని ఉద్యమిస్తున్న క్రమాన్ని ఆనాటి

సామాజిక స్థితిగతులను చిత్రించాలని అనుకున్నాను. అలా 'బతుకుపోరు' నవలలో జీవితంలో భాగంగా చెప్పగలిగిన మేరకు చిత్రించాను. బతుకుపోరు నవల అనే ఫ్రేములో జీవితం యొక్క చిత్రపటాన్ని ఫ్రేము కట్టాను (బి.ఎస్.రాములు గారు ఇంకా అనేక విషయాలు సంభాషించారు. వాటిని నా పరిశోధనా వ్యాసంలో పేర్కొన్నాను. పునరుక్తి కాకుండా ఇక్కడ పరిహరించాను)

**2) బతుకుపోరు నవల మీ జీవితమని చాలామంది అంటుంటారు. ఈ నవలలో మీ జీవితం ఏ మేరకు వుంది?**

మా అమ్మ 1956 నుండి బీడీ కార్మికురాలు. ఇలా నేను బీడీల్లో పుట్టి బీడీల్లో పెరిగాను. బీడీఆకు, తంబాకు, కత్తిరించి పడేసిన బీడీ ఆకు, అమ్మచీర కుచ్చుల్లోంచి దులుపుతుంటే దాన్ని కమ్మని వాసనగా స్వీకరించేవాడిని. అదే నాకు మా అమ్మ వాసన అన్పించేది. అందులో బీడీఆకు, పొగాకు వాసన కలిసి ఉండేది. నేను కూడా బీడీలకు దారం కట్టడం 1964 నుండి, 1967 నుండి బీడీలు చేయడం, ఆ తరువాత బీడీ కంపెనీలో పని చేయడం చేశాను. 1975 దాకా బీడీ పరిశ్రమతో ప్రత్యక్ష సంబంధం కలిగి వున్నాను. మా కుటుంబంలో అనుభవంలోనికి రానిదేదీ బతుకుపోరు నవలలో లేదు. అందులోని జీవితాలు, సంఘటనలు, సన్నివేశాలు అన్నీ మా జీవితంలోనివే. మా ఇరుగుపొరుగు వారి జీవితంలోనివే. ఇందులో ఏవీ ఊహించి రాసినవి కావు. ఆయా సంఘటనలను, సన్నివేశాలను గుర్తు చేసుకొని రాసినవే. ఎప్పుడో మనస్సు అన్న కెమెరా తీసిపెట్టిన ఫొటోలను ఆల్బమ్‌లో క్రమపరిధిలో పేర్చినట్లు, 'బతుకుపోరు' నవలలో పూసలను కూర్చినట్లు కూర్చాను.

లక్ష్మి పాత్ర మొదట మా అమ్మ పాత్ర అని నేను భావించలేదు. లక్ష్మిరాజు, రామక్క పాత్రలోనే మా అమ్మ, మా అన్న రాజనర్సయ్య పాత్రలు ఉన్నాయని భావించాను. కానీ కొందరు సాహితీ మిత్రులు మీ చిన్నప్పుడు మీ అమ్మ లక్ష్మి లాగే ఉండేదనుకుంటా ఒకసారి గుర్తు చేసుకోండి అని అన్నారు. అలా ఆలోచేస్తే లక్ష్మి పాత్రలో కూడా లక్ష్మి వయసులో వున్నప్పుడు మా అమ్మపాత్రే అని అనిపించింది. అయితే మా నాన్న చిన్నప్పుడే చనిపోవడం వల్ల లక్ష్మిని మధ్య వయస్సు దంపతుల్లో ఇల్లాలుగా చిత్రించడం వల్ల మా అమ్మలాంటి పాత్రను చిత్రిస్తున్నానని మొదట తట్టలేదనేది వాస్తవం. వేములవాడలో కిరాయికి వున్నచోట బీడీలు చేస్తున్న ఇల్లాలి పాత్రే కావచ్చును. కానీ మొత్తం లక్ష్మి పాత్ర, స్వభావం, పరిణామం, సన్నివేశాలు అన్నీ మా అమ్మ గురించినవే. చాకలి మైసి పేరిట రికార్డు చేసిన జీవితం మా ఇంటి చాకలి ఆశువుగా చెప్పే పాట వంటి డైలాగులే యథాతథంగా పెట్టాను. సుగుణ పెళ్ళి కోసం చర్చించిన విషయాలు కూడా మా అమ్మ స్వభావానికి సంబంధించినవే. ఆ స్వభావాన్ని మరికొంత గ్లోరిఫై చేశాను. మరింత అవగాహన కలిగిందిగా ఒక మెట్టు ఎక్కువ చిత్రించాను. నారాయణ బీడీ కంపెనీలో తక్కువ జీతం ఇచ్చినందుకు ఎదురు తిరిగిన సంఘటన నా జీవితంలోనిదే. దాన్ని యథాతథంగా చిత్రించాను. బీడీలు చేస్తూ ఆ వృత్తిలోనే వుంటూ వృద్ధాప్యంలో ఎదురైన సంఘటనలు అన్నీ మా అమ్మ గురించినవే. మేము మా అమ్మను 'అవ్వ' అని పిలుస్తాము.



రామక్క ఇంట్లోనుంచి వెళ్ళిపోయి బొంబాయిలో బట్టల మిల్లు కార్మికుడుగా పని చేస్తున్న కొడుకు కోసం పడే తపన, ఆవేదన అంతా మాఅన్న గురించినదే, మా అమ్మదే. ఈ ఛాప్టర్‌ని నేను జగిత్యాలలో వున్నప్పుడు రాశాను. ఆ ఛాప్టర్ పూర్తి చేసేలోగా మా అన్న జీవితం అర్థాంతరంగా 1974లో ఎలా ముగిసిపోయిందో! గుర్తుకు వచ్చి ఎన్ని సార్లు ఏడ్చేశానో! రాస్తున్న పేపర్లు నా కన్నీళ్ళతో ఎన్నిసార్లు తడిసిపోయాయో! పెట్టుబడిదారీ పారిశ్రామిక వ్యవస్థ పరిణామాలు మా అన్న జీవితాన్ని బలితీసుకున్నాయి.

ఈ దుర్మార్గ వ్యవస్థను బట్టబయలు చేయలేకపోయానని దుఃఖము, కసి కలగలసి దుఃఖం అనేక రెట్లు పెరిగింది. ఎవరి దుఃఖమైనా, ఎవరి కన్నీళ్ళైనా అక్షరాల్లోకి ఎక్కించడం సాధ్యం కాదు. మనం అనుభవించే దుఃఖాన్ని, అనుభూతిని పాఠకులు, ప్రేక్షకులు అనుభవించాలంటే ఆ దుఃఖాన్ని యథాతథంగా చెప్తే చాలదు. అనేక సంఘటనల్లో, సన్నివేశాల్లో పర్యవసానాల ఫలితంగా దుఃఖాన్ని చిత్రీకరించినప్పుడే ఆ దుఃఖంలో పాఠకులు, ప్రేక్షకులు మమేకమై దుఃఖిస్తారు. లేదా అదే స్థితిలో వున్న వాళ్ళు ఆలాంటి చిత్రీకరణ ఏమీ లేకపోయినా దుఃఖిస్తారు. నర్సన్న పాత్ర గురించి రాసిన దానికన్నా ఎక్కువగా అనుభూతి చెంది దుఃఖించిన వాళ్ళు ఎందరో! ఇలా నవలలో నా జీవితంలోని సన్నివేశాలు సంఘటనలే వున్నాయి. వాటిని పిండిగా తీసుకొని కథ, కథాకథనం అనే నీళ్ళు పోసి పిండిముద్ద చేసి రచనా నైపుణ్యం అనే రొట్టెలు చేసే కర్రగా నైపుణ్యంతో రొట్టె చెయ్యడం వంటిదే 'బతుకుపోరు' నవల. పంటమీద జొన్న చేను దృశ్యం ఒకటి, జొన్నలను పండిచేసి రొట్టెలుగా మార్చుకొని తినడం మరొకటి, జొన్న చేనుకు, జొన్న రొట్టెకు వున్న సంబంధమే జీవితానికి, రచనకు వున్న సంబంధం.

**3) జీవితాన్ని సాహిత్యంగా మార్చినప్పుడు మీరు తీసుకున్న జాగ్రత్తలు ఏమిటి? మీకు ఎదురైన సమస్యలు ఏమిటి? జీవితాన్ని కథల్లోకి, నవల్లోకి మార్చినప్పుడు తీసుకోవాల్సిన జాగ్రత్తలు, మెళకువల గురించి, రచనా శిల్పం గరించి యువతరానికి మీరిచ్చే సూచనలు ఏమిటి?**

ఇంతకుముందే చెప్పినట్లు జీవితం జొన్న చేను వంటిది. రచన, రొట్టె వంటిది. జొన్నలను చక్కని రొట్టెగా తయారు చేసుకొనే దశలన్నీ రచనా, నైపుణ్యానికి సంబంధించినవి. 'బతుకుపోరు' నవల మా అమ్మ జీవితం నుంచి ప్రారంభిస్తే ఇలా వుండేది కాదు. కానీ మా అమ్మ జీవితం లేకుండా 'బతుకుపోరు' నవల లేదు. నా జీవితాన్ని పూర్తి స్థాయిలో నవలతో పోల్చుకోవడం కూడా కష్టం. బీడీ కార్మికుల జీవితాన్ని సాహిత్యీకరించాలని వారి జీవితాలు ఎలా వుంటాయో పాఠకులకు పరిచయం చేయాలని, బీడీ కార్మికుల జీవితాలలోని అనేక అంశాలపై అవగాహన కల్పించాలని ఈ నవల రాశాను. బీడీ కార్మికులు ఈ నవలను చదివించుకొని విన్నారు. టేప్‌రికార్డ్ ద్వారా విన్నారు. అదంతా తమ జీవితమని భావించారు. లక్ష్మి పిల్లలు తమ పిల్లలే అని భావించారు. లక్ష్మి పాత్ర తమ పాత్రే అని ప్రతి పాత్రను పోల్చుకున్నారు. అలా నవ్వారు, ఏడ్చారు, వేదన చెందారు. వ్యక్తిగత దృష్టికోణం నుంచి సామూహిక, సామాజిక దృష్టి కోణానికి మారారు. సహజంగా బీడీ కంపెనీయే ఒక కూడలి. కనుక కార్మికుల్లో సమైక్య

కార్మిక దృక్పథం, పరస్పర సహకారం, కష్టాలు, కన్నీళ్ళల్లో పాలు పంచుకోవడం, పండగలకు, పబ్బాలకు కార్మికులు అందరూ ఆహ్వానించుకోవడం జరుగుతూ వుంటుంది.

నవలలోకి జీవితాన్ని యథాతథంగా కూడా తీసుకురావచ్చు. దాని ఫ్రేమ్‌వర్క్ మరో తీరుగా వుంటుంది. 'బతుకుపోరు' నవలలో నేను ఆ ఫ్రేమ్‌వర్క్ తీసుకోలేదు. బీడీ కార్మికుల జీవితాల్లోని అన్ని కోణాలను పరిచయం చేయడమనే లక్ష్యానికి పరిమితమైనది.

యువతరంకోసం జీవితాన్ని కథ, నవలల్లోకి మార్చేటప్పుడు తీసుకోవలసిన మెళకువల గురించి కథలబడి, కథా సాహిత్య అలంకార శాస్త్రం రాశాను. "నవల ఎలా రాయాలి" అని 1986లో రాసిన గ్రంథం అముద్రితంగానే వుంది. వాటిని అప్‌డేట్ చేసి త్వరలో పుస్తక రూపంలో తెస్తాను. అందులో ఇవన్నీ వివరిస్తాను.

4) **బీడీ కార్మికులు ఇప్పుడు ఎలా వున్నారు? బీడీ పరిశ్రమ ఇప్పుడు ఎలా వుంది? బీడీ కట్టలపై పుర్రె గుర్తును ముద్రించడం వల్ల బీడీ పరిశ్రమ గురించి మీ అభిప్రాయమేమిటి?**

బీడీ కార్మికుల గురించి 1982లో నవల రాసిన నాటికీ, ఇప్పటికీ కాస్త మెరుగ్గా వున్నారు. అయితే ఇది ఒకవైపు మాత్రమే. 1982 నాటికి ప్రావిడెంట్ ఫండ్ ఖాతాలు లేవు. బీడీల వేతనాన్ని ఎగవేసి కంపెనీలు రాత్రికి రాత్రి మూసివేసి వెళ్ళిపోయిన స్థితి వుండేది. కూలీ తక్కువగా వుండేది. కార్మిక సంఘాలు కాస్త బలహీనంగా వుండేవి. తాము కార్మికులమని ఫీలవడం తక్కువగా వుండేది. ఏదో వేడి నీళ్ళకు చన్నీళ్ళని కుటీర పరిశ్రమగా కార్మికులు ఫీలయ్యేవారు. కానీ తర్వాత స్త్రీ కార్మికులంతా ఇల్లాలే కాకుండా కార్మికవర్గం అని గుర్తించడం ప్రారంభించారు. దానికి ఎందరో మహిళా కార్మికులు నాయకులుగా పని చేశారు. నా చిన్ననాటి మిత్రుడు కొక్కుల మారుతీ తల్లి కొక్కుల బుచ్చమ్మ, మా అమ్మ ఇద్దరూ ఒకే కంపెనీలో కార్మికులు. పక్కపక్కనే కూర్చుని బీడీలు చేసేవారు. బుచ్చక్క బీడీ కార్మికురాలిగా పనిచేసింది. బీడీ కార్మికులలో రాజకీయ చైతన్యం కూడా పెరిగింది. కొక్కుల బుచ్చక్క మున్సిపల్ కౌన్సిలర్‌గా గెలిచింది. ఈమె పాత్రను 'బతుకుపోరు' నవలలో చిత్రించలేకపోయాను. ఆమె సిపిఐ తరఫున పనిచేసింది. ఆ రోజుల్లో నేను సిపిఐ కార్మిక సంఘాన్ని విమర్శించి విప్లవ కార్మిక సంఘాన్ని ఆదర్శీకరించే పని పెట్టుకున్నాను. కొక్కుల బుచ్చక్కను విమర్శించడం ఇష్టం లేక ఆ పాత్రను ప్రవేశ పెట్టలేదు. అయితే కొక్కుల బుచ్చక్కవంటి బీడీ కార్మిక నాయకురాళ్ళు జగిత్యాల, కోరుట్ల, సిరిసిల్ల మండలాల్లో సర్పంచ్‌లుగా, మున్సిపల్ కౌన్సిలర్లుగా, మున్సిపల్ ఛైర్‌పర్సన్‌గా ఎన్నికయ్యారు. బీడీ కార్మికుల పిల్లలు చదువుకొని ప్రభుత్వ ఉద్యోగాల్లోకి ఎక్కారు. కొందరు డాక్టర్లు, ఇంజనీర్లు, లెక్చరర్లు అయ్యారు. తల్లీబిడ్డలు కష్టపడి బీడీలు చేసి మగపిల్లలను చదివించారు. మగపిల్లలు ఎదిగిన తర్వాత వాళ్ళు తిరిగి తమ కోసం కష్టించిన తల్లులు, అక్కలు, చెల్లెళ్ళకు సాయం చేయాలని, మేలు చేయాలని అన్ని విధాలుగా కృషి చేశారు. ఇలా ఆత్మీయత, అనుబంధాలు పెరిగాయి. ఇవన్నీ 'బతుకుపోరు' నవల తరువాత బీడీ కార్మిక, సాంస్కృతిక, ఆర్థిక పరిణామాలు. వీటిని స్మృతి, బతుకుపోరు, జీవనయానం, మమతలు కథల్లో చిత్రించాను. మా అన్న నర్సన్న పాత్రను 'బతుకుపోరు'లో సమగ్రంగా చిత్రించలేదన్న బాధ 20 ఏళ్ళు అయినా గుండెల్లో అలాగే వుంది. 'చదువు' కథలో నర్సన్న పాత్ర మరికొంత చిత్రించి రాసి ఊరట చెందాను.



బీడీ కార్మికులు వున్న కుటుంబ జీవితాలను వారసత్వం, ప్రశాంతం మొదలైన కథల్లో చిత్రించాను. అయితే బీడీ కార్మికుల జీవితాల్లో అప్పటికీ, ఇప్పటికీ బాధాకరమైన మార్పు కూడా గమనించడం అవసరం. ఇప్పుడు కార్మికులకు, బీడీలు చేయగలిగిన మేరకు ఆకు, తంబాకు ఇవ్వడం లేదు. వెయ్యి బీడీలకు 60 రూపాయలు ఇస్తారు. కానీ 600 బీడీలకే తంబాకు ఇస్తున్నారు. అందరూ ఒకచోట కూర్చుని బీడీలు చేయడం పూర్తిగా తగ్గిపోయింది. అందరూ ఒక్కచోటే కూర్చుంటే ఇల్లు కిరాయి మొదలైనవి పెరుగుతాయని, సంఘటిత శక్తి పెరిగితే దాన్ని తట్టుకోలేమని యాజమానుల దృష్టి. ఇలా అందరూ ఒక్క కుటుంబంగా కలిసి జీవించే అవకాశం కోల్పోయారు. తద్వారా సామాజిక, సామూహిక మనస్తత్వం కొంత తగ్గుతున్నది. అందువల్లే వాళ్ళు ఇవాళ ఆకు తుట్టి పోయిందని, కూలి కోస్తుంటే మౌనంగా భరిస్తున్నారు. మునపటిలా కార్మికులు చిట్టీలు వేసుకొని పరస్పరం అవసరాలకు వాడుకొనే పద్ధతి తగ్గడం వల్ల, నగదు అవసరం కోసం పేద కార్మికులు తంబాకుకొని ఆకుబీడీలు చేసుకొని వచ్చి సగం కూలికి యజమానులకు ఇచ్చే దయనీయ స్థితి వుంది. ఇప్పుడు కొందరికి నెలకు 500 రూపాయల నుండి 800 రూపాయల వరకు పెన్షనల్‌లు కూడా వస్తున్నాయి. మొత్తానికి బీడీ పరిశ్రమ ఒక పూర్తి స్థాయి కార్మికుల సౌకర్యాలను సాధించుకుంది. ఇది అప్పటికీ ఇప్పటికీ వున్న తేడా.

పుర్రె గుర్తు బీడీకట్టలపై పెట్టాలనే నిర్ణయం లక్షలాది బీడీ కార్మికుల జీవించే హక్కును నిరాకరించడమే. సిగరెట్ తదితర పరిశ్రమల విస్తరణ కోసం బీడీ పరిశ్రమను నాశనం చేయాలనే శక్తుల చేతుల్లో కోర్టులు, చట్టాలు చిక్కుకుపోయాయి. అన్ని పరిశ్రమలలో ఇలా కార్మికుల ఉపాధికి, పెట్టుబడిదారి ప్రయోజనాలకు మధ్య అంతర్యుద్ధం కొనసాగుతుంది. ప్రతిమనిషికి పని చేసుకొనే అవకాశం కల్పించాలి. పొగాకు మంచిది కాకపోతే గంజాయి పంటలాగా పొగాకు పంటను నిషేధించాలి. నిషేధించి డీజిల్‌ను ఇచ్చే కానుగ చెట్లను పెంచాలి. తద్వారా విదేశీ మారకద్రవ్యం మిగులుతుంది. వీటన్నింటికన్నా ముందు మానవ సమాజానికి మహమ్మారిగా మారిన మద్యాన్ని నిషేధించాలి. మద్యంపై అన్ని వైపులా శవం గుర్తులను, పుర్రె గుర్తులను ముద్రించాలి. ఎయిడ్స్‌కు గురై లక్షలాది మంది మరణిస్తున్న సామాజిక పరిణామాలకు వలసలు, నగరీకరణ ప్రధానకారణం. పరిశ్రమల వికేంద్రీకరణ ద్వారా లక్షలాది మంది కార్మికులను ఎయిడ్స్ నుండి కాపాడాలి. ఇలా చెయ్యాల్సిన కర్తవ్యాలు ఎన్నో వున్నాయి. బీడీల మీద పుర్రె, శవం బొమ్మలు అవసరం లేదు. బీడీలు ఆరోగ్యానికి అంత హానికరం కాదు. ఇవి శాస్త్రీయంగా రుజువు చేయడం సాధ్యమైన విషయమే.

## క్షేత్ర పరిశోధనలో ముఖాముఖి సందర్శన - విషయసేకరణకు తోడ్పడినవారు

- వనమాల చంద్రశేఖర్, M.A., LLM

అడ్మినిస్ట్రేట్ ఆఫీసర్, కలెక్టర్ ఆఫీస్, కరీంనగర్

నేను విద్యార్థి దశ నుండి బీడీలు చేశాను. 8వ తరగతి వరకు బీడీలకు దారం కట్టడం, ఆకు కత్తిరించడం చేశాను. 1977లో 8వ తరగతి నుంచీ ఇంటర్ వరకు బీడీలు చేశాను. మా అమ్మ 30 ఏళ్ళు బీడీలు చేసింది. బి.పి. షుగర్ వల్ల ఆరోగ్యం దెబ్బతినడంతో బీడీ పని మాన్పించాను. మా ఇంట్లో అన్నదమ్ములు అందరూ బీడీలు చేసిన వాళ్ళమే. చదువుకునేటప్పుడు బీడీలు చేసినందుకు మా అమ్మ 2 రూపాయలు పాకెట్ మనీకి ఇచ్చేది. ఆనాడు యీ డబ్బు ఎంతో పెద్ద మొత్తం. మా జీవితాల్లో బీడీ పరిశ్రమ నిర్వహించిన పాత్ర ఎనలేనిది. నేను ఇవ్వాళ కాస్త చదువుకొని ఎదిగి ఉద్యోగం చేస్తున్నానంటే అందుకు కారణం బీడీ పరిశ్రమే. నా భార్య సుజాత పెళ్ళయ్యాక కూడా బీడీలు చేసింది.

ఇక్కడ ఆడపిల్లల పెళ్ళిల్లు కూడా బీడీలు చేసి ఆ డబ్బు కూడ బెట్టి పెళ్ళిల్లు చేసే వాళ్ళు. పెళ్ళికాని పిల్లలు చేసిన బీడీల డబ్బులను చిట్‌ఫండ్‌లో వేసి ఒక మొత్తంగా జమ వేస్తారు. బీడీల డబ్బులు వచ్చినప్పుడల్లా పెళ్ళికి సంబంధించిన వస్తువులు నెలకు ఏదో ఒకటి కొంటూ వుండేవారు. బంగారం, వెండి, బట్టలు కొనుక్కొనేవారు.

మా పక్కింటి సమీప బంధువు అత్తమ్మ కొక్కుల బుచ్చక్క బీడీ కార్మికురాలు ఆమె బీడీలు చేయడంతో పాటు బీడీ కార్మిక నాయకురాలిగా కూడా 40 సంవత్సరాలు పని చేసింది. ఆమె బీడీలు చేస్తూ పిల్లలతో కూడా బీడీలు చేయించింది. ఆమె కూతురు అంజలి కూడా బీడీలు చేసేది. ఇలా కూడబెట్టిన డబ్బులు రూ.40,000లతో డాక్టరుకు ఇచ్చి పెళ్ళి చేశారు. ఆ డాక్టరు కూడా ఎంతో పేదరికం నుండి చదువుకొని పైకి వచ్చారు. అలా డా॥ రాజేశ్వరరావు జగిత్యాలలో ఒక లీడింగ్ డాక్టర్. వీరి పిల్లలు కూడా ఉన్నత విద్య అభ్యసిస్తున్నారు.

కొక్కుల బుచ్చక్క బీడీ కార్మికుల నాయకురాలిగా పెరిగిన పరిచయాలతో బీడీ కార్మికులు ఆమెను మున్సిపల్ కౌన్సిలర్‌గా ఎన్నికల్లో గెలిపించారు. ఇలా బీడీ కార్మికులు రాజకీయ చైతన్యం కూడా సాధించుకున్నారు. కోరుట్ల, మెట్‌పల్లి, సిరిసిల్ల తాలూకా



కేంద్రాల్లో మహిళా బీడీ కార్మికులే మున్సిపల్ ఛైర్‌పర్సన్‌లుగా, మున్సిపల్ కౌన్సిలర్‌లుగా ఎన్నికయ్యారు.

బీడీ పరిశ్రమ వల్ల స్త్రీలు స్వయం పోషకంగా ఎదిగారు. ఫెమినిస్టులు చెప్పే స్వయం నిర్ణయ శక్తి, ఆత్మ విశ్వాసం, ఆర్థిక స్వేచ్ఛ బీడీ కార్మికులలో మొదటి నుంచి ఉంది. పిల్లలకు పుస్తకాలు, నోట్‌బుక్‌లు, పెన్సిళ్ళు కొనివ్వడం కూడా తల్లే చేస్తుంది. పిల్లలకు ఆరోగ్యం బాగాలేకపోతే భర్తను డబ్బులు అడిగే అవసరం లేకుండానే పిల్లలను తీసుకొని స్త్రీలే డాక్టరు దగ్గరకు వెళ్తారు. సినిమాలకు కూడా స్త్రీలే కలిసికట్టుగా వెళ్తారు. బీడీ కంపెనీకి బట్టలు మొదలైనవి అమ్మడానికి వచ్చినపుడు వాళ్ళే కొనుక్కొని వాయిదా పద్ధతిలో చెల్లిస్తుంటారు.



**బీడీలు చేసి వనమాల చంద్రశేఖర్‌ను చదివించిన తల్లి వనమాల జయలక్ష్మి (69)తో పరిశోధకురాలు**

నేటి స్వశక్తి సంఘాలు, డ్వాక్రా గ్రూపులు పుట్టక ముందు నుంచే ఆ కార్యక్రమాలను బీడీ కార్మికులు స్వయంగా నిర్వహించుకున్నారు. ఎలాంటి కమీషన్ లేకుండా చిట్‌ఫండ్ నిర్వహించుకొని అవసరమైన వాళ్ళకి తమ సభ్యులలో ఒకరికి ఇచ్చుకునే వారు. ఇలా స్వయం సహాయ బృందాలుగా బీడీ కార్మికులు నిర్వహించుకున్న క్రమంలోనే బహుశా వాటిని చూసి స్వశక్తి సంఘాలు రూపుదిద్దుకున్నాయి.

ఒక చిన్న ఉపాధి ఇలా బీడీ కార్మికులు వారి పిల్లలు 2, 3 తరాల్లో మధ్య తరగతి స్థాయికి, ఉన్నత మధ్య తరగతి స్థాయికి ఎదగడానికి అంచెలంచెలుగా ఎదగడానికి ఆధారమైనది.

నిజామాబాద్, నిర్మల్, ఆర్మూర్, కుమ్మర్‌పల్లి, మోర్తాడ్, కోరుట్ల, జగిత్యాల, మల్యాల

కొడిమ్యాల, ధర్మపురి, గొల్లపల్లి, సిరిసిల్ల, వేములవాడ, కరీంనగర్, సిద్ధిపేట, దుబ్బాక, వరంగల్ కామారెడ్డి, భీమ్‌గల్, బోధన్ ప్రాంతాలలో బీడీ పరిశ్రమ సామాజిక, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక, విద్యారంగాల్లో నిర్వహించిన పాత్ర గొప్పది. ఇక్కడ ప్రజలు సుభిక్షంగా బతకడానికి, అన్ని రంగాల్లో ఎదగడానికి బీడీ పరిశ్రమ ఒక ప్రధాన ఆదాయ వనరు.

బీడీ పరిశ్రమ వల్ల వ్యవసాయంపై మనుషుల వత్తిడి తగ్గింది. తద్వారా వ్యవసాయ కూలీలు పెరిగాయి. వ్యవసాయ కూలీల నైపుణ్యం కూడా పెరిగింది. వర్షాలు పడక యీ ప్రాంతం పంటలు పండక కరువుతో అలమటిస్తున్నపుడు బీడీ పరిశ్రమ అందరిని ఆదుకుంది. ముస్లింలు, బీసీలు, ఎస్సీలు, అగ్రకులాలలోని పేదలు బీడీలు చేయడం ఒక వృత్తిగా స్వీకరించారు.

బీడీ కార్మికులు కులాతీతంగా అందరూ వరసలు పెట్టి పిలుచుకునే వారు. ఎవరి ఇంట్లో ఫంక్షన్ జరిగినా అందరూ ఒకరినొకరు సహకరించుకొనే వారు. ఫంక్షనులో కానుక ఇవ్వడం కూడా అందరూ కలిపి ఇచ్చేవారు. ఇప్పుడు ప్రభుత్వాలు, స్వశక్తి సంఘాల కోసం రిజర్వ్ఫండ్ ఇచ్చి నిలబెట్టడానికి ప్రయత్నిస్తున్నారు. కానీ బీడీ కార్మికులు తామే రిజర్వ్ఫండ్‌ను నిర్వహించుకున్నారు. స్త్రీలు సామూహిక, సామాజిక శక్తిగా ఎదిగారు.

మా తల్లి జయలక్ష్మి (69 సం॥). 8 సం॥ల వయసు నుండి బీడీలు చేసింది. మొత్తం 50 ఏళ్ళు బీడీలు చేశారు.

'బతుకుపోరు' నవలపై సోషియాలజీ, పొలిటికల్ సైన్స్, ఎకనమిక్స్ సబ్జెక్టులలో కూడా రీసెర్చ్ చేయాల్సిన గొప్ప నవల అని నా అభిప్రాయం. 'బతుకుపోరు' నవల మీద ఆంధ్ర ప్రాంతం నుంచి రీసర్చి చేయాలని నిర్ణయించుకున్న మీకు నా హృదయ పూర్వక అభినందనలు. నిజానికి ఈ నవలపై ఇక్కడి ప్రాంతం వాళ్ళే బీడీ కార్మికుల నుండి ఎదిగి లెక్చరర్, ప్రొఫెసర్‌లుగా, ఇంజనీర్లుగా అన్ని రంగాల్లో ఎదిగిన వారు ఎప్పుడో రీసెర్చ్ చెయ్యాల్సింది. ఇప్పటికైనా మీరు చేస్తున్నందుకు హృదయపూర్వక ధన్యవాదాలు.

బీడీ కార్మికుల కుటుంబాల్లో ఒక్కొక్కరిని ఇంటర్వ్యూ చేయండి. తద్వారా మీకు బీడీ పరిశ్రమ ఇక్కడ ప్రజల జీవితాల్లో నిర్వహిస్తున్న మహోన్నత పాత్ర ఏమిటో తెలుస్తుంది. బీడీ పరిశ్రమ లేకపోతే ఇక్కడ బతుకే లేదు. బీడీ పరిశ్రమ ఇక్కడ లక్షలాది కుటుంబాలకు కన్న తల్లి. 'బతుకుపయనం' కథల సంపుటిలో బి.ఎస్.రాములు బీడీ పరిశ్రమ ద్వారా ఎదిగిన వారి జీవితాలను చిత్రించారు. సిరిసిల్ల పవర్‌లూమ్ పరిశ్రమ నుండి సంపాదించే ఆదాయం కంటే బీడీ కార్మిక స్త్రీలే ఎక్కువ సంపాదించి కుటుంబాలను పోషిస్తున్నారు. పవర్‌లూమ్‌లో వాళ్ళ జీతాలు తాగడానికి ఉపయోగిస్తే, కుటుంబాలను పోషిస్తుంది బీడీ కార్మిక స్త్రీలు. దేశం గర్వించే స్థాయిలో బీడీ కార్మిక స్త్రీలు కుటుంబాన్ని ఎదిగించడంలో నిర్వహిస్తున్న పాత్ర మహోన్నతమైనది. స్త్రీలకు ఇంత పెద్ద ఎత్తున ఉపాధి కల్పిస్తున్న పరిశ్రమ దేశంలో బీడీ పరిశ్రమ ఒక్కటే.



## బీడీ కార్మికులతో ఇంటర్వ్యూ ; జగిత్యాల



బీడికార్మికులతో పరిశోధకురాలు

| | పేరు | భర్త | పిల్లలు |
|---|---|---|---|
| 1 | మచ్చ లావణ్య<br>35 సం॥ వయసు<br>బీడీ కార్మికురాలు | శ్రీనివాసు (టీచరు)<br>40 సం॥ వయసు | ఇద్దరు అబ్బాయిలు<br>19 సం॥,<br>డిగ్రీ మొదటి సంవత్సరం<br>17 సం॥<br>ఇంటర్ మొదటి సంవత్సరం |
| 2 | మచ్చ రాధ (56)<br>బీడీ కార్మికురాలు | లక్ష్మి నర్సయ్య (60) | ఒక అబ్బాయి<br>22 సం॥ బి.ఇడి. |
| 3 | ఎనగందుల గంగు<br>48 సం॥లు<br>బీడీ కార్మికురాలు | గంగారామ్<br>52 సం॥లు<br>బీడీ కార్మికుడు | ఒక అబ్బాయి<br>ఒక అమ్మాయి |
| 4 | మామిడి లక్ష్మి (45)<br>బీడీ కార్మికురాలు | చంద్రయ్య (50)<br>కిరాణ షాపు | ముగ్గురు పిల్లలు<br>ఇద్దరు అబ్బాయిలు<br>ఒక అమ్మాయి |
| 5 | సీలం భారతమ్మ (47)<br>బీడీ కార్మికురాలు | రాజం (50)<br>కూలిపని | ఇద్దరు అబ్బాయిలు<br>ఇద్దరు అమ్మాయిలు<br>10వ తరగతి వరకు చదివారు |

|  |  |  |  |
|---|---|---|---|
| 6 | చందం శోభ (40) బీడీ కార్మికురాలు | చంద్రయ్య (44) బొంబాయిలో బట్టల మిల్లు కార్మికుడు | ఒక అబ్బాయి - డిగ్రీ ఒక అమ్మాయి - 9వ తరగతి |
| 7 | జయశెట్టి లక్ష్మి (40) బీడీ కార్మికురాలు | బాపురావు (45) పాల వ్యాపారం | ఇద్దరు అమ్మాయిలు ఒక అబ్బాయి - ఇంటర్ |

మాకు వెయ్యి బీడీలకు 60 రూపాయల కూలి ఇస్తారు. మేము రోజుకి 500 బీడీలు చేస్తాము. ఒక గుల్లకట్ట యజమాని తీసుకుంటాడు. 10 బీడీలు ఎక్కువగా వేస్తాము. కట్టకు 25 బీడీలు వుంటాయి. దీనికి కూలి ఉండదు.

ఆదివారం శెలవు. సంవత్సరానికి 6 రోజుల జీతం ప్రావిడెంట్ ఫండ్ ఇస్తారు. పబ్లిక్ హాలిడేలు అన్ని శెలవు దినాలు. పిల్లలకు ప్రసూతికి 350 రూపాయలు ఇస్తారు. కానీ అన్ని కంపెనీలలో ప్రసూతి డబ్బులు మా కార్మికులు అందరికీ అందడం లేదు. పిల్లలకు డిగ్రీ చదివే వరకు స్కాలర్‌షిప్పులు ఇస్తారు.

చిన్నప్పటి నుంచి 6, 7 సం॥ల నుండి బీడీలు చేసుకొనే బతుకుతున్నాము. మరి ఏ పనులు చేతకావడం లేదు. అన్నిటికి భర్తను అడగనవసరం లేదు. భర్త మీద ఆధారపడకుండా ఆర్థిక స్వావలంబన కోసం ఆడోల్లం బీడీలు చేసుకుబతుకుతున్నాం.

### భాగ్యలక్ష్మి, బీడీ కార్మికురాలు, జగిత్యాల

నేను చిన్నతనం నుండి బీడీ కార్మికురాలిని. నాకు 9 సం॥ల వయసులో వివాహం అయ్యింది. ఇక్కడ ఎంతోమంది స్త్రీలు బీడీలు చేసి కుటుంబాలను పోషిస్తున్నారు. బీడీల మీద పుర్రెగుర్తులు వేయడం అన్యాయం. తాగి పెళ్ళాన్ని కొట్టినోళ్లు, కుటుంబాలు పోగొట్టుకొన్నాళ్ళు వున్నారు కానీ బీడీ తాగి పెళ్ళాన్ని కొట్టినోళ్ళు ఉన్నారా? పుర్రె గుర్తు బీరు, విస్కి బ్రాందీల మీద వేయాలి. బీడిలమీద అవసరం లేదు. త్వరలో ఈవిషయంపై ఢిల్లీలో ప్రదర్శన చేస్తాము.

### సహదేవ్

నేను, బి.ఎస్.రాములు ధర్మపురిలో ఒకే ఇంట్లో వున్నాము. 6, 7 తరగతులు రాయకల్‌లో చదివాను. 8వ తరగతి నుండి ఓల్డ్ హైస్కూల్‌లో చదివాను. నాకు 10వ తరగతి సెలవుల్లో 13-5-1965 సం॥లో వివాహం జరిగింది. అప్పుడు నాకు 16 సంవత్సరాలు. నా భార్య పేరు భాగ్యం. వివాహం జరిగేటప్పటికి ఆమె వయస్సు 9 సంవత్సరాలు. భాగ్యం చిన్న వయస్సు నుండి బీడీ కార్మికురాలే. ధర్మపురిలో 1968 సంవత్సరం నుండి ఆయుర్వేద షాపు, ఆర్ఎమ్‌పిగా చేసిన. తర్వాత 1975 నుంచి కోళ్ళఫారాలు, కోళ్ళ మందులు, కోళ్ళ దాణా ఫీల్డ్‌లోకి మారిన.



## పేరాల లక్ష్మికాంతం - బీడీ ఆకు కాంట్రాక్టరు

ఇంటర్వ్యూ : జగిత్యాల



పేరాల లక్ష్మికాంతం - బీడీ ఆకు కాంట్రాక్టరు బనీనుపై ఉన్న వ్యక్తి

మా తండ్రి 5 సం॥ వయసులో చనిపోయారు. తల్లినన్ను హోటల్‌లో చిప్పలు కడగమన్నది. ఆ కాలంలో హోటల్‌లో నెలకు 5 రూ. జీతం. మా అమ్మకు 5 రూ. బీడీలు చేసి నీకు ఇస్తాను. నేను బడికి పోతాను అని చదువుకున్నాను. నేను ఉదయం ఆకు కత్తిరించడం. స్కూలు నుంచి వచ్చాక సాయంకాలం బీడీలు చేసేవాన్ని. మాతోపాటు బీడీలు చేసినోళ్లు టీచర్లు, డిస్ట్రిక్ కో-ఆపరేట్ ఆఫీసర్‌లు, లాయర్లు ఆయినవాళ్ళు వున్నారు. తొలుతనేను బి.యస్.రాములు గారితో పాటు బీడిల కంపెనీలో నెలకు 30 రూ. జీతానికి పని చేశాను. తర్వాత బీడీ కంపెనీలో క్లర్క్‌గా వున్నాను. బీడీ కంపెనీలో ఎజెంటుగా, బీడీ ఆకు కాంట్రాక్టరుగా, మున్సిపల్ కౌన్సిలర్‌గా అయ్యాను. బీడీ ఆకు కాంట్రాక్టరుగా ఒక్కోసారి చాలా నష్టం వస్తుంది. ఇల్లు కూడా అమ్ముకోవాల్సి వచ్చింది.

ఇప్పుడు రెండున్నర ఇంచ్‌లు బీడీలు చేస్తున్నారు. తంబాకు కిలో 70 రూపాయలు.

ఆకు తెంపేవాళ్ళు లంబాడీ, గోండు గిరిజనులు ఎక్కువగా ఉంటారు. ఆకుతెంపిన తర్వాత గవర్నమెంటు మొత్తంకు టెండరు (పాట) పెడతారు. టెండరులో పాల్గొన్న వారిలో ఆకు కాంట్రాక్టర్లలో ఎవరు ఎక్కువ పాట పాడితే వారికి కాంట్రాక్టు ఇస్తారు. మేము డబ్బులు కట్టి కాంట్రాక్టుకు తీసుకున్నాక ఫిబ్రవరి లాస్ట్‌వీక్ ప్రూనింగ్ (కొమ్మకొట్టుట) చేస్తాము. 45 రోజులకు బీడీలకు సరిపడే ఆకు తయారవుతుంది. ఆకులను 70 ఆకులు కలిపి ఒక కట్ట కడతాము. 1000 కట్టలు కలిపి ఒక స్టాండర్డ్ బ్యాగ్‌ను నిర్ణయిస్తాము.

బీడీ ఆకు తెంపడంలో ఆంధ్ర, ఒరిస్సా, మధ్యప్రదేశ్, ఒరిస్సా, ఛతీస్‌ఘడ్‌లో ఆకు తెంపే కూలీలు ఎక్కువగా ఉంటారు.

బంగ్లాదేశ్, నేపాల్, ఒరిస్సాలలో హైఎస్ట్‌క్వాలిటి ఆకు దొరుకుతుంది. మహారాష్ట్రలో ఆకు తెంపే కూలీలు 600 యూనిట్‌లు వుంటారు. అంటే యూనిట్‌కు 2500 మంది మొత్తం 15 లక్షల మంది కూలీలు పని చేస్తున్నారు.

ఈ క్రమంలో ఆకు తెంపే లేబరు, ఆకు సరఫరా లారీలు, బీడీ తయారు చేసే కార్మికులు, ఏజెంట్లు, చెక్కర్స్, బట్టీవాలా, ప్యాకింగ్‌లు చేయడం, ఆ బీడీలను ట్రాన్స్‌ఫర్ చేయడం జరుగుతుంది. ప్రభుత్వానికి ఎక్సైజ్ డ్యూటి కట్టాలి. జగిత్యాల తాలుకాలో నెలకు కోటిరూపాయల ఎక్సైజ్ వస్తుంది. రోజుకి 5 కోట్ల రూపాయల పేమెంటు కార్మికులకు ఇస్తున్నారు. జగిత్యాల, సారంగపూర్, మల్యాల్, ధర్మపురి ప్రాంతాలలో సుమారుగా 60 కోట్ల రూపాయల పేమెంట్ కార్మికులకు చేరుతుంది.

నాకైతే బీడీ పరిశ్రమే కన్నతల్లి. జగిత్యాల, సారంగపూర్, మాల్యాల్, ధర్మపురి మండలాల్లో 90,000 మది బీడీ కార్మికులు పని చేస్తున్నారు. సుమారుగా రెండు కుటుంబాల్లో ఒకరు బీడీలు చేసుకొనే పనిమీద ఆధారపడి జీవిస్తుంటారు. ఈ ప్రాంతాల్లో 60శాతం మంది బీడీ తయారు చేసే పనిమీదే బతుకుతున్నారు.

బీడీ కార్మికులకు ఐడెంటీ కార్డులు, పాస్‌బుక్‌లు ఇస్తాము. పిల్లలకు స్కూల్లలో అటెండెన్స్‌కు రోజుకు 2 రూ. కట్టిస్తాము. 3, 4 తరగతులు చదివే వారికి డ్రస్‌లు ఇస్తారు. పిల్లలు చదువుకోవడానికి 500 రూ. నుండి 5000 రూ. వరకు స్కాలర్‌షిప్పులు ఇస్తారు. 10వ తరగతి చదువుకొనే వాళ్ళకు 1500 రూ. స్కాలర్‌షిప్ వస్తుంది. స్త్రీలకు ప్రసూతి ఖర్చులు ఇస్తారు. ఈ కార్మికులకు చూపుతగ్గిందంటే కంటి అద్దాలు ఇస్తారు. టీబీ వంటి అనారోగ్యం వస్తే హాస్పటల్‌లో ఖర్చులు అన్నీ ప్రభుత్వం భరిస్తుంది.

**బి.ప్రభాకర్**

నేను ప్రస్తుతం ఆర్టీసిలో ఉద్యోగం చేస్తున్నాను. జగిత్యాలలో బీడీ కార్మికులు ఎక్కువగా వున్నారు. స్త్రీలలో నూటికి డెబ్బై మంది బీడీ కార్మికులే. ఉన్న దానితో అంటే ఆర్థికంగా తక్కువ జీతంతోనే జీవనం గడుపుతున్నారు.

'బతుకుపోరు' నవల గురించి మన భాషలోనే, వ్యవహారికంలోనే రాయాలని నేను పట్టుదలతో వాదించిన. పుస్తకంలో మార్పులు, చేర్పులు చేసి 1981 సం॥లో చివరికి నవల రచనకు ఒక రూపం తెచ్చినాము. నేను ఆర్టీసీ రీజనల్ మేనేజర్ కార్యాలయంలో పని చేసే తోటి ఉద్యోగుల నుండి కూడా పుస్తక ప్రచురణకు చందాలు వసూలు చేసి ఇచ్చి తోడ్పడ్డాను.



## గుర్రం నరహరి (ఏజెంటు), జగిత్యాల

నేను, బి.ఎస్.రాములు, మేనపురి రాజనర్సయ్య చిన్నప్పటి స్నేహితులం. చిన్నప్పుడు చదువుకుంటూ బీడీలు చేసినాము. నేను మొదట బీడీలు చేసి తరువాత బీడీలు చేసే కంపెనీలో పని చేసిన. తర్వాత కండక్టర్ ఉద్యోగం వచ్చింది. పోయింది. బీడీల కంపెనీ పెట్టి నడిపిస్తున్న. 30 ఏళ్ళ నుంచి బీడీల కంపెనీ నడిపిస్తున్న. గిదే ఇల్లు. పైసల్లేక సగం జాగా వేరేవాళ్ళకు అమ్మిన. ఇప్పుడు ఇదే రెండు అర్రల ఇల్లు మా సొంతం. దీని దర్వాజలు చూసింర్రు కదా. ఇవి కట్టెవి కాదు. సిమెంట్ తోటి చేసినవి. తక్కువ రేటని



**పరిశోధకురాలు, బీడీ కమిషన్ ఏజెంట్ గుర్రం నరహరి దంపతులు, రిటైర్డ్ టీచర్ మ్యానపురి రాజనర్సయ్య**

సిమెంట్ దర్వాజ ఫ్రేములు కొనుకొచ్చి పెట్టిన. బీడీ కంపెనీలో అంత లాభమేమి లేదు. అందుకని అట్లా ఇట్లా కష్టపడి ఒక రూపాయి కాయిన్ టెలిఫోన్ బూత్ ఈ నడుమనే పెట్టిన. పిల్లలు ఎదిగింర్రు. వాళ్ళకు కూడా పెద్ద ఉద్యోగాలేమీ రాలేదు. వీడియో మిక్సింగ్ నేర్చుకున్నరు. ఒక కొడుకు సెల్‌ఫోన్ రిపేరింగ్ నేర్చుకుంట అంటున్నడు.

ప్రస్తుతం నేను హీరాలాల్, ప్రభులాల్ కంపెనీ బీడీ కమిషన్ ఏజెంటుగా బీడీ కంపెనీ నడిపిస్తున్న. మా ఆవిడ కూడా బీడీలు చేస్తది. బీడీల కంపెనీ పని కూడా చూసుకుంటది. నేను బీడీల కంపెనీ ఆఫీసుకు పోయి తంబాకు ఆకు తెస్తుంట. బీడీలు ఎక్కువ చాటను కాకుండా చూసుకుంట. బయట పనులు చూసుకుంట. బీడీలు లెక్కపెట్టుకొని తీసుకుంట. ఆకు తంబాకు జోకి వేస్తుంట. కొందరికి ప్రావిడెంట్ ఫండ్ ఖాతాలున్నయి. కొందరు రిటైర్‌మెంట్ తీసుకున్నరు. యువతరం పిల్లలు ఇప్పుడు బీడీల

మీద ధ్యాస పెడతలేరు. చదువుకుందామని బడికి పోతున్నరు. కాలేజీలకు పోతున్నరు. అందువల్ల బీడీలు చేసే వాళ్ళు మా కంపెనీలో తగ్గుతున్నరు. పల్లెటూరి కంపెనీలలో బీడీలు ఎక్కువ మందే చేస్తున్నారు. జగిత్యాలలో కృష్ణనగర్‌లో వున్న నా కంపెనీలో నాకు మాత్రం ఎక్కువ బీడీలు తయారవుత లేవు. తంబాకు కూడా కార్మికులకు అందరికీ సరిపడేంత కంపెనీ ఆఫీసు వాళ్ళు ఇస్తలేరు. ఇప్పుడు కొత్త పని ఏం చేయలేక వున్న పని అని కంపెనీ నడిపిస్తున్నం.

నాకు ఇలా బీడీలు చేయించినందుకు మునుపు జీతం ఇచ్చే వాళ్ళు. జీతం ఇచ్చి బీడీలు చేయిస్తే ఆ కంపెనీని జాతి కంపెనీ అని పిలుస్తరు. ఇల్లు కిరాయి, కరెంటు బిల్లు మొదలైనవి అన్నీ బీడీ కంపెనీ వాళ్ళే కట్టుకోవాలి. ఇవన్నీ రిస్కులు ఎందుకని వెయ్యి బీడీలు చేయిస్తే ఇంత కమిషన్ ఇస్తం అందులోకెల్లె అన్ని కిరాయిలు గంపమోసే కూలి మొదలైనవన్నీ పెట్టుకోవాలె. మిగిలితే జీతం కింద భావించాలి అని కమిషన్ ఇస్తరు. నాకు బీడీలు చేయించినందుకు వెయ్యి బీడీలకు 3రూ.70పై. కమిషన్ ఇస్తరు. పొగాకు లాసు వస్తే ఒక కిలోకి 50 రూపాయలు. ఆకు లాసు వస్తే కిలోకి 60 రూ నాకు ఇచ్చే డబ్బుల్లో తగ్గించి ఇస్తారు. దీనివల్ల నాకు నష్టం వస్తుంది. ఆకు 550 గ్రాములు ఇస్తే 1000 బీడీలు చేసి ఇవ్వాలి. 10 శాతం ప్రావిడెంట్ ఫండ్ కంపెనీ షేర్‌ను ఇస్తున్నారు. వెయ్యి బీడీలు చేసినందుకు కార్మికులకు 65 రూ.ల 56 పైసలు ఇస్తారు. మేము ఆకు 500 గ్రాములు ఇస్తాము. పొగాకు 170 గ్రాములు ఇస్తాము.

వర్ధీ బీడీలు చేయడం. వర్ధీ అంటే నగదు. వెంటనే బీడీలకు డబ్బులు ఇస్తారు. తంబాకు, దారం అన్నీ కార్మికులే తెచ్చుకొని బీడీలు చేసి ఇస్తే 70 రూపాయలు ఇస్తారు. ఇలా వర్ధీ బీడీలను చేసే వాళ్ళు కూడా వున్నారు. డబ్బులు సరిగా అందక పేదరికం వల్ల ఏ రోజు కూలి ఆ రోజే చేతికొస్తుందని ఇలా కేవలం కూలీ పైసల మేరకే ఆకు తంబాకు కొనుక్కొని బీడీలు చేసి ఇస్తున్నారు కొందరు. ఇది వారి పేదరికానికి చిహ్నం. కొందరు మైక్రోఫైనాన్స్‌లో అప్పు తీసుకొని రోజు వారి కిస్తులు కట్టలేక వర్ధీ బీడీ చేసి కడుతున్నారు. దీనివల్ల వాళ్ళు ఎంతో నష్టపోతున్నారు.

ఏప్రిల్ ఒకటవ తేదీ 2007 నుండి ప్రభుత్వం బీడీలకు జగిత్యాల వంటి మున్సిపల్ ఏరియాల్లో ఈ కింది విధంగా కూలి నిర్ణయించింది.

1. వేజెస్ వెయ్యి బీడీలకు : రూ.50.35 పై.లు
2. వి.డి.ఏ. : రూ.6 50 పైసలు
3. పండగ సెలవుల కూలి 5% : రూ.2.84 పైసలు
4. పండగలు 2% : రూ.1.14 పై
5. బోనస్ : 8.33 % : రూ.4.73 పై.

వెయ్యిబీడీలకు మొత్తం : రూ.65.56 పై.

ఇందులో కూలీలో 10శాతం ప్రావిడెంట్ ఫండ్ ఖాతాకు జమ చేస్తారు. మరో



10 శాతం బీడీ కంపెనీ ఆఫీసు వాళ్ళు కార్మికుల పేరిట జమ చేస్తారు. ఇలా 20% ప్రావిడెంట్ ఫండ్ ఖాతాలో జమ అవుతూ వుంటుంది. దీనికి వడ్డీ కేంద్ర ప్రభుత్వం తన విధానాలను అనుసరించి ఎప్పటికప్పుడు రేటు కట్టిస్తుంటుంది. బీడీ కార్మికులకు రిటైర్‌మెంట్ తర్వాత 300 నుండి 500 రూ.ల దాకా పెన్షన్ ఇస్తున్నారు.

**కళావతి (49 సం॥లు), బీడీ కార్మికురాలు**

నేను, బి.ఎస్.రాములు ఒకేచోట కలిసి బీడీలు చేసినాం. ఇప్పుడు బీడీలు చేస్తలేను. నేను తొమ్మిదేళ్ళ వయస్సు నుండి బీడీలు చేసిన. ఇప్పుడు బీడీ కార్మికులకు కష్టాలు ఎక్కువయినై. మంచి బీడీ ఆకు దొరకడం లేదు. వెయ్యి బీడీలకు రెండు గుల్ల కట్టలు ఉచితంగా ఇవ్వాలి. అలా నెలకు మూడు నాలుగు వందల రూపాయల నష్టం జరుగుతున్నది. గంప ఛాటను ఎక్కువైందని కూలి పైసలు తగ్గించి ఇస్తున్నారు. చెత్త ఆకు తక్కువ రేటుకు కొని ఇస్తున్నరు. దానివల్ల ఆకు అనుకున్నంత వెళ్ళడం లేదు. దాంతో ఆకు కోసం కూలి కోసుకుంటున్నరు. చేసినంత మేరకు ఆకు తంబాకు ఇస్తలేరు. వెయ్యి బీడీలు చేయగలిగే వాళ్లకు 600ల బీడీలకు ఆకు తంబాకు ఇస్తున్నారు. పేదోళ్ళు బీడీల మీద ఆధారపడి బతుకుడు కష్టమైతన్నది.

**మ్యానపురి రాజనర్సయ్య (58 సం॥లు), రిటైర్డ్ హెడ్మాస్టర్**

నేను, బి.ఎస్.రాములు చిన్నప్పటి నుంచి స్నేహితులం. మేము ఆ ఆరోజుల్లో చదువుకునేటప్పుడు అనగా 1964 నుండి 1970 మధ్య కాలంలో మా అక్కకు బీడీలు చేసేటప్పుడు బీడీలకు దారం కట్టేవాన్ని. బడి వున్నప్పుడు ఉదయం, సాయంత్రం అక్కకు ఇలా సహాయం చేసే వాణ్ణి. సెలవుల్లో పొద్దంతా చేసే వాణ్ణి. ఇలా బీడీలకు దారం కట్టితే రెండు గంటలకు 3 పైసలు చొప్పున ఇచ్చేది.

**శ్రీనివాస్ (వార్త దినపత్రిక జర్నలిస్ట్), కరీంనగర్**

జూన్ 1, 2007 నుండి పుర్రెబొమ్మ, శవం గుర్తు పెట్టాలని కేంద్ర ప్రభుత్వం నిర్ణయించింది. దీంతో బీడీ కార్మికులు ఆందోళన చెందుతున్నారు. రాజకీయ పార్టీలు ఏం చేస్తున్నాయి? టిఆర్ఎస్ నాయకులు ఏం చేస్తున్నారు? చంద్రబాబు నాయుడు ఆరోగ్య దృష్ట్యా నష్టం అంటే బీడీ కార్మికులు అందరికి ఉపాధి చూపించాలంటారు? ఇది సాధ్యమేనా? కార్మికులకు పుర్రె బొమ్మ వల్ల నష్టాలు, ఫలితాలు గురించి అవగాహన లేదు. జీవితం తెలుసు. అందుకని బొమ్మను తీసెయ్యాలంటారు. పుర్రెబొమ్మ వల్ల మినీ సిగరెట్ కంపెనీలు లాభాలు పొందడానికి ఇలా చేస్తున్నారు!

### మచ్చ గంగారామ్, రిటైర్డ్ టీచర్,
### తెలుగు పండిట్ శిక్షణా కళాశాల లెక్చరర్, పద్మశాలి సేవా సంఘం, జగిత్యాలకు
### మూడవసారి అధ్యక్షులు. వయస్సు:69

మేము వెళ్ళే సరికి సారు పద్మశాలి సంఘం ఆధ్యక్షహోదాలో ఏదో భార్యభర్తల గొడవ గురించిన చర్చ వింటున్నారు. మేము వెళ్ళిన తర్వాత అది ఆపి మా గురించి అడిగారు. బి.ఎస్.రాములు గారితో కుశల ప్రశ్నలు అయ్యాక ఇలా చెప్పుకొచ్చారు.

చేనేత వృత్తి నశించిన తర్వాత బీడీలు చేయడం ప్రధాన ఆదాయ వనరుగా, వృత్తిగా కొనసాగింది. ఇప్పుడు అది కూడా పుర్రె గుర్తు పెట్టాలంటూ వృత్తిని దెబ్బతీసే విధంగా ప్రవర్తిస్తున్నారు. లక్షలాది బీడీ కార్మికులు ఎట్లా బతకాలి? మద్యం తాగి ఎంతో మంది అనారోగ్యం పాలవుతున్నారు. ఎన్నో హత్యలు చేస్తున్నారు. కుటుంబాలు విచ్ఛిన్నం



మచ్చ గంగారామ్, బి.ఎస్.రాములు, మాలతి చంద్ర, బూస రాజేశం

అవుతున్నాయి. భార్యా పిల్లలను కొడుతున్నారు. వాటి మీద ముందు పుర్రె బొమ్మ, శవం బొమ్మ ఎందుకు వేస్తలేరు? పేదల కడుపు కొట్టే విధంగా బీడీల మీదనే పుర్రె గుర్తు, శవం బొమ్మ వెయ్యాలని ఎందుకు అంటున్నారు? బీడీలు తాగి ఎవరైనా రోడ్ల మీద పడిపోయిండ్రా? బీడీలు తాగి కుటుంబాలు విచ్ఛిన్నమైనయా? బీడీలు తాగిన వాళ్ళకు రోగాలు వస్తున్నయ్ అంటున్నారు. ఎక్కడైనా రుజువైందా? అట్లా బీడీల తోటి ఆరోగ్యం చెడిపోతుందంటే దేశంలో పొగాకు పంటనే పండించడం నిషేధించాలె. బి.ఎస్.రాములు గారన్నట్లు గంజాయి పంటను నిషేధించినట్లు పొగాకు పంటను నిషేధించాలి. సిగరెట్లను నిషేధించాలి. మద్యపానాన్ని నిషేధించాలి. మద్యపాన పరిశ్రమలను నిషేధించాలె.



బీడీల వల్ల లక్షలాది ప్రజలు బతుకుతున్నారు. అడవుల్లో బీడీ ఆకు తెంపి గోండులు, లంబాడి గిరిజనులు పొట్టపోసుకుంటున్నారు. పొగాకు రైతులు బతుకుతున్నారు. పొగాకు గ్రేడింగ్‌లో గుంటూరు, కృష్ణ, ప్రకాశం జిల్లాల్లో వేలాది మంది కూలీలు బతుకుతున్నారు. బీడీలు చేస్తూ లక్షలాది మంది బతుకుతున్నారు. ఎంతోమంది బీడీలు చేసి చదువుకొని పైకి వచ్చారు. ఎంతోమంది టీచర్లు అయిండ్రు. తమ పిల్లలను బీడీలు చేసుకుంటు చదివించి పైకి తెచ్చిండ్రు. ఇంతమందికి వేరే వృత్తి ఏం కల్పిస్తరు? కల్పించేదైతే ఆ వృత్తి ఇన్ని రోజుల నుంచి ఎందుకు కల్పించలేదు? బలవంతంగా ఒక వృత్తి కల్పించి ఎన్ని రోజులు బతికించగలరు? వృత్తి దానికది బతకగలగాలె. పేద ప్రజల జీవితాలతో ప్రభుత్వాలు ఆడుకుంటున్నాయి. ఇది న్యాయం కాదు.

లక్షలాది ప్రజల జీవితాలకు ఆసరా అయిన బీడీ పరిశ్రమ ఈ ప్రాంతంలో ఎంతో ప్రాధాన్యత సంతరించుకుంది. అందరి జీవితాల్లో భాగం అయిపోయింది. కోట్లాది ప్రజల జీవితాలను నాశనం చేస్తున్న మద్యపానాన్ని నిషేధించాలి. మద్యం మీద ప్రభుత్వాలకు పన్నుల రూపంలో బోలెడు డబ్బు వస్తున్నదని నిషేధించడం లేదు. డబ్బు కోసం ప్రభుత్వాలు ఇలా మద్యానికి ప్రజలను అలవాటు చేయించి ప్రజల జీవితాలను నాశనం చేయడం నాగరిక ప్రభుత్వాలు చేయదగిన పని కాదు. ఏమైనప్పటికీ బీడీ కార్మికుల మీద కక్ష గట్టి సిగరెట్టులు అమ్ముకోడానికి మార్గం సులభం చేయడం కోసం ఈ పుర్రె గుర్తు బొమ్మలను ముందుకు తెచ్చిండ్రు. దీన్ని అందరూ వ్యతిరేకించాలి. మా ఇంట్లో కూడా 50 ఏండ్ల నుంచి మూడు తరాలు బీడీలు చేస్తున్నారు.

**రాజేశ్వరి – మచ్చ గంగారామ్ గారి భార్య, వయస్సు : 60 ఏళ్ళు.**

నేను చిన్నప్పటి నుంచి బీడీలు చేస్తున్న. నాకు ఎప్పుడు పెండ్లైందో గుర్తు లేదు. ఏడేండ్లకో, ఎనిమిదేండ్లకు పెళ్ళి చేసిండ్రట. ఈ మధ్యలోనే బీడీలు చేసుడు బంద్ పెట్టిన. నా కోడలు, మా ఆడోళ్ళు ఇంకా బీడీలు చేస్తున్నారు. నా కొడుకులు టీచర్లుగా పని చేస్తున్నారు. ఒక కోడలు బి.ఇడి. చేసింది. ప్రైవేట్ స్కూల్లో పని చేస్తున్నది. ఇంకో కోడలు బీడీలు చేస్తున్నది.

బీడీలు తాగితే రోగం వస్తుందని అంటున్నారు. బీడీలు తాగకపోతే రోగాలు వస్తలేవా? బీడీలు తాగనోళ్ళకు ఏ రోగాలు వస్తలేవా? బీడీలు తాగితేనే వ్యాధి వచ్చిందని ఎవరైనా చెప్పగలరా? బీడీలోని తంబాకు ఆరోగ్యానికి నష్టమంటే దేశంలో పొగాకు పంటనే నిషేధించాలె.

బీడీలు తయారు చేయడమంటే దీని వెనక లక్షల మంది బతుకుతున్నరు. మూడు నాలుగు లక్షల మంది తునికాకు తెంపే వాళ్ళు, పొగాకు పండించే రైతులు మూడు లక్షల మంది, 15 లక్షల మంది బీడీలు చేసే వాళ్ళు బతుకుతున్నరు. బీడీలు తాగి హత్యలు చేస్తున్నారా? బీరు, బ్రాందీ, విస్కీ తాగి సారా తాగి హత్యలు చేస్తున్నరు. తాగి

పెళ్ళాన్ని కొడుతున్నరు. బీడీలు తాగి పెళ్ళాన్ని కొట్టినోళ్లున్నరా? మద్యం మీద పుర్రె బొమ్మలు వేయడం లేదు. వీటన్నిటికన్నా ప్రమాదకరమైనదా బీడీ?

ఒక సిగరెంట్‌లో వుండే తంబాకు పది బీడీలలో వుంటుంది. అలాంటప్పుడు సిగరెట్ నిషేధించకుండా బీడీల మీద పుర్రె బొమ్మ ఎందుకు వేస్తున్నారు? మా సారు అన్నట్లు పేద వాళ్ళ వృత్తిని గుంజుకోవడంలో ఆంతర్యం ఏమిటి? మా సమస్యలు అన్నీ రాజకీయ నాయకులకు ఎలక్షన్లకు ఒక రాజకీయ వేదిక అయింది. సిరిసిల్ల ప్రాంతంలో పవర్‌లూమ్స్ పెట్టడం వల్ల చేనేత కార్మికులకు కొద్దిగా కూలి దొరుకుతున్నది. దానికి తోడుగా ఆడోళ్ళు బీడీలు చేస్తున్నరు. ఇద్దరి కూలి పైసల తోటి కుటుంబం వెళ్ళదీస్తున్నరు. చాలాసార్లు పవర్‌లూమ్‌లు పనిలేక బందుంటున్నాయి. అప్పుడు ఆడోళ్ళు చేసే బీడీల పైసలే కుటుంబానికి ఆధారం అవుతున్నాయి. బీడీలు బంద్ పెడితే వీళ్ళందరు ఎట్లా బతకాలి? పుర్రె గుర్తు, శవం బొమ్మను పెట్టాలనే ఆలోచననే తీసెయ్యాలి.

